# వందేమాతరం




మొదటి జాతీయ పతాక, 1906



కె.ఎన్.ఎస్. రాజు

# వందేమాతరం

కె. ఎన్. ఎస్. రాజు B.A. C.C.A.,

ప్రథమ ముద్రణ : 1999

వెల : రూ. 75/-

ప్రతులకు :

కె. ఎన్. ఎస్. రాజు
ఇంటి నెం. 45-142-32-1,
వేంకటరమ   కాలనీ,
కర్నూలు - 5   :003.

ముఖ చిత్రం :

శ్రీ బాలి

ముద్రణ :

శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్
33-5-9, సీతారామపురం, విజయవాడ - 2.
ఫోన్స్ : 0866 - 431422, 439463



**కీ.శే. కరణం నారపురాజు పుల్లమ్మ గారు**

(కీర్తిశేషులు కరణం నారపురాజు ఈశ్వరయ్యగారి ధర్మపత్ని)

మాతృమూర్తి పాద పద్మములకు
నా ఈ 'వందేమాతరం'
నవలా పుష్పం
అంకితం.

- కె.ఎన్.ఎస్. రాజు

# కృతజ్ఞతలు !

రచనా కాలంలో సంపూర్ణ సహకారాన్నందించి, ప్రోత్సహించిన ప్రియమిత్రుడు, రచయిత శ్రీ అజీజ్ గారికి -

అందంగా ముఖ చిత్రాన్ని అందించిన శ్రీ బాలి గారికి -

ముద్రణాపరంగా నవలని ఆకర్షణీయంగా వెలువరించిన శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్ అధినేత శ్రీ యస్వీ. శేషగిరిరావుగారికి నా కృతజ్ఞతలు !

- కె.ఎన్.ఎస్. రాజు

రచయిత

# నవలకు ముందు....

'రచయిత' అయిన వారికి తాను చేస్తున్న రచనలపట్ల కొద్దోగొప్పో 'కమిట్‌మెంట్' వుండితీరాలి ! అలా కమిట్‌మెంట్ వున్న రచయిత, శ్రీ కె.ఎన్.ఎస్. రాజుగారు ! భవిష్యత్ తరాల వారికి కర్నూలు జిల్లాలో వున్న రచయితల జీవిత విశేషాలు గురించి తెలియాలన్న ఆశయంతో 1994లో వ్యయ ప్రయాసలకోర్చి "కర్నూలు జిల్లా రచయితల చరిత్ర" పుస్తకాన్ని ప్రచురించారు. ప్రస్తుతం 'వందేమాతరం' అన్న ఈ నవలను ప్రచురిస్తున్నారు. ఈ నవల కథానాయకుడు, ఆంధ్రదేశపు తొలి రాజకీయ ఖైదీ, స్వాతంత్ర్య సమరయోధుడు, గ్రంథాలయ ఉద్యమ నిర్మాత అయిన గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు ! ఇలాంటి వ్యక్తి కర్నూలుజిల్లా వాసి కావటం, నిజంగా ఈ జిల్లా వాసులు గర్వించదగ్గ విషయం.

కె.ఎన్.ఎస్. రాజు గారు వ్రాసిన ఈ నవలలో సుమారు 55 ఏళ్ళ ఆంధ్రదేశ రాజకీయ చరిత్ర (1905-1960) అగుపిస్తుంది. వందేమాతర ఉద్యమం మొదలు విశాలాంధ్ర ఉద్యమం వరకు ఈ నవలలో చిత్రీకరించటం జరిగింది. నాకు తెలిసి 145 సంవత్సరాల తెలుగు నవలా సాహిత్యంలో ఆంధ్రదేశపు రాజకీయానికి సంబంధించి, ఇంతపెద్ద కాలనేపథ్యం వున్న నవల ఇదే మొదలని చెప్పవచ్చు !

నిస్వార్థ రాజకీయ నాయకుని, ప్రజాసేవకుని జీవితం చివరికెలా పరిణమిస్తుందో ఈ నవల ద్వారా రాజుగారు కళ్ళకు కట్టినట్టుగా చిత్రీకరించారు. మరి గాడిచర్లలాంటి నిస్వార్థ ప్రజా సేవకునికి, ఏ పదవీ దక్కలేదు సరికదా, చివరికి ప్రజలు సైతం అతన్ని విస్మరించిన ఈ సమయంలో, రాజుగారు వారి జీవిత కథను నవలా రూపంలో మన ముందుకు తేవటం, నిజంగా అభినందనీయం !

రచయిత అన్నవాడు ఎన్ని కల్పిత రచనలు చేసినా, తెరమరుగైపోతున్న ఇలాంటి వ్యక్తుల జీవిత చరిత్రలు కూడా వ్రాయటం, తన విధిగా భావించాలి ! కనీసం, తెరమరుగయిన ఒక వ్యక్తి జీవితాన్నయినా వెలికితీసి పాఠకులకు అందించగలిగిననాడే, అతను సమాజంపట్ల బాధ్యత వున్న రచయితగా పరిగణింపబడతాడు ! కాల్పనిక సాహిత్యం ఎంత వ్రాసినా, అవి విలువను సంపాదించుకుని, చరిత్రలో నిలబడలేవు. ఇలాంటి రచనలు చేసిననాడే రచయితకు కొంత వునికి అయినా మిగులుతుంది.

సాహిత్య తపనవున్న వ్యక్తి రాజుగారు ! ఆ తపనకు నిదర్శనం ఈ నవల ! ఈ నవల తప్పక వారికి మంచిపేరు ప్రఖ్యాతులు సంపాదించి పెడుతుందనడంలో సందేహం లేదు. ఒక మంచి నవల గురించి 'ముందుమాట'గా ఈ రెండుమాటలకంటే ఎక్కువగా చెప్పటం అతిశయోక్తి అవుతుంది.

- యస్.డి.వి. అజీజ్

14-10-99

కర్నూలు.

# అర్ధరాత్రి స్వాతంత్ర్యం

"నా దేశానికి అర్ధరాత్రి స్వాతంత్ర్యం వచ్చింది !

ఇంకా తెల్లారలేదు !"

– ఇందులో ఎంత నిగూఢ భావమున్నది !

భావమునకు కవిత ఎంత చక్కగా తోడైనది !

గత చరిత్ర విప్పి చూస్తే కనిపించేవన్నీ అక్షరసత్యాలే...

భరతజాతిపట్ల బ్రిటిష్ ప్రభుత్వం అనుసరిస్తోన్న ద్వంద్వనీతిని భారతీయులు కళ్ళారా చూశారు !

బాధాతప్త హృదయులైనారు !

స్వరాజ్యం కోసం వాళ్ళ హృదయాలు ఎంత తపన చెందాయి !

ఎంత మదనపడ్డాయి !

ఎంత ఆరాటపడ్డాయి !

స్వాతంత్ర్యదీక్షతో ఉద్యమంలో·దుమికినారు. ఆ పోరాటంలో.....

ఎన్ని కష్టాలు.... ఎన్ని నష్టాలు.... ఎంత చిత్రహింసలు !

ఎందరి ప్రాణాలు ఆహుతయ్యాయో ! ....

చిట్ట చివరకు మహాత్మాగాంధీ నాయకత్వంలో స్వాతంత్ర్య భానూదయం అయింది !

తెల్లదొరల పాలనకి తెరపడింది !

దేశం యావత్తూ ఆనంద సాగరంలో తేలిపోయింది !

ఆనాడు అది ఒక జాతీయ పండుగ !

వేడుకలే జరిగాయి !

వినోదాలే జరిగాయి !

మరి నేడు...

ఆ ఆనందం ఏమయ్యింది ?

ఆ త్యాగాలు ఏమయ్యాయి ?

ఆ నీతి, నైతిక విలువలు ఏమైపొయ్యాయి ?

అన్నీ ప్రశ్నార్థకాలే ........ ? ? ?

గాంధీజీ కలలు కన్న రామరాజ్యం ఏమైంది ?

మనం సాధించిన స్వరాజ్యం –

సురాజ్యమా !

ఆ రోజులు మళ్ళీ వస్తాయా ?

అలనాటి నాయకులు మళ్ళీ అవతరిస్తారా ?

అవతరించినా వాళ్ళ మాటలు వింటారా ?

ఏమో ! ! !

ఈ దేశం మనకేమిచ్చింది అన్నదికాదు ప్రశ్న !

ఈ దేశానికి మనమెంత సేవ చేశాం అని ప్రశ్నించుకుంటే ఏ ఒక్కరి హృదయాకాశంలో సమాధానం ఉదయిస్తుందా ?

ఏమో ?

పడమట సూర్యుడు ఉదయిస్తాడు అన్నదాంట్లో ఎంత నిజముందో ఆ ప్రశ్నకు సమాధానం అంతే నిజం !

కాలమెప్పుడూ ఒకే రీతిలో వుండదనుటకు ప్రభల నిదర్శనమేమో ! .

ఈ రోజులు వేరు !

ఈ మనుషులు వేరు !

ఈ నాయకులు వేరు !

నిస్వార్థం అంతరించింది !

స్వార్థం తలెత్తింది !

ధన బలం, మూక బలం వున్నవారే నాయకులు - ఏ కొందరో తప్ప.

.....ఆ రోజులలోనే హరిసర్వోత్తమరావులాంటి నిస్వార్ధ నాయకులు వెనుకబడ్డారు.

మారుతోన్న కాలంకొద్దీ వారిని ప్రభుత్వం పట్టించుకోలేదు.

ప్రజలు పట్టించుకోలేదు.

పర్యవసానం ?

ప్రజాసేవే వూపిరిగా భావించిన హరిసర్వోత్తమరావుగారి జీవితం...... ???

ఏమయిందో.... ? ? ?

ఒక్కసారి నవల తెరవండి.......

- కె.ఎన్.ఎస్. రాజు

అధ్యక్షులు

కర్నూలుజిల్లా రచయితల సహకార

ప్రచురణ సంఘం, కర్నూలు.

భ్రమర నిలయం,

కర్నూలు.

1-11-99.

# వందేమాతరం

## 1

1905

కలకత్తా నగరం !

సెంట్ జార్జి ఫోర్ట్ !!

బ్రిటిష్‌వారు కలకత్తా నగరాన్ని ముఖ్య వ్యాపార, పాలక కేంద్రంగా నిర్ణయించుకున్న తర్వాత నిర్మించబడిన కోట అది !

ఆ కోట నలుదిశల కట్టబడిన ఎత్తయిన బురుజులపై సాయుధులైన బ్రిటిష్ సైనికులు, తమకనుచూపు మేరవున్న ప్రాంతాన్ని నిశితంగా పరికిస్తూ, పహారా కాస్తున్నారు. కారణం ?

భారతదేశంలో, ముఖ్యంగా బెంగాల్‌లో, తమ ప్రభుత్వపాలనపై అసంతృప్తి చెందిన ప్రజానీకం చేసే హర్తాళ్ళూ, ఆందోళనలు, ఏ క్షణాన ఉద్యమరూపం దాల్చి, తమ పాలక కేంద్రమయిన సెంట్ జార్జి ఫోర్ట్‌పై ముట్టడి చేస్తాయేమోనని ! కోటముందున్న విశాల ప్రాంగణంలో అశ్వకదళం సిపాయిలు ఆయుధాలు చేతబూని పరుగులు తీస్తూ వున్నారు - ఒకరినొకరు హెచ్చరిక చేసుకొంటూ !

సంధ్యాసమయం కావడం వల్ల, కోటలోనూ, వెలుపలి ఆవరణలోనూ దీపాలు వెలిగించబడ్డాయి ! కోట మొదటి అంతస్తులోని చివరి గది అది ! గది తలుపులు తెరచివున్నా, బయట కాపలా వున్న సైనికులు లోపలికి తొంగిచూడటానికి సైతం జంకుతూ వున్నారు ! వారి కళ్ళలో ఒక విధమైన భీతి ఆవహించి వుంది. ఏ క్షణాన గదిలోపలి నుంచి ఎలాంటి ఆజ్ఞ జారీ చేయబడుతుందో ! ఆ ఆజ్ఞను అమలుపరచడంలో తమవంతు పాత్ర ఏమిటోనన్న సందిగ్ధావస్థ! ఒకరి కళ్ళవంక మరొకరు చూసుకొంటూ, సైగలు చేసుకొంటూ వున్నారే తప్పా, పెదవి విప్పి పలుకరించుకోవడం లేదు.

సమయం గడుస్తూ వుంది !

కాపలావారిలో ఉద్వేగం పెరిగిపోతూ వుంది !

తనలో రేగిన ఉద్వేగాన్ని తట్టుకోలేని ఓ సైనికుడు, ఓరకంట గదిలోకి తొంగిచూసి లిప్తకాలం పాటు నిశ్చేష్టుడయ్యాడు !

గదిలో అసహనంగా అటూ ఇటూ తిరుగాడుతున్నాడు, గంభీరంగా వున్న ఓ వ్యక్తి ! పైపును పదే పదే పీలుస్తూ దీర్ఘలోచనలో నిమగ్నుడయి వున్నాడు. ఆ గదికి కుడివైపున వున్న పెద్ద కిటికీ గుండా వీచేగాలి విసురుకు, చెదిరిన తన తల జుత్తును కూడా పట్టించుకోవడం లేదు. అతని ఆలోచనలన్నీ తను తీసుకోబోయే నిర్ణయం చుట్టే పరిభ్రమిస్తూ వున్నాయి ! అసహనంగా తిరుగుతూనే పదే పదే గదిలోని గోడ గడియారం వంకచూపు నిలుపుతున్నాడు. అలా చూపు నిలుపుతూనే తనలో తానే చిన్నగా గొణుక్కుంటున్నాడు. అతని కళ్ళలో ఎర్రదనం ఆవహించి వుంది ! హృదయంలో అంతకుమించిన కాఠిన్యం కరుడుగట్టుకుని వుంది ! ఆ కాఠిన్యం ఎంత చండ ప్రచండమైనదో అక్కడివారికి తెలుసు కాబట్టే గది బయట కాపలా వున్న సైనికులు లోపలికి తొంగి చూడటానికి సైతం జంకుతున్నారు !

అతను ఎదురుచూసిన సమయం ఆసన్నమైంది కాబోలు గోడ గడియారం టంగుటంగుమంటూ ఎనిమిది గంటలు కొట్టింది ! అదే సమయంలో......

"మే ఐ కమ్ ఇన్ సర్ !"

వినయపూర్వకమైన కంఠస్వరం వినిపించి వెనుతిరిగి 'యస్' అన్నాడతను ! గది లోపలికి వచ్చిన ఆ వ్యక్తి అతనికి అభివాదం చేసి చెప్పాడు.

"మీరు చెప్పిన ప్రకారం ఓకే చేశాను సార్ !"

"గుడ్ !" అతని పెదవులపై చిరు దరహాసం !

"నా అంతరంగానికి అనుగుణంగా నడుచుకునే వ్యక్తులంటే నాకు చాలా యిష్టం. అందుకే ఐలైక్‌యూ వెరీమచ్ !"

అతని ప్రశంశకు కృతజ్ఞతా పూర్వకంగా చూస్తూ ఆ వ్యక్తి "థ్యాంక్యూ సార్ !" అంటూ మరికొంత చేరువగా వెళ్ళి నిలుచున్నాడు !

"టుమారో యు మస్ట్ అరేంజ్ ది మీటింగ్ యగ్జాట్లీ ఎట్ టెన్ ఏ.యం. !"

"యస్.సార్ !" వినయంగా తలపంకించాడు.

"నౌ యుకెన్‌గో !"

మరుక్షణమే అక్కడినుంచి నిష్క్రమించాడు, వచ్చిన ఆ వ్యక్తి !

"ఐవిల్ సీ దేర్ ఎండ్ !" అంటూ దౌడపళ్ళు కొరుకుతూ –

"సోల్జర్స్ !" అంటూ గట్టిగా కేకేసి పిలిచాడు.

అతని పిలుపుకోసమే కాచుకొని వున్న కాపలా సైనికులు అందరూ ఒక్కుమ్మడిగా అతని గదిలోకి ప్రవేశించి అభివాదంచేసి ఒద్దికగా నిలబడ్డారు అతని ఆజ్ఞకోసం !

అతను వారివంక సూటిగా చూస్తూ జారీచేసిన ఉత్తరువు వినేసరికి అక్కడివారికి తమ ప్రాణాలు పైకెగిరిపోయినట్లనిపించాయి. అయినా తప్పదు కాబట్టి "ఓ.కే సర్ !" అంటూ అక్కడ్నుంచి నిష్క్రమించారు తడబడుతోన్న అడుగులతో !

ఈమారు తలగోక్కుంటూ అటూ ఇటూ పచార్లు చేశాక తాపీగా ఓ వాలుకుర్చీలో వాలిపోయి, తిరిగి పైపు కాల్చడంలో నిమగ్నమయ్యాడు. అతను కాలుస్తున్న పైపులోనుంచి వస్తోన్న పొగ అతను తలపెట్టబోయే దౌష్ట్య చర్యకు ప్రతీకలా వుంది !

భారతదేశంలో బ్రిటిష్ రాజప్రతినిధిగా అనేక దౌష్ట్య చర్యలకు, దురాగతాలకు అతను పెట్టింది పేరు అతని పేరే విలియం లార్డ్ కర్జన్ !!!

*　　　　*　　　　*

సెంట్ జార్జిఫోర్టులో 'టంగ్ టంగ్' మంటూ పదిసార్లు గంట మ్రోగింది. లార్డు కర్జన్ గదిలో సమావేశం ప్రారంభమైంది. పలువురు ఉన్నతాధికారులు వారి హోదాలలో కేటాయించిన ఆసనాలపై ఆశీనులయ్యారు !

పైకి తీవిగా కన్పించినా – అందరి హృదయాంతరాల్లో అంతులేని ఆరాటం !

అత్యవసరంగా ఏర్పాటైన సమావేశం పర్యవసానం ఏమిటో ?!

అది ఎలా పరిణమిస్తుందో – అని ??!

అందరిలో ఉత్కంఠ ! అసలే చండశాసనుడు ! తను పట్టుకున్న కుందేలుకు మూడే కాళ్ళని భావించే మనస్థత్వం లార్డ్ విలియం కర్జన్‌ది !

ఇంతలో "గుడ్‌మార్నింగ్ ఆఫీసర్స్ !"" అంటూ కర్జన్ సమావేశాన్ని ప్రారంభించగానే అందరి కళ్ళు, ఒకేసారి కర్జన్ వేపు కేంద్రీకృతమయ్యాయి !

కర్జన్ గంభీర స్వరంతో చెప్పుకుపోసాగాడు.

"బెంగాలీలలో జాతీయభావం బాగా రగుల్కొన్నదన్న విషయం మీకందరికీ తెలిసిందే! వారు క్రమ క్రమంగా దేశాన్ని మేల్కొలిపి, బ్రిటిష్ అధికారాన్నే సమాధి చేసి, తమ దేశానికి స్వాతంత్ర్యాన్ని తేవాలనే ఆలోచనతో వున్నారు. ఈ దేశంలో మన ఆంగ్లవిద్య వ్యాప్తి చెందిన కారణంగా బెంగాలీయులలో కొందరు మేధావులై, ప్రజలలో జాతీయ భావం రేకెత్తించడానికి

పూనుకొంటున్నారు. ఈ పరిణామాన్ని మనం ఉపేక్షిస్తే మన మనుగడకే ప్రమాదం ! తిన్న ఇంటివాసాలు లెక్కపెట్టే ఈ జాతిని అణగద్రొక్కేంతవరకు మనం నిద్రపోరాదు ! మనల్ని నమ్మి మనకీ పెత్తనం అంటగట్టింది ప్రభుత్వం. మన పాలనకు ఎవరు విఘాతం తలపెట్టినా నిర్దాక్షిణ్యంగా అణచివేయడం మనందరి కర్తవ్యం ! ఇందుకు ఒకటే మార్గం ! 'విభజించి పాలించు' అనేది మన సిద్ధాంతం. టూ బర్డ్స్ ఎట్ ఎ షాట్ – డివైడ్ అండ్ రూల్ బెంగాలీయులను దెబ్బతీయడానికి ఇది మంచి అవకాశం. రాష్ట్రాన్ని రెండుగా విభజించి వారి జాతీయ ఐక్యతకు భంగం కల్గించడం......" అంటూ మరేదో చెప్పబోతుండగా ఓ అధికారి లేచి తన అనుమానాన్ని వ్యక్తపరచాడు.

"ఈ ఏర్పాటు వాదానికి పై అధికారులు అంగీకరిస్తారా సార్ !"

ఆ మాటకు కర్జన్ ఉగ్రుడయ్యాడు ! అతని కళ్ళలో ఎర్రటి జీరలు !

కర్జన్ ఆగ్రహానికి భీతిల్లిన ఆ అధికారి మౌనం వహించి కూర్చుండిపోయాడు.

తిరిగి చెప్పటం ప్రారంభించాడు కర్జన్ !

"మన డివైడ్ అండ్ రూల్ పాలసీ ప్రకారం ముందుగా ముస్లిం బెంగాలీలను, హిందూ బెంగాలీల నుండి విడదీయాలి. ఎందుకంటే తూర్పుబెంగాలీలలో అధిక సంఖ్యాకులు ముస్లింలు. ఇదివరకు ఆ ప్రాంతమే రాజకీయ ఆందోళనకు ప్రధాన కేంద్రం. దానిని ప్రత్యేక రాష్ట్రంగా నిర్మాణం చేస్తే, ముస్లింలకు ఒక ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు చేసినట్లవుతుంది. వారినుండి హిందువులను విడదీసినట్టవుతుంది. ఏమంటారు ? అంతేగాక ఈ చర్యవల్ల హిందూ ముస్లింల సమైక్యతను చాలావరకు మనం దెబ్బతీయగలం. తద్వారా జాతీయ ఉద్యమాన్ని అణచి వేయవచ్చు !" అంటూ తన అసలు ఉద్దేశ్యాన్ని సమావేశంలో తెలియచేశాడు కర్జన్.

తమలో తలెత్తిన సందేహాలను అడగటం ప్రారంభించారు అధికారులు.

"యువర్ యక్సలెన్సీ ! ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటుకు వారంగీకరించక ఉద్యమం లేవదీస్తే.....?

"హో.... ఐసీ.... మీకా భయమక్కర్లేదు. అందుకు సరియైన నిర్ణయం నేనాలోచించాను."

"ఎక్స్ క్యూజ్‌మీ సర్ ! మన ఆంగ్ల విద్యాప్రభావం వల్లే అధికమంది మేధావులయ్యారన్నది నిజం ! ఈ మేధావి వర్గాన్ని మన గుప్పిట్లోకి తీసుకువచ్చి ఉద్యమం తీవ్రతను తగ్గించవచ్చు కదా !"

"హౌ..... హౌ ఈజ్ ఇట్ పాసిబుల్ ???"

ఆ అధికారే మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు.

"1833 చార్టరు చట్టంలోనూ, 1858 లో మన విక్టోరియా మహారాణి చేసిన ప్రకటనలోనూ, అర్హులైన భారతీయులకు మనతో సమానంగా ఉన్నతోద్యోగాలు ఇవ్వటానికి వాగ్దానాలు చెయ్యబడినవి. ఈ వాగ్దానాలను చెల్లించమనేగా ముఖ్యంగా విద్యాధికులు ఆందోళన చేయటం ! కాంగ్రెస్ కోరికలలో కూడా ఇది ప్రధానమైన కోరిక ! వారి కోరికను మన్నించి ఉద్యోగాలు వారలకు కేటాయిస్తే, మేధావి వర్గాన్ని మన గుప్పిట్లో వుంచుకున్న వారమౌతాం. తద్వారా ఉద్యమాన్ని అణచివేసినవారం కూడా అవుతాం !"

పై మాటలకు కర్జన్ మందహాసం చేస్తూ అన్నాడు. "వెల్ ! మన ఆంగ్లవిద్య నేర్చుకొన్నంత మాత్రాన, భారతీయులు ఉన్నతోద్యోగాలకు అర్హులౌతారా !.... నో... నెవర్ ! అర్హత పుట్టుకవల్ల, శిక్షణవల్ల, సంప్రదాయాలవల్ల మాత్రమే లభిస్తుంది మైడియర్ జెంటిల్‌మన్! మనకు ఈ అర్హతలన్నీ ఉండటం చేతనే ఉన్నతోద్యోగాలకు మనం అర్హులమయ్యాం. గతంలో ఈ దేశీయుల పట్ల చేసిన వాగ్దానాలు నెరవేర్చకపోయినా అధర్మం కాదు. ఇంకా వాటిని రద్దు చేయడమే ధర్మం ! ఈ దేశీయులు మన క్రింది బానిసలు. ఈ బానిసలకు మనతో సమానంగా ఉద్యోగావకాశాలు కల్పించటం మన కాలిజోడును తీసి మన తలపైన వుంచుకున్నట్టవుతుంది. కాబట్టి వారికి ఉన్నతోద్యోగాలు కల్పించటం కలలోని మాట ! ఇక మేధావి వర్గాన్ని లొంగదీసే విషయమంటారా ! వారిలో వారికి భేదాభిప్రాయాలు కల్గించి వారిని బలహీనులుగా చేసి మన గుప్పిట్లో వుంచుకోవాలి. ఇందుకు సరియైన మార్గం బెంగాల్ విభజనే......!" అంటూ అందరివంక చూశాడు.

అధికారులు అతని రాజకీయ చతురతకు ముగ్ధులై తమ ముందు ప్రవేశపెట్టిబడిన బెంగాల్ విభజన నిర్ణయానికి అంగీకారం తెలిపారు.

వెన్వంటనే అందరివంక ఓమారు ప్రశంసాపూర్వకంగా చూసి, బెంగాల్ విభజన ప్రకటనపై తన ఆమోద ముద్ర వేశాడు లార్డ్ కర్జన్ !

"మైడియర్ జంటిల్‌మెన్ ! నా నిర్ణయాన్ని మీరందరు ఆమోదించినందులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. భారతదేశంలో అలుముకుంటున్న జాతీయ ఐక్యతకు మతం పేర విడగొట్టబోతోన్న ఈ సందర్భంలో లెటజ్ ఆల్ వుయ్ ఎంజాయ్ !"

బ్రాందీగ్లాసుల చప్పుడుతో ఆ గది మారుమ్రోగింది ! మధుపాత్ర అందరి పెదవుల్ని తాకింది. మధువు గొంతుల్లోకి దిగగానే అందరి మనసుల్లో వికృతపుటాలోచనలు ఉవ్వెత్తున ఎగసిపడ్డాయి !

*　　　　*　　　　*

1906, ఏప్రిల్ 10.

తన బంగళాలో రెండు చేతుల్ని నులుపుకొంటూ చిరాకుగా అటూ ఇటూ పచార్లు చేస్తూ వున్నాడు తూర్పుబెంగాల్ లెఫ్టినెంట్ గవర్నరు పుల్లర్ !

రాష్ట్ర విభజన రద్దుకు బెంగాలీయులు లేవదీసిన ఉద్యమం, అతని హృదయంలో రగులుతున్న అగ్నికి ఆజ్యం పోసినట్లయింది. ఆవేశం, ఆగ్రహం పెనవేసుకోగా, ఉద్యమాన్ని అణగదొక్కే వ్యూహం గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు, ఎంత ప్రతిఘటన జరిగినా సరే... అని !

అలా నిర్ణయానికి వచ్చిన ఫుల్లర్ పచార్లు చేయడం మాని చప్పట్లు చరిచాడు.

పక్కగదిలో నుంచి పరుగున వచ్చి విధేయుడై నిల్చున్నాడు అతని ఆంతరంగిక కార్యదర్శి.

"తక్షణం పోలీసు ఉన్నతాధికారిని ప్రవేశపెట్టు !" ఆజ్ఞ జారీ చేశాడు ఫుల్లర్.

"యస్ సార్ !" అంటూ నిష్క్రమించాడు అతని ఆంతరంగిక కార్యదర్శి.

ఈ మారు పచార్లు చేయడం మాని, వాలుకుర్చీలో వాలి ఆలోచనా నిమగ్నుడైన ఫుల్లర్, పోలీసు ఉన్నతాధికారి రాకతో తేరుకుని ప్రశ్నించాడు.

"ఉద్యమ విశేషాలేమిటి ?"

"వందేమాతరం నినాదంతో పేట్రేగిపోతున్న ప్రజా సమూహంపై మన పోలీసులు లాఠీలు ఝుళిపించారు. అందినవారిని అందినట్లు చావమోదినా నినాదాలు చేయటం మానటం లేదు సార్ !"

"ఫూలీష్ ఫెలోస్ ! వందేమాతరం..... వందే.. షేమ్....... షేమ్ ! ఈ నినాదమా వారలను రక్షించేది ! మన మర ఫిరంగులు, తుపాకీ గుళ్ళముందు ఈ నినాదం ఎంత ! ఎంత!! ఎంతసేపో కాదు ! మనం తల్చుకుంటే క్షణంలో ఈ జాతిని సమూలంగా నాశనం చేయగల శక్తి మనకు వుంది – అయినా ఉద్యమాన్ని ఎందుకు అణచలేకపోతున్నారు ?" ఉద్వేగంతో ప్రశ్నించాడు ఫుల్లర్.

"ఉయ్ ఆర్ టేకింగ్ ఆల్ పాసిబుల్ స్టెప్స్ సర్ !"

"నో..... నో... మాటలు కాదు ! చేతల్లో చూపాలి మైడియర్ ఆఫీసర్ ! 'బారిసాల్' సమావేశానికి ఉభయ బెంగాలీల ప్రతినిధులు పాల్గొనబోతున్నారన్న సమాచారం తెలుసు కదా ! మనం వేరు చేసిన ప్రజలు ఈ విధంగా కలవబోవడం పెద్ద నేరం! అండర్‌స్టాండ్ !"

అధికారి మౌనంగా తలవూపాడు.

"అంతేకాదు ! బారిసాల్ నగరానికి, దాని పరిసర ప్రాంతాలకు అదనంగా పోలీసు దళాల్ని తరలించండి ! 'వందేమాతరం' నినాదాన్ని నిషేధించండి ! నిషేధాజ్ఞలు ఉల్లంఘించిన వారిపై కఠినచర్యలు తీసుకోండి ! దిసీజ్ మై ఆర్డర్" అంటూ వాలు కుర్చీలోంచి చప్రునలేచి తన గదిలోకి వెళ్ళిపోయాడు ఫుల్లర్ !

*                    *                    *

పోలీసు దళాలు బారిసాల్ నగరము, దాని చుట్టుపక్కల గ్రామాలంతటా మొహరించబడ్డాయి. వీధులలో తిరుగుతూ, నిషేధాజ్ఞలను ఉల్లంఘించిన వారిపై విశృంఖలంగా ప్రవర్తించారు. ఇళ్ళలో జొరబడి విలువైన వస్తువులను అపహరించి, ఆడవాళ్ళపై అత్యాచారాలు గావించారు. దీనితో ప్రజలు భీతావహులయ్యారు. ఇది ఉద్యమ నాయకులలో తీవ్రసంచలనం సృష్టించింది !

వెంటనే బారిసాల్ నగరంలో ఉభయ బెంగాలీల ప్రతినిధులు సమావేశమై చర్చించి, వూరేగింపుగా వందేమాతరం నినాదాలు చేస్తూ సభాప్రాంగణానికి బయలుదేరారు. ఇరువురు సూపరెంటెండెంట్ల ఆధ్వర్యంలో పోలీసు దళాలు వూరేగింపు వెంట నడిచాయి. పోనూ పోనూ వూరేగింపులో యువకులనేకులు తండోపతండాలుగా కలవటంతో పోలీసులకు చిర్రెత్తుకొచ్చింది "కమాన్ చార్జ్ !" అంటూ పోలీసులకు ఆదేశాన్ని జారీచేశాడు సూపరెంటెండెంట్.

అతని ఆజ్ఞ కోసమే వేచివున్న పోలీసులు విజృంభించారు. లాఠీలు ఝుళిపించారు.. అందినవారిని అందినట్లు చావమోదారు. లాఠీ దెబ్బలకు తమ తలలు చిట్లినా, వీపులపై గాయాలైనా వందేమాతరం నినాదం మాత్రం యువకులు మానలేదు. నినాదం చేస్తున్న చిత్తరంజన్ అను ఒక పిల్లవాణ్ణి చావకొట్టి సమీపంలో వున్న చెరువులో పడవేశారు పోలీసులు. అయినా ఆ పిల్లవాడు తన నినాదాన్ని మానలేదు !

పిల్లవాడని జాలైనా లేకుండా పోలీసులు ప్రవర్తించిన తీరుకు ఉద్యమ నాయకులు తీవ్ర ఆక్షేపణ తెలిపారు. పోలీసు చర్యలను గర్హించారు. వెంటనే వారిని పోలీసులు అరెస్టు చేసి తీసుకెళ్ళారు. అంతేకాదు సమావేశాన్ని నిషేధిస్తూ మేజిస్ట్రేటు జారీచేసిన ఆజ్ఞను పోలీసు అధికారి ప్రకటించాడు. దీనితో సమావేశము రద్దయింది.

ఆ తర్వాత నాలుగు నెలలకు 1906 ఆగస్టు 7వ తేదీన కలకత్తాలోని 'పార్శీబగన్ స్క్వేర్' (గ్రీన్‌పార్క్) లో మొట్టమొదటి 'జాతీయ పతాకం', ఉద్యమకారులు ఎగురవేశారు. ఆ పతాకం ఎరుపు, మధ్య పసుపు, క్రింద ఆకుపచ్చ చారలతో కూడి వుంది. మధ్య చారలో ముదురు నీలంరంగులో దేవనాగర లిపిలో 'వందేమాతరం' అని వ్రాసి వుంది.

తొలిసారిగా జాతీయభావాన్ని రేకెత్తిస్తూ ఆలాపింపబడిన గీతం వందేమాతరం !

వందేమాతరం గీతాన్ని జాతీయగీతంగా ప్రచారం చేస్తూ 'స్వరాజ్యం మన జన్మహక్కు' అంటూ బయల్దేరిందొక త్రయం !

ఆ త్రయం !!!???

"లాల్ - బాల్ - పాల్ !!!"

లాలా లజపతిరాయ్, బాలగంగాధర తిలక్, బిపిన్ చంద్రపాల్ !

స్వరాజ్య పోరాటంలో రాటుదేలుతున్న ఈ ముష్వరు దేశం నలుమూలలా పర్యటించారు. ఆ పర్యటనలో భాగంగా...... ఆంధ్ర దేశానికి పయనమయ్యాడు పాల్ ! బిపిన్ చంద్రపాల్ !

# 2

సంధ్యాసమయం.......

గోదావరి ఒడ్డున ఇసుక తిన్నెలపై కూర్చొని సంజె వెలుగులో సోయగంగా కదలాడే, చిరు అలలవంక తదేకంగా చూస్తూ వున్నాడో పాతికేళ్ళ యువకుడు. నిండైన విగ్రహం అతనిది ! ముఖం కోమలమైనా, గంభీరత చోటు చేసుకొంది ! ఆ గంభీరతకు కారణం ? అతని మస్తిష్కంలో చెలరేగుతున్న బడబాగ్ని లాంటి ఆలోచనలు ! గౌతమీ నదీ తీరాన కూర్చున్నాడన్న మాటేగాని, అక్కడి ప్రకృతి అందించే ఆనందాన్ని ఆస్వాదించలేకపోతున్నాడు. అందుకు మూలకారణం ?

ఆ సేతు హిమాచల పర్యంతం, యుక్తితో, కుయుక్తితో తమ అధికారాన్ని విస్తరింపచేసుకొని పాలన సాగిస్తోన్న తెల్లదొరలపై ప్రతీకార వాంఛ ! అతని అంతరంగ సంద్రంలో ఉవ్వెత్తున ఎగిసిపడే. ఆలోచనల కెరటాలు అతన్ని వుక్కిరిబిక్కిరి చేస్తున్నాయి !

అదే సమయంలో........

"హరీ !" తనకు సుపరిచితమైన కంఠస్వరం వినిపించేసరికి తన ఆలోచనలను తాత్కాలికంగా ప్రక్కకు నెట్టి, వెనుక నిల్చొన్న తన సహపాఠి, మిత్రుడు అయిన రామచంద్రరావు వైపు దృష్టిసారించాడు హరిసర్వోత్తమరావు.

"నీకోసం ! మన కాలేజీ అంతా వెతికాను. నువ్వగుపించలేదు. ఇక్కడుంటావేమోనని వచ్చాను" అంటూ తన మిత్రుని చెంత కూర్చున్నాడు రామచంద్రరావు.

"ఏమిటీ విశేషం ?" అడిగాడు హరిసర్వోత్తమరావు.

"విశేషమే మరి ! వంగరాష్ట్ర బెబ్బులి బిపిన్ చంద్రపాల్, 'వందేమాతరం' ఉద్యమాన్ని మన ఆంధ్రలో నలుదిశలా వ్యాప్తిచేయడానికి గాను, రేపు రాజమహేంద్రవరానికి విచ్చేస్తున్నారట !"

"నిజమా !"

హరి సర్వోత్తమరావు కళ్ళలో ఆనందం తొణికిసలాడుతుండగా చెప్పాడు రామచంద్రరావు.

"ఈ ప్రాంతంలో వందేమాతరం ఉద్యమ ప్రచారానికి కంకణం కట్టుకున్న 'కృష్ణాపత్రిక' ఎడిటర్ ముట్నూరు కృష్ణారావు, వారిని ఆహ్వానిస్తున్నారట ! పాల్‌గారి పర్యటన తాలూకు వివరాలన్నీ ఈవాల్టి 'కృష్ణాపత్రిక'లో చదివాను. నువ్వు చూశ్ళేదా ?"

"లేదు మిత్రమా ! ఈ వేళ ఉదయం నుంచి కొంతమంది వయోజనులకు విద్య నేర్పే కార్యక్రమంలో నిమగ్నమయినందువల్ల వీలుపడలేదు. ఏది ! ఆ పత్రిక తెచ్చావా ?" ఆరాటంగా అడిగాడు హరిసర్వోత్తమరావు.

"క్షమించు మిత్రమా ! తెద్దామనుకొన్నాను. కాని హాస్టల్లోనే మరచిపోయి వచ్చేశాను"' నొచ్చుకొంటూ బదులిచ్చాడు రామచంద్రరావు.

"మరేం పర్వాలేదులే ! హాస్టల్ కెళ్ళాక చదువొచ్చు ! అది సరేగాని, ఈ విషయం మన కాలేజీ విద్యార్థులందరికీ తెలియచేశావా ?"

"ఆఁ...... అందరికీ తెలియచేశాను. నువ్వు మాత్రమే మిగిలిపోయావు. అందుకేగా నిన్ను వెతుక్కుంటూ వచ్చింది ! గతంలో నీవు మద్రాసులో ఎం.ఏ. చేస్తున్నపుడు (1905) పాల్‌గారు చెన్నపట్నం వచ్చి ఉపన్యాస మిచ్చారటగా ! నువ్వు విన్నావా ?"

"వినడమేమిటి మిత్రమా ! మెరీనా బీచ్‌లో జరిగిన ఉపన్యాస సభకు నాతోపాటు, నా సహమిత్రులు అయ్యదేవర కాళేశ్వరరావు, రామ శాస్త్రినాయుడు, కొమర్రాజు లక్ష్మణరావు, గొల్లపూడి సీతారామశాస్త్రి కూడా హాజరయ్యారు. ఆనాటి సభకు 'స్వదేశీ మిత్రన్' తమిళ పత్రికా ఎడిటర్ జి. సుబ్రమణ్యం అయ్యంగారు అధ్యక్షత వహించారు. అంతేగాక సుప్రసిద్ధ తమిళకవి సుబ్రహ్మణ్య భారతిగారు కూడా ఆ సభలో ముఖ్యవక్తగా ప్రసంగించారు. ఆనాడు వందేమాతరం ఉద్యమం గురించి వారిచ్చిన ఉపన్యాసం ఇప్పటికీ నా చెవుల్లో గింగురు మంటూనే వుంది. ఆసభకు హాజరవడమే కాక, ఆంధ్ర విద్యార్థుల మంతా వందేమాతర ఉద్యమానికి మా మద్దతు కూడా పలికాము."

"అయితే వందేమాతర ఉద్యమానికి మన ఆంధ్రదేశపు విద్యార్థీ లోకం తరపున తొలిసారిగా మద్దతు పలికింది నీవేనంటావు !" నవ్వుతూ అన్నాడు రామచంద్రరావు.

ఆ మాటకు హరి సర్వోత్తమరావు చిన్నగా మందహాసం చేశాడు.

"మరి రేపు పాల్‌గారు వస్తున్న సందర్భంగా.... మన కాలేజీ విద్యార్థుల తరుపున ఏం ప్రోగ్రాం చేద్దాం !"

"ముందు నీ ఆలోచన చెప్పు ?" మిత్రుని కళ్ళలోకి తొంగి చూస్తూ అడిగాడు హరి సర్వోత్తమరావు.

"విద్యార్థి నాయకుడివి ! నువ్వెలా చెబితే, అలానడుచుకోవటం మా బాధ్యత!"

"అలా అంటూ నన్ను వేరుగా చూడకు మిత్రమా ! ఈ విషయం మనిద్దరం చర్చించుకోవడం కంటే మిత్రులందరితో చర్చించి ఓ నిర్ణయానికి రావడం మంచిది. ఏమంటావు ?" మిత్రుని వంక చూస్తూ అడిగాడు హరి సర్వోత్తమరావు.

"అలాగేనంటాను !" చిర్నవ్వుతో అన్నాడు రామచంద్రరావు. "అయితే పద!" అంటూ లేచి నిల్చున్నాడు హరి సర్వోత్తమరావు

వెన్నెల్లో గోదావరి గలగలా పారుతుంటే – బిరబిరా పరుగులాంటి నడక సాగించారు టీచర్స్ ట్రైనింగు కళాశాల వేపు మిత్రద్వయం !.

...........

ఆ రాత్రి........

బాగా పొద్దు పోయాక ట్రైనింగ్ కాలేజీ హాస్టల్ ఆవరణలో సమావేశమయ్యారు విద్యార్థులందరూ ! తన సహచర విద్యార్థుల మధ్య పచ్చిక బయలు పై కూర్చుని అందరి వంక కలయ జూస్తూ చెప్పడం ప్రారంభించాడు హరి సర్వోత్తమరావు.

"ఫ్రెండ్స్ ! వందేమాతరం ఉద్యమంలో విద్యార్థులు, అధ్యాపకులు పాల్గొనరాదని మన ప్రిన్సిపాల్ మార్క్‌హంటర్ మనపై ఆర్డరు జారీ చేశాడు. ఈ ఆర్డరును, మనం ఖాతరు చేయవలసిన అవసరం లేదు."

"అవును 'లేదు'! అవును 'లేదు" విద్యార్థులందరూ ముక్తకంఠంతో అరిచారు.

"డియర్ ఫ్రెండ్స్ ! మనం హంటర్ కొరడా ఝుళిపింపులకు భయపడక, రేపు ఇక్కడికి విచ్చేయబోతోన్న బిపిన్ చంద్రపాల్‌గారికి స్వాగతం పలుకుదాం ! వారి ఉపన్యాస కార్యక్రమంలో పాలు పంచుకొందాం ! మనం చేయవలసిన ఏర్పాట్ల గురించి చర్చించండి ! అందరి అభిప్రాయాలు విన్న తర్వాతే ఓ నిర్ణయానికి వద్దాం !" అంటూ ముగించాడు హరి సర్వోత్తమరావు.

ఒక్కో విద్యార్థి తనకు తోచింది చెప్పసాగారు. అలా అందరి అభిప్రాయాలు పూర్తయి, ఆ అభిప్రాయాలకు అనుగుణంగా ఓ నిర్ణయానికి వచ్చే సరికి చాలా ప్రొద్దుపోయింది. తన సహ విద్యార్థులందరూ వెళ్ళి పోయాక హాస్టల్‌లోని తనగదిలోకి వెళ్ళి పడుకుని, ఆలోచనా నిమగ్నుడైన హరి సర్వోత్తమ రావుకు క్షణకాలం తన అర్ధాంగి రూపం కళ్ళ ముందు కదలాడగా, మనసులోనే నవ్వుకుంటూ లేచి, తనదైనందిన కార్యక్రమంలో భాగంగా డైరీ వ్రాయడం ప్రారంభించాడు.

*　　　*　　　*

## 1907, ఏప్రిల్ 19

సాయంకాలం ఆరుగంటల సమయం ...........

రాజమహేంద్ర వరము నడిబొడ్డున ఏర్పాటయిన ఉపన్యాస వేదిక వద్ద పట్టణ ప్రజలందరూ వేచివున్నారు. హరి సర్వోత్తమరావు, తన విద్యార్థి బృందానికి నాయకుడై స్వాగత

ఏర్పాట్ల కార్యక్రమంలో నిమగ్నుడయి వున్నాడు. అందరి చూపులు బిపిన్ చంద్రపాల్ వచ్చే మార్గం వైపే నిగిడి వున్నాయి..... కాలంగడుస్తూ వుంది........ అందరిలోనూ ఉత్కంఠత !

అంతలోనే "వందేమాతరం",..... "వందేమాతరం"......... 'వంగపులి పాల్ జిందాబాద్ !" అన్న నినాదాలు వినిపించగానే అందరికళ్ళు అటు వేపు తిరిగాయి !

"అదుగో..... ఆయనే బిపిన్‌చంద్రపాల్!" జనంలోంచి బిగ్గరగా అరిచారెవరో !

ఆయనను దగ్గరిలో నుంచి చూడాలని అందరిలోనూ తహతహ ! ఆరాటం !!

దానితో కొంత తొక్కిసలాట జరిగినా, 'బాలభారతి' సభ్యులు చాకచక్యంగా అదుపు చేశారు జనాల్ని !

హరిసర్వోత్తమరావుకు బిపిన్ చంద్రపాల్‌ను చూడ్డం రెండవసారి అయినా మేను పులకరించి నట్లయ్యింది ! "వందేమాతరం" అంటూ బిగ్గరగా అరచి పాల్‌ను పుష్పమాలాంకృతుల్ని చేశాడు. ఆ తర్వాత వేదిక వరకు స్వాగతం పలికాడు.

తన వెంట ముట్నూరి కృష్ణారావు, చిలకమర్తి నరసింహ్మం, రాజమహేంద్రవరపు కరణం గున్నేశ్వరరావు ప్రభ్రుతులు వెంటరాగా, వేదికనలంకరిం చాడు బిపిన్ చంద్రపాల్ ! ఆ సభకు అధ్యక్షుడు ముట్నూరి ! అనువాదకుడు చిలకమర్తి !

వేలాది జనం ! సందడి !!

ముట్నూరు కృష్ణారావులో సంతృప్తి ! తన ప్రయత్నం సఫలీకృతం కాబోతున్నందుకు ఆనందం !.

తండోపతండాలుగా తరలివస్తున్న జనం ! ఆ జనవాహిని ఆపగలవారెవ్వరు ?

కౌతా శ్రీరామశాస్త్రి ఆవేశపూరితుడై 'వందేమాతరం' గీతాన్ని శ్రావ్యంగా పాడి జనాన్ని ఆవేశపూరితులను చేశాడు. సభా అధ్యక్షుడు ముట్నూరి కృష్ణారావు ఉపన్యాసం ప్రారంభించాడు.

"రాజమహేంద్రవరం పుర ప్రముఖులారా ! ప్రజలారా ! బిపిన్ చంద్రపాల్ గారి ఉపన్యాసము వినేందుకు ఇంతపెద్ద సంఖ్యలో విచ్చేసిన మీకు, నేను కోరిన వెంటనే ఇంత చక్కటి ఏర్పాట్లుగావించిన 'బాలభారతి' సంస్థ సభ్యులకు, తన విద్యార్థి బృందంతో ఘనంగా స్వాగతం పలికిన విద్యార్థీ నాయకుడు హరి సర్వోత్తమరావుకు ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెల్పుకొంటున్నాను.

ఇక ముఖ్య విషయం చెప్పొచ్చేదేమిటంటే, మనం స్వరాజ్యం రావాలని కోరుకుంటున్నాం ! ఆ ఆకాంక్ష బెంగాల్ రాష్ట్ర విభజనతో ఉధృతమయ్యింది ! ఆ ఉధృతంలో నుండే శక్తివంతమైన ఆయుధం పుట్టుకొచ్చి నేడు మన ముందు నిలిచింది. ఆ ఆయుధమే మన బిపిన్ చంద్రపాల్‌గారు !.......

సభలో చప్పట్లు మారుమ్రోగాయి.

ముట్నూరి తన ఉపన్యాసాన్ని తిరిగి కొనసాగించాడు.

పాల్‌గారిని మీకు పరిచయం చేయటం నా ప్రథమ కర్తవ్యంగా భావిస్తున్నాను. వారు వంగదేశీయులు ! అంతేకాదు జాతీయనాయకులుగా పేరు గాంచినవారు ! బెంగాల్ రాష్ట్ర విభజన తర్వాత, దేశ పరిస్థితిని సమీక్షించడం కోసం, కలకత్తాలో ఏర్పాటయిన కాంగ్రెస్ మహాసభలో కూడా వీరు పాల్గొన్నారు. బ్రిటిష్ ప్రభుత్వం మన అస్థిత్వాన్నే దెబ్బతీసే ప్రయత్నం చేస్తున్నా, కాంగ్రెస్ నేతలు కొందరు కేవలం నిరసన తెలుపడం వరకే పరిమిత మవడం పట్ల, ఆ పార్టీలోని పాల్ లాంటి వారికి ఆవేశం కలిగించింది ! కేవలం నిరసనలతో ప్రయోజనం లేదని, మనదేశాన్ని, మన స్వాతంత్ర్యాన్ని, ఆర్థిక వ్యవస్థను మనమే పరిరక్షించు కోవాలన్న ఉద్దేశ్యంతో వీరు, 'పంజాబు కేసరి' అయిన లాలాలజపతిరాయ్, బాలగంగాధర తిలక్‌తో కలిసి వందేమాతరం శంఖారావాన్ని పూరించి జాతిని జాగృత పరచడానికి బయలుదేరారు. ఆ ప్రయత్నంలో భాగంగా పాల్‌గారు నేడు మన ఆంధ్రదేశానికి రావటం మన అదృష్టం. ఇక పాల్‌గారిని ప్రసంగించ వలసిందిగా కోరుకొంటున్నాను" అంటూ తన అధ్యక్షోపన్యాసం ముగించి తిరిగి ఆశీనుడయ్యాడు. ముట్నూరి !

చిర్నవ్వుతో బిపిన్ చంద్రపాల్ లేచి ప్రజలందరి వంక చూసి అభివాదం చేస్తూ తన గంభీరోపన్యాసాన్ని ప్రారంభించాడు.

"ఆంధ్రప్రజానీకానికి నమస్సుమాంజలులు ! నా ఆంధ్ర పర్యటనలో భాగంగా నేడీరాజ మహేంద్రవరానికి రావడం నా అదృష్టంగా భావిస్తున్నాను. ఎందుకంటే ప్రాచీన సంస్కృతి, సాహిత్యం, సంస్కరణోద్యమానికి ఆలవాలమైన ఈ ప్రాంతాన్ని తప్పక దర్శించాలనే కోరిక నాకు ప్రగాడంగా వుండేది ! నా ఈ కోరిక, నేడు కృష్ణా పత్రిక ఎడిటర్ ముట్నూరి కృష్ణారావుగారి ద్వారా నెరవేరింది. అందుకు వారికి నా కృతజ్ఞతాభి వందనములు !"

సభలో కరతాళధ్వనులు !

"ప్రజలారా ! వేల సంవత్సరాల నుంచి సుసంపన్నమైన చరిత్ర, సంస్కృతి మనకున్నది. చరిత్ర, సంస్కృతియే ఏ దేశానికయినా ఆయువుపట్టు ! భారతీయులందరూ ఒకే సమిష్టికుటుంబానికి చెందినవారు. కాని ఈ బ్రిటిష్‌వారు మన మధ్యవున్న భాషల కారణంగా, ఆచార వ్యవహారాల కారణంగా, జాతుల కారణంగా, మనలోని నిరక్షరాస్యత కారణంగా, భేదోభిప్రాయంతో మనలను విడదీసి, చివరకు మన సంస్కృతిని కాలరాచి, మనపై పెత్తనం చెలాయిస్తున్నారు.

భారతదేశం భారతీయులది ! 'స్వరాజ్యం' అనే మాట వేదాలలో కూడా కన్పిస్తోంది. పరాయివారు విధించిన నిర్బంధాలకు లోబడక, స్వయంగా తాను విధించుకొన్న నిర్బంధాలకు

లోబడడమే 'స్వరాజ్యం' ! 'స్వరాజ్యం''నా జన్మహక్కు' అని ప్రతి పౌరుడు దానిని సాధించెదనని శపథం చేయండి" అంటూ ఉద్వేగంగా ప్రసంగించటంతో సభలో 'వందేమాతరం', 'వంగపులి పాల్ జిందాబాద్', 'స్వరాజ్యం నా జన్మహక్కు దానిని సాధించి తీరుతాం" అంటూ ప్రజలు గట్టిగా నినాదాలు చేయటంతో ఆ ప్రాంతమంతా దద్ధరిల్లి పోయింది.

నినాదాల మధ్య పాల్ తన ప్రసంగాన్ని తిరిగి, కొనసాగించాడు. "బెంగాలు రాష్ట్ర విభజన, బ్రిటిష్ సామ్రాజ్య పతనానికి నాంది ! 'పూర్తి స్వయంపాలన సాధన' భారతీయుల విధి ! అది సాధించే వరకు మనం నిద్రపోరాదు. 'స్వేచ్ఛ', 'స్వరాజ్యం,' 'జాతీయత' ఈ మూడు నేటి మన అవసరాలు ! కాబట్టి ఆంధ్ర సోదరులారా ! ఎంతకాలమని నిరసనలతో ఈ ప్రభుత్వాన్ని వంచగలం ? ఎంతకాలమని ఆలోచిస్తూ కార్యశూన్యులమై వుండగలం ? దేశభక్తులారా ! ఆలోచనలు కట్టిపెట్టి కార్యనిరతులు కండి ! వట్టి ప్రగల్భాలతో కాలయాపన చేయడం వ్యర్థం! నిరర్థకం !! దేశ విముక్తికి మార్గం కార్యశూరత ! లెండి ! ఈ దేశం మనది ! ఈ దేశ సంస్కృతిని, ఔన్నత్యాన్ని పరిరక్షించే బాధ్యత ఈ గడ్డపై జన్మించిన ప్రతి పౌరుడికి వుంది. ప్రజలందరూ జాతియోద్యమంలో పాల్గొనే తరుణం ఆసన్నమైంది ! ముఖ్యంగా మన స్వదేశీ పరిశ్రమలు అభివృద్ధి పరచడానికి అవకాశం ఇవ్వండి ! విదేశీ వస్తు బహిస్కరణగావించండి. మన సంస్కృతిని పునరుజ్జీవనం చేసుకునేందుకు జాతీయ పాఠశాలలు, కళాశాలలు ఏర్పాటు చేసుకోవలసిన అవసరం ఎంతైనా వుంది. జాతీయ పాఠశాలలు, కళాశాలలు ప్రభుత్వం అజమాయిషీలో కాక, మన ఆధ్వర్యంలో సాగాలి. కాబట్టి ఈ సందర్భంగా నేను చెప్పొచ్చేదేమిటంటే, విదేశీ కళాశాలల్లో విద్య నేర్చుకొంటున్న విద్యార్థులు, అధ్యాపకులు వెంటనే వాటిని బహిష్కరించి, జాతీయ పాఠశాలల, కళాశాలల అభివృద్ధికి పాటు పడండి !...........
ఆవేశపూరితంగా దాదాపు రెండు గంటల పాటు అనర్గళంగా సాగిన ఆ గంభీరోపన్యాసం ........ అక్కడ పాల్గొన్న వేలాది మందిలో ఆత్మ విశ్వాసము, దేశభక్తిని రగుల్కొలిపింది! హరి సర్వోత్తమరావులో స్వరాజ్య సిద్ధికై ఉద్రేకం కట్టలు త్రెంచుకొంది.

పాల్ తన ప్రసంగం ముగించి తిరిగి ప్రజానీకానికి, అనువాదకుడైన చిలకమర్తికి అంజలి ఘటించి తన స్థానంలో కూర్చున్నాడు.

"ఇపుడు చిలకమర్తికి వారు తమ మధురకంఠంతో శ్రోతల ముగ్ధులగావిస్తారు" అన్నాడు ముట్నూరిలేచి !

చిలకమర్తి వారు లేచి ప్రజలకు నమస్కరించి చెప్పాడు. 'శ్రీ పాల్‌గారి గంభీరోపన్యాసాన్ని తెలుగున అనువాదం చేసే మహాభాగ్యం నాకు లభించటం నా అదృష్టం ! ఆ అదృష్టాన్ని కల్గించిన ముట్నూరి వారికి నా కృతజ్ఞతలు ! నేను మాట్లాడను. ఆంగ్లేయుల దోపిడి విధానాన్ని ఓ చిన్న ఆటవెలది పద్యంలో విన్పిస్తాను. అంటూ చదవటం ప్రారంభించాడు.

"భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగ దూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి !"

అక్షరాస్యులనే కాక, నిరక్షరాస్యులను సైతం ఆపద్యం ఆకట్టుకుంది !

"మళ్ళీ విన్పించాలి !" అన్న అరుపులు ప్రజల్లోంచి పెద్ద ఎత్తున చెలరేగాయి !

తన పద్యానికి అంతగా ప్రతిస్పందన ప్రజల్లో లభించినందుకు చిలకమర్తిలో ఆనందం!

తన పద్యాన్ని మళ్ళీ..... మళ్ళీ చదివి విన్పించాడు.

ముట్నూరి వారికి ఒళ్ళు పులకరించినట్లయింది. వెంటనే లేచి 'దేశదాస్య విముక్తికి కవితా ఉద్యమము కూడా తోడైనదనుటకు చిలకమర్తి పద్యమే నిదర్శనం అంటూ చిలకమర్తిని ప్రశంసించాడు.

రాజమహేంద్రవరం కరణం గున్నేశ్వరరావు జాతీయ పాఠశాల నిర్మాణ నిమిత్తం వెయ్యినూటా పదహార్లు వేదికపై అధ్యక్షులకు అందజేశాడు.

అలా సాగిన ఉపన్యాస కార్యక్రమం ముగిసేసరికి బాగా పొద్దు పోయింది !

హరి సర్వోత్తమరావు సభావేదిక దగ్గరికి వెళ్ళి, కృష్ణారావుగారి ద్వారా, పాల్‌తో పరిచయం చేసుకొని తన మనసులో స్వరాజ్యం పట్ల చెలరేగే తన భావాలను విశదంగా వివరించాడు.

హరి సర్వోత్తమరావు ఆలోచనలకు పులకితుడైన పాల్, "అయాం వెరీప్రౌడ్ ఆఫ్‌యూ యంగ్ మ్యాన్!" అంటూ భుజం తట్టి అభినందించాడు.

ఆ అభినందన హరి సర్వోత్తమరావు జీవితగతినే మార్చి వేసింది !

# 3

రాజమహేంద్రవరం టీచర్స్ ట్రైనింగ్ కాలేజీ ప్రాంగణమంతా విద్యార్థుల కోలాహలం!

హరి సర్వోత్తమరావు నిర్ణయానుసారం ప్రతి విద్యార్థి 'బ్యాడ్జ్' ధరించి వున్నాడు. సమయం గడుస్తున్న కొద్దీ అందరిలోనూ అనిర్వచనీయమైన ఆనందం – ఉత్సాహం పొంగారుతూ వుంది !

ఆ రోజునుంచే అర్ధ సంవత్సరం పరీక్షలు ప్రారంభం !......

పరీక్ష వ్రాసే సమయం దగ్గరపడింది !

కాలేజీ గంటమ్రోగింది !

విద్యుర్థులందరూ 'వందేమాతరం' అంటూ తమ తరగతి గదుల్లోకి వెళ్ళి పరీక్షలు వ్రాయడానికి సంసిద్ధులయ్యారు. పరీక్ష నిర్వహించే అధ్యాపకులు 'బ్యాడ్జీ'లు ధరించిన విషయం గమనించినా, తెలియనట్లు మిన్నకుండిపోయారు. కాని ఆ కళాశాల ప్రిన్సిపాల్ మార్క్ హంటర్ మాత్రం సహించలేకపోయాడు. వందేమాతరం ఉద్యమానికి మద్దతుగా విద్యార్థులందరూ బ్యాడ్జీలు ధరించి వచ్చారన్న విషయం తెలియగానే, అతనిలో ఆగ్రహం కట్టలు తెంచుకొంది ! నిప్పు తొక్కిన కోతిలా కోపంతో చిందులు తొక్కుతూ తన గది వొదిలి క్లాస్‌రూం దగ్గరికి వెళ్ళాడు. అతన్ని చూడగానే విద్యార్థులు ఏక కంఠంతో 'వందేమాతరం' అంటూ కళాశాల ప్రాంగణమంతా మారుమ్రోగేలా నినాదాలు చేశారు !

తన ఆవేశం వారి నినాదాలముందు ఏ మాత్రం పనికిరాదనుకున్న హంటర్, కోపాన్ని నిగ్రహించుకొంటూ సర్వోత్తమరావుని పిలిచి చెప్పాడు.

"మిష్టర్ సర్వోత్తమరావు ! విద్యార్థి నాయకుడివై వుండి, ఇలాంటి పనులు చేయడం భావ్యం కాదు ! అయినా మీరు విద్యార్థులు ! విద్యార్థులకు రాజకీయాలు తగవు. వాటిలో పాల్గొని మీ ఉజ్వల భవిష్యత్తును ఎందుకు పాడుచేసుకొంటారు ? ప్రభుత్వం మీకెన్నో సదుపాయాలు కల్పించింది ! తద్వారా విద్యనార్జించి, ఒక్కో మెట్టు ఎదగాలి గాని ఇలా అర్థరహితంగా ప్రవర్తించడం మూర్ఖత్వమే అవుతుంది. కాబట్టి మీరందరూ నా మాటవిని బ్యాడ్జీలు తీసివేయండి !"

హంటర్ మాటలు విన్న హరి సర్వోత్తమరావు, "మీరెంత చెప్పినా బ్యాడ్జీలు తీసివేయం! ఉద్యమం మా ఊపిరి ! విద్యార్థులమైన మేము మావంతు బాధ్యత నిర్వహిస్తాం !"

హరిసర్వోత్తమరావు మాటలకు ఉగ్రుడైన హంటర్, "గో అండ్ డై ! నిన్నూ, నీ తోపాటి ఈ కోతిమూకను కాలేజీ నుంచి తక్షణమే డిస్మిస్ చేస్తున్నాను. గెట్ అవుట్ !" అంటూ బిగ్గరగా అరిచాడు.

డిస్మిస్ అనగానే కొంతమంది విద్యార్థుల్లో కలవరం మొదలయ్యింది ! ఆ కలవరాన్ని గమనించిన హంటర్ వారిలో కొంతమంది నయినా తనవైపుకు తిప్పుకునే ప్రయత్నం చేస్తూ అన్నాడు.

"మీలో చాలా మంది బలవంతం వల్లే బ్యాడ్జ్‌లు ధరించారని తెలుసు ! ఇప్పటికైనా, బ్యాడ్జీలు తీసి వేయండి ! వారిని క్షమించి పరీక్షలు వ్రాయటానికి అనుమతిస్తాను !"

విద్యార్థులు ఒకరి ముఖాలు మరొకరు చూసుకున్నారు. రెండు వందలకు పైగా వున్న ఆ విద్యార్థీ బృందంలో యాభై మందికి పైగా హంటర్ ఆజ్ఞననుసరించి, బ్యాడ్జీలు తీసి వేసి పరీక్ష హాల్లోకి వెళ్ళబోతుండగా, మిగతా విద్యార్థులు "పిరికి పందల్లారా ! ఆగండి !"

అంటూ అడ్డుకోబోతుండగా హరి సర్వోత్తమరావు వారించి "మనలో పిరికితనం కూడదు. అలాంటి వారివల్ల మన ఉద్యమానికి నష్టమే కాని ప్రయోజనముండదు. వారిని వెళ్ళనివ్వండి ! మనం నేటి నుంచి ఈ మిషనరీ కాలేజీలను బహిష్కరిద్దాం ! పదండీ !" అంటూ పెద్ద వూరేగింపుగా 'వందేమాతరం' నినాదాలు చేస్తూ హరిసర్వోత్తమరావు నాయకత్వాన బయల్దేరిన విద్యార్థి దళం సాయంకాలం వేళకు గోదావరి ఒడ్డుకు చేరింది ! అక్కడ గోదావరిలో స్నానమాచరించాక, హరి సర్వోత్తమరావుతో సహా, తాము అంతవరకు ధరించిన దుస్తులను దూరంగా విసిరివేసి స్వదేశీ దుస్తులను ధరించారు.

హరి సర్వోత్తమరావులో ఆనందం పెల్లుబికింది ! "మిత్రులారా ! ఇకనుంచి స్వరాజ్య ఉద్యమమే మన ధ్యేయం ! మనం ఈ ఉద్యమ ప్రచారంలో కరదీపికల్లా ముందుకు సాగిపోవాలి !" అంటూ తన మనసులోని భావాలను స్పష్టం చేశాడు.

ఆ భావాలకు స్పందించిన విద్యార్థుల్లో ఉత్తేజం !

"వందేమాతరం ఉద్యమం వర్ధిల్లాలి !"

"హరి సర్వోత్తమరావు జిందాబాద్ !"

– అన్న నినాదాలతో గోదావరి మాత తనువెల్లా పులకించి పోయింది.

* * *

అదే గోదావరి ఒడ్డున కూర్చున్నారు మిత్రులిద్దరూ ! "మిత్రమా ! ఏమిటి ఆలోచిస్తున్నావు ?"

– ఆలోచనలోకి జారుకుంటున్న రామచంద్రరావు వంక చూస్తూ అడిగాడు హరి సర్వోత్తమరావు.

"మనం వందేమాతరం ఉద్యమాన్ని ఆంధ్రదేశమంతా వ్యాప్తి చేయడానికి ఎంతో వువ్విళ్ళూరాం ! కాలేజీ నుండి సస్పెండ్ కూడా అయ్యాం ! ఈ ఒడ్డునే స్నానాలు కూడా చేసి నిర్ణయాలు తీసుకున్నాం. కాని ............" అంటూ ఆగిపోయి ఓ క్షణం మిత్రుని వంక చూశాడు రామచంద్రరావు.

"చెప్పు మిత్రమా !" ఆసక్తిగా అడిగాడు హరిసర్వోత్తమరావు.

"మనం ఆశించినట్టుగా మునుపు మన వెంటనడిచిన విద్యార్థులెవ్వరూ ప్రస్తుతం మన వెంటలేరు. కారణం ? నీకూ నాకూ డిస్మిస్ ఆర్డరేగాక, ప్రభుత్వ, ప్రయివేటు విద్యాలయాల్లో, సంస్థల్లో ఎక్కడా ఉద్యోగం ఇవ్వరాదంటూ ఈ బ్రిటిష్ ప్రభుత్వము 'జి.వొ.' జారీ చేసేసరికి, తమకు కూడా అలాంటి పరిస్థితి ఎక్కడ ఏర్పడబోతుందోనని, కొంతమంది హంటర్ దగ్గరకు వెళ్ళి క్షమాపణలు చెప్పుకొని తిరిగి కళాశాల్లో చేరారు. ఇంకొంతమంది వేరే కళాశాలల్లో చేరే

ప్రయత్నం చేసుకోవడానికి వెళ్ళారు. ఈ పరిస్థితిలో మన మిద్దరమే మిగిలాం ! మరి మనం ఏం చేయగలం ?"

రామచంద్రరావు మాటల్లోని నిరుత్సాహాన్ని గమనించిన సర్వోత్తమరావు,

"వారు మనల్ని వొదిలి వెళ్ళినంత మాత్రానా, మన నిర్ణయం మారకూడదు ! ఇద్దరమే మనవంతు భాగంగా ఈ ఉద్యమానికి సహకరిద్దాం ! ఏమంటావు ?" రామచంద్రరావు కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగాడు హరి సర్వోత్తమరావు.

"కష్టం మిత్రమా !"

"ఉద్యమమంటేనే అనేక కష్టాలతో కూడుకొన్నది. ఎన్ని కష్టాలు ఎదురైనా వాటిని అధిగమించి ముందుకు సాగిపోవడమే ఉద్యమకారుని లక్షణం !" అన్నాడు సర్వోత్తమరావు.

"అంతపని నేను చేయలేను మిత్రమా ! ఎందుకంటే నా కుటుంబ పరిస్థితులు అలాంటివి ! ఇంటికి పెద్దవాడినయిన నేను, ఏ బాధ్యతలు పట్టించుకోకుండా, ఉద్యమంలో పాల్గొంటే, నా కుటుంబం గతేంకావాలి ? నా కుటుంబ విచ్ఛిన్నతి నానుంచి కాకూడదు. అలా జరగడం నాకిష్టంలేదు ! అందుకే నేనో నిర్ణయానికొచ్చాను." భారంగా నిట్టూర్చి అన్నాడు రామచంద్రరావు.

"ఏమిటది ?"

"..............."

"సంకోచించక చెప్పు మిత్రమా !"

"నేను నిన్ను ఒంటరి చేస్తున్నాననే బాధ నన్ను దహించి వేస్తోంది మిత్రమా !"

"అలా బాధపడకు ! ఎవరి పరిస్థితులు వారివి ! నీ వెలాంటి నిర్ణయం తీసుకున్నా తప్పుగా భావించను. చెప్పు ! నీ నిర్ణయమేమిటో ?" తల ఒంచుకొని కూర్చున్న రామచంద్రరావు భుజం తట్టి అడిగాడు హరి సర్వోత్తమరావు.

దించిన తల ఎత్తి చెప్పాడు రామచంద్రరావు. "మా వూరెళ్ళి వ్యవసాయం చేసి కుటుంబాన్ని పోషిద్దామనుకుంటున్నాను."

అలా అంటున్నపుడు రామచంద్రరావు కళ్ళలో నీరు కారటం గ్రహించిన హరి సర్వోత్తమరావు, మిత్రుని కన్నీళ్ళు తుడిచి, "నీ నిర్ణయం మంచి నిర్ణయమే ! అలాగే కానివ్వు !" అన్నాడు.

"మరి నీ నిర్ణయం మిత్రమా !" ప్రశ్నించాడు రామచంద్రరావు.

"నేనంటూ ఓ నిర్ణయానికొచ్చాక వెనుదిరిగే ప్రసక్తి ఉండదు !"

"సరే ! మిత్రమా ! నీకు మాట ఇచ్చి తప్పిన ఈ దీనుణ్ణి మన్నించు". అంటూ వీడ్కోలు తీసుకున్నాడు రామచంద్రరావు.

అప్పుడే వుప్పొంగి పొంగిపొరలి ప్రవహిస్తోన్న గోదావరివంక తదేకంగా చూస్తూ నిల్చుండి పోయాడు హరి సర్వోత్తమరావు !

ఆ రాత్రే ముట్నూరు కృష్ణారావు పంపిన ఓ వ్యక్తి వచ్చి సర్వోత్తమరావుకు ఓ ఉత్తరం అందించాడు ! అందులో ఇలా వుంది.

"నీ పట్ల ప్రభుత్వం తీసుకున్న నిర్ణయానికి ఎంతగానో చింతిస్తున్నాను. నీలాంటి అకుంఠిత దీక్షాపరుడు, ఉద్యమానికి ఎంతో అవసరం ! నీవు కూడా బిపిన్ చంద్రపాల్‌గారి వెంట మిగిలిన ఆంధ్ర ప్రాంతమంతా పర్యటన గావిస్తే బాగుంటుంది. తప్పక రాగలవని ఆశిస్తున్నాను !

ఇట్లు

ముట్నూరి కృష్ణారావు

కృష్ణారావుగారి వర్తమానం సర్వోత్తమరావులో ఉద్యమం పట్ల ద్విగుణీకృ తోత్సాహం రేపింది. ఉత్తరం అందించిన వ్యక్తి వెంట వున్నపళంగానే ప్రయాణమయ్యాడు హరి సర్వోత్తమరావు, వొంటిపై బట్టలు మాసివున్నాయన్న విషయం కూడా పట్టించుకోకుండా !

# 4

శ్రీవారి పాదపద్మములకు నమస్కరించి వ్రాయునది !

మీరు క్షేమముగా వున్నారని తలంచుచున్నాను. గత రెండు మాసముల నుండి మీ నుంచి ఉత్తరం రాలేదు. మీ నుండి ఏలాంటి సమాధానం రాకపోవడం చాలా నిరాశను కలిగించింది. కాన ఈ ఉత్తరం ముట్టిన వెంటనే, తప్పక రాగోరుచున్నాను. మీరాకకై అమ్మా, నాన్న కూడా ఎదురు చూచుచున్నారు !

మీ రాక కొరకు వేచి యుండే !

మీ అర్ధాంగి,

రామాబాయి

భార్య వ్రాసిన 'ఉత్తరాన్ని చదివిన సర్వోత్తమరావు ఆలోచనలోపడ్డాడు. తన అర్ధాంగికి ఉత్తరం వ్రాయాలన్న కోరిక అనుక్షణం మదిలో మెదులుతున్నా, కావాలనే ఆలస్యం చేశాడు !

అందుకు ఒకే కారణం ? తన్ను కాలేజీ నుంచి డిస్మిస్ చేసి, ఏ ఉద్యోగానికి అర్హత లేకుండా చేసిన విషయం తెలియజేస్తే, తన భార్యతోపాటు, అత్తామామలు కూడా బాధపడతారని ! తలచిందొకటైతే జరిగిందొకటి ! భార్య బాధగా వ్రాసిన ఉత్తరం తన్ను ఆవేదనకు గురిచేసింది.

ఏమైనా సరే తన సతీమణి దగ్గరికి వెళ్ళాలని నిర్ణయించుకున్న హరి సర్వోత్తమరావు, బిపిన్ చంద్రపాల్ వెంటతన ఆంధ్రదేశ పర్యటన ముగియగానే చిత్తూరు జిల్లాలో ఓ మారుమూల గ్రామమయిన, 'పెరికలపెంట'కు పయనమయ్యాడు.

మదన పల్లి వరకు రైల్లో ప్రయాణం చేసిన హరి సర్వోత్తమరావుకు ఇక అక్కడనించి తన మామగారి వూరికి వెళ్ళడానికి కాలినడక తప్పలేదు.

పచ్చటి పంట పొలాల మధ్య వెళుతున్నాడన్న మాటేగాని, మనసు మనసులో లేదు! ఆ బాధంతా తన అర్థాంగికి సరియైన న్యాయం చేయలేక పోతున్నాననే !

'పెరికల పెంట' చేరే సరికి, సంజె చీకట్లు కమ్ముకున్నాయి ! ఊర్లో నూనె దీపాలు వెలుగుతున్నాయి. రెండు మూడు వీధి మలుపులు తిరిగాక, తన మామగారి ఇంటి ముందు ఆగాడు ! వీది గుమ్మం తలుపు తెరిచేవుంది. లోపల్నించి చమురు దీపాల కాంతి బయికి సన్నగా ప్రసరిస్తూ వుంది.

ఓ క్షణం పాటు అతనిలో తటపటాయింపు ! వీధి గుమ్మందాటి లోపలికి అడుగుపెట్టాడు హరి సర్వోత్తమరావు.

"మామయ్యగారూ !" అంటూ పిలిచాడు.

"ఎవరూ ?" అంటూ బయటి కొచ్చిన రామాబాయి తన భర్తరాకను గమనించి, సిగ్గుతెరలు కమ్ముకోగా లోపలికి పరుగు తీసింది !

"ఎందుకే ఆ పరుగు ! ఎవరొచ్చారేమిటి ?" అంటూ బయటికి వచ్చి తొంగి చూసిన వీణాబాయి తన అల్లుడ్ని చూడగానే ఆప్యాయంగా లోపలికి ఆహ్వానిస్తూ అంది.

"రా బాబూ !"

"బాగున్నారా అత్తయ్యగారూ !"

"ఆс.........."

"మామయ్యగారు వున్నారా !"

"లేరు బాబు ! ఉదయ్యాన్నే మదనపల్లెకు వెళ్ళారు. రేపొస్తారు. అమ్మాయ్ నీళ్ళు పట్రామ్మా !"

తలుపు చాటునుంచి తల్లికి నీళ్ళ చెంబును, తుండును అందించబోయింది రామాబాయి.

"మరీ అంత సిగ్గయితే ఎలాగే ! నువ్వేవచ్చి ఇవ్వు !"

చిన్నగా నవ్వుతూ అంది వీణాబాయి.

ఆ మాట కోసమే కాచుకొని వున్న రామాబాయి సిగ్గుపడుతూనే భర్తచేతికి చెంబు అందించింది. క్రీగంట చూస్తూ ! చెంబందుకొన్న హరిసర్వోత్తమరావు కాళ్ళు కడుక్కొన్నాక తుండందించి మళ్ళీ లోపలికి తుర్రుమంది !

నవ్వుతూ ముఖం తుడుచుకొంటూ లోపలికి అడుగు పెట్టిన హరి సర్వోత్తమరావు, వాలుకుర్చీలో కూర్చొని వున్న తన పినతండ్రి శ్రీనివాసరావుని చూడగానే గుండెగుభిల్లుమంది. భయపడుతూనే, "ఎప్పుడొచ్చారు చిన్నాన్నా ?" అంటూ వెళ్ళి ఆయన పాదాలను తాకాడు.

"ఎప్పుడో ఒకప్పుడులే !" శ్రీనివాసరావు పలుకుల్లో కొద్దిపాటి నిష్ఠూరత ! తనను పాలుతాగే పసి ప్రాయంనుంచి ఇప్పటి వరకూ పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించిన వ్యక్తికాబట్టి, ఆయన సరసన వున్న ఖాళీకుర్చీలో కూర్చోవడానికి హరి సర్వోత్తమరావుకు మనస్సంగీకరించలేదు. అలాగే నిలబడ్డాడు !

"ఈ మర్యాదలకేం తక్కువలేదు కూర్చో !" గదమాయిస్తున్నట్టుగా అన్నాడు శ్రీనివాసరావు.

అతని పక్కనున్న ఖాళీ కుర్చీని కొద్దిపాటి దూరంలాక్కొని కూర్చున్నాడు హరి సర్వోత్తమరావు.

ఇద్దరి మధ్య కాసేపు మౌనం !

"ఇదేనా రాక ?"

అవునన్నట్టుగా తలాడించాడు హరిసర్వోత్తమరావు !

"ఏమైంది నీ ట్రెనింగు చదువు ?" సూటిగా హరి సర్వోత్తమరావుని చూస్తూ అడిగాడు శ్రీనివాసరావు !

ఈ ప్రశ్న తనను కావాలనే అడిగినట్టుగా అనిపించింది హరి సర్వోత్తమరావుకు !

జరిగింది వివరంగా చెప్పాడు

శ్రీనివాసరావులో ఆవేశం !

"నీ కిదేం పోయేకాలంరా ! హాయిగా ట్రెనింగ్ పూర్తిచేసుకొని ఏదైనా ఉద్యోగం చేసుకుంటావని నిన్ను చదివిస్తే, చివరికిలా చేస్తావా ? అసలు నీగురించి నువ్వేమను కొంటున్నావు? మనమేమైనా బాగా వున్నవాళ్ళ మనుకొన్నావా ? ఏం చేసినా చెల్లడానికి ? మధ్య తరగతి బ్రతుకులు మనవి ! సంసారాన్ని ఈదడమే మనబోటి వాళ్ళకు నరకప్రాయం !

అలాంటప్పుడు తెలిసే చేస్తున్నావా ఇలాంటి పనులు ! ఇప్పుడు చూడు ! నీకే ఉద్యోగం ఇవ్వరాదంటూ ప్రభుత్వం ఆర్డరు జారీ చేసింది ! నువ్వొక్కడివయితే పోనీలే అనుకోవచ్చు, కానీ నీవు పెళ్ళయిన వాడివిరా ! అసలు నీకు 'పెళ్ళాం' అనే మనిషి ఒకటుందని గుర్తుందా ? చెప్పు? అడుగుతున్నది నిన్నే !" శ్రీనివాసరావు పలుకుల్లో గద్దింపు !

మౌనం వహించాడు హరి సర్వోత్తమరావు.

"అసలు నీకు పెళ్ళాం వుందన్న విషయం గుర్తుంటే ఇలా చేసేవాడివి కాదు ! ఇప్పుడు చూడు ! నీవు ఏ ఉద్యోగానికి అక్కరకు రాకుండా పోయావు ! ఈ పరిస్థితిలో పెళ్ళాన్నెలా పోషిద్దామనుకొన్నావు ? ఇన్నాళ్ళయితే ఏదో చదువుకొంటున్నావని, అమ్మాయిని ఇక్కడ వుంచుకున్నారు. ఇంకా ఎంతకాలమని పెళ్ళయిన అమ్మాయిని పుట్టింట్లో వుంచుకొంటారు ? ఇలా వుంచుకోవడం వీరికి ఎంత అవమానంగా వుందనుకొన్నావు ? ఈ విషయం గురించి ఏనాడైనా ఆలోచించావా ? ప్రతి విషయంలోనూ నీ ముక్కుసూటిగా పోతే ఎలాగనుకొన్నావు? ఇవతల వాళ్ళ గురించి కూడా ఆలోచించే సంస్కారం నేర్చుకోవాలి ? రేయ్ ! నీ మీద నేనెన్ని ఆశలు పెట్టుకొన్నాను ? నిన్ను పెంచి పెద్దచేసి చదువు చెప్పించిందేకాక, నిన్ను దత్తత తీసుకొని నా యావదాస్థికి వారసుడ్ని చేద్దామనుకొన్నాను. చివరికి నువ్వేమో ఇలా తయారయ్యావు" అంటూ నిట్టూర్చి మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు శ్రీనివాసరావు.

"సరే, ఇప్పటికయినా మించిపోయింది లేదు. నా వెంటవచ్చి నే చెప్పినట్టుగా చెయ్ ?"

"ఏం చేయాలి ?" పినతండ్రి మాటలకు ఆలోచిస్తున్న వాడై అడిగాడు హరి సర్వోత్తమరావు.

"రాజమండ్రి వెళ్ళి, ఆప్రిన్సిపాల్ కాళ్ళో, కడుపో పట్టుకొని నీపై జారీ అయిన జీ.వొ..ను రద్దు పరచేందుకు ప్రయత్నిస్తాను. నువ్వుమాత్రం 'పొరపాటయ్యింది' అని అతన్ని వేడుకోవాలి! ఇంకెప్పుడూ ఉద్యమాల జోలికి వెళ్ళనని వ్రాసివ్వాలి ! ఆనక నేను చూసుకొంటాను."

తన పినతండ్రి పలుకులు చిరాకు కల్గించినా, నిభాయించుకొంటూ చెప్పాడు హరి సర్వోత్తమరావు.

"క్షమించండి చిన్నాన్నా ! నేనంటూ ఓ నిర్ణయానికి వచ్చానంటే తిరిగి ఆ నిర్ణయాన్ని మార్చుకునే ప్రసక్తేలేదు. ఎవరి దగ్గరికి వెళ్ళి కాళ్ళు పట్టుకోవల్సిన అవసరం లేదు ! తిరిగి కాలేజీలో చేరే అగత్యం అంతకన్నా లేదు ! ఇన్నాళ్ళుగా నా పట్లకన్న తండ్రి కంటే మిన్నగా చేయూత అందించిన మీకు సదారుణపడి వుంటాను. ఇక నా భార్య విషయం అంటారా ? పెళ్ళి చేసుకొన్నవాడు కేవలం ఉద్యోగం చేసే భార్యను పోషించనక్ఖరలేదు. అవసరమైతే కాయకష్టం చేసయినా భార్యను పోషించుకోవచ్చు !"

హరి సర్వోత్తమరావు మాటలు శ్రీనివాసరావు ఆవేశాన్ని ఎక్కువ చేశాయి.

"అంటే ఇంత చదువు చదివి కాయకష్టం చేస్తానంటావు !"

"అవసరం, పరిస్థితి ఏర్పడినప్పుడు చేస్తే తప్పేమిటి ? చదువు అన్నది మనిషి తన మనుగడను ఏర్పరచుకోవడానికేగాని, కేవలం ఉద్యోగం చేయడానికి కాదు."

"అంటే ఏ ఆధారం లేకున్నా, నీ భార్యను పోషించగలనంటావు !"

"అవును !"

"సరే, నీ ఇష్టం ! నువ్వింత గట్టి నిర్ణయానికి వచ్చాక ఇక నిన్ను బ్రతిమిలాడి ప్రయోజనమేమిటి ? నీవు నాకు కావలసిన వాడివని, అమ్మాయిని నీ దగ్గరికే తీసుకొచ్చి ఓ మంచి ఉద్యోగం చూసి మీ సంసారం బాగుపడేలా చేయాలని ఇక్కడకి వచ్చాను. కాని, నా ఆశలను అడియాసలు చేశావు. నా మాటలు నీటి మూటలుగా చేసినపుడు నీ గురించి ఎందుకు ఆలోచించాలి ? అలాగే కానివ్వు ! నీ భార్యను ఎక్కడికి తీసుకెళతావోతీసుకెళ్ళు ! నువ్వు కాటిలో కాపురం పెట్టినా నేను పట్టించుకోను ! ఏమ్మా ఇక నీ యిష్టం, నీ అల్లుడి ఇష్టం !" అంటూ వీణాబాయి వంక చూశాడు శ్రీనివాసరావు.

ఏమని జవాబివ్వాలో తోచక, కాసేపు తటపటాయించిన వీణాబాయి శ్రీనివాసరావు చెప్పిన మాటలనే మళ్ళీ సర్వోత్తమరావుతో చెబుతూ అంది.

"మీ చిన్నాన్న చెప్పినట్టుగా చెయ్యి బాబూ ! లేకుంటే, కోరి కష్టాలను తెచ్చుకున్నట్టవుతుంది !"

"కష్టమైనా సరే, నిష్టూరమైనా సరే నా నిర్ణయం మారదు. నేను రేపే నా భార్యను తీసుకువెళతాను. ఇక మళ్ళీ చర్చకు తావివ్వకండి !" అంటూ విసురుగా బయటికొచ్చి అరుగుపై కూర్చున్నాడు హరి సర్వోత్తమరావు.

కాసేపటి తర్వాత బయటి కొచ్చిన వీణాబాయి సర్వోత్తమరావుతో అంది.

"రా బాబు భోంచేద్దువు గాని !"

హరిసర్వోత్తమరావు మౌనం వహించాడు.

"మాపై కోపమాబాబు ?"

"అబ్బే ! మీపై నాకెందుకు కోపం ? అసలు నాకెవరిపై కోపంలేదు. నా నిర్ణయం గురించి చెప్పానంతే !"

"సరే ! నీ నిర్ణయాను సారమే చెయ్‌బాబు ! పెద్దవారమై మేము చెప్పాల్సింది చెప్పాము. ముందు జీవితం మీది ! మీ భవిష్యత్తు మీరే ఆలోచించుకోవాలి. నువ్వీ నిర్ణయం పై నిలబడ్డాక మళ్ళీ ఎందుకు ప్రశ్నిస్తాం ? రాబాబు ! మీ చిన్నాన్న సందెవార్చి కూర్చున్నాడు."

హరిసర్వోత్తమరావు, లేచి లోపలికి వెళ్ళి పెరటివైపు దారితీశాడు. స్నానం చేసి వచ్చాడన్న మాటేకాని, సందెవార్చకుండా భోజనానికి కూర్చునేసరికి, వీణాబాయితోపాటు, శ్రీనివాసరావులో కూడా విస్మయం ! ఆ విస్మయానికి మరొక కారణం ? అతని ఒంటిపై యజ్ఞోపవీతం లేకపోవడమే !

'యజ్ఞోపవీతమేమయ్యింది ?" హరిసర్వోత్తమరావు వంక గుడ్లురిమి చూస్తూ అడిగాడు శ్రీనివాసరావు.

"తీసేశాను !"

హరిసర్వోత్తమరావు జవాబు విన్న శ్రీనివాసరావు స్థాణువయ్యాడు.

"జంధ్యం తీసేశావా ? ఎందుకు బాబూ !?

మెల్లిగా అడిగింది వీణాబాయి.

"అవసరం లేదనిపించి తీసేశాను."

పై జవాబువిన్న శ్రీనివాసరావు హరిసర్వోత్తమరావుపై మండిపడుతూ,

"ఓరీ అప్రాచ్యుడా ! ఏదిరా నీకవసరం లేనిది ? అసలు నీవు బ్రాహ్మడవేనా ? ఎలాంటి సంప్రదాయ కుంటుంబం మనది ! అలాంటి కుటుంబానికి మచ్చ తేవడానికి పూనుకున్నావురా కులభ్రష్టుడా ! అసలు నీలాంటి వాడితో కలిసి భోం చేయడమే తప్పు !" అంటూ విసురుగా లేవబోతుండగా, వీణాబాయి అడ్డుపడి బ్రతిమిలాడుతూ అంది.

"ఏదో కుర్రతనం మన్నించండి ! భోజనం పై నుంచి లేవడం మీలాంటి వారికి భావ్యంకాదు !"

"నాకు తెలుసమ్మా కానీ వీడు..... వీడు మన సనాతన సంప్రదాయాల్ని నాశనం చేస్తుంటే అన్నమెలా సహిస్తుందమ్మా ?"

"సహించక పోవడానికి నేనేం కాని పని చేయలేదే ! నా అభిరుచులకు తగ్గట్టుగా నడుచుకుంటున్నానంతే ! మిమ్మల్ని నాలా మారమని బలవంతం చేయలేదే !"

"చూశావమ్మా వీడిమాటలు ! అసలు నిన్ను కాదురా అనాల్సింది ! నన్ను నేను అనుకోవాలి ! చదివిస్తే వున్నమతి కాస్త పోయిందన్నట్లుగా, మన ఆచార వ్యవహారాలకు తద్దినం పెడుతున్నావు. నీ కంటే గొప్ప చదువులు చదివి, గొప్ప గొప్ప ఉద్యోగాలు చేస్తున్న వారెందరో వున్నార్రా, అయినా వారు నీలా మన బ్రాహ్మణ్యాన్ని మంటగలపలేదు."

"నేనేం మంట గలపలేదు చిన్నాన్నా. అనవసరంగా నా మీద విరుచుకపడుతున్నావు."

ఈ మాటల యుద్ధం ఎందాక వెళుతుందో, తత్ఫలితంగా ఎలాంటి పర్యవసానం సంభవిస్తుందోనని భయపడిన వీణాబాయి, "అన్నయ్యగారూ ! నా మాట వినండి !" అంటూ

కాసేపు బ్రతిమిలాడి, శాంతింపజేసి ఇద్దరి చేత మౌనంగా భోజనాలు చేసేలా చేసి తేలిగ్గా నిట్టూర్చింది !

*                    *                    *

తర్జన భర్జనలు జరిగాక మలి ఝామప్పుడు తన చెంతకు వచ్చిన రామాబాయి వంక చూస్తూ అన్నాడు హరిసర్వోత్తమరావు "నేనంటే నీకు కోపంగా వుంది కదూ !"

"ఊహూ !" మౌనంగా తల అడ్డంగా ఆడించింది రామాబాయి.

"మరెలా వుంది !"

ఏం చెప్పాలో తెలియని పరిస్థితి !

"పర్వాలేదు చెప్పు !" అంటూ భార్యను తన సరసన కూర్చోబెట్టుకుంటూ అడిగాడు హరిసర్వోత్తమరావు.

మాటలు కూడబలుక్కొంటున్నట్టుగా కాసేపటి తర్వాత అంది రామాబాయి !

"మీరేమి చేసినా, మీ నిర్ణయానికి తగు రీతిగా ప్రవర్తించడం మీ అర్ధాంగిగా నా బాధ్యత !"

తన అర్ధాంగి నుంచి తనకనుకూలమైన మాటవిన్న హరిసర్వోత్తమరావు ఆనందంతో వుబ్బితబ్బిబ్బయి, "చాలు రాముడూ ! ఈ పలుకు చాలు ! నా జీవిత గమనంలో ఎన్ని కష్టాలెదురైనా, ఎదిరించి ధైర్యంగా ముందుకు సాగిపోగలను." అంటూ రామాబాయిని తన హృదయానికి హత్తుకొన్నాడు.

"అదే చాలు పదివేలు" అనుకొని భర్త హృదయానికి గాఢంగా హత్తుకొనిపోయింది రామాబాయి.

*                    *                    *

మరు రోజు తన భర్త రాగానే విషయమంతా పూసగుచ్చినట్లు చెప్పి, కూతురు, అల్లుడి ప్రయాణపుటేర్పాట్లు గావించింది వీణాబాయి.

కన్నవారిని, వున్నవారిని వదిలి భర్తవెంట ఎద్దుల బండిలో ప్రయాణమై పోతోన్న రామాబాయి కంట కన్నీరు ఆగింది కాదు. ఆ కన్నీరులో అర్థముంది !

అందుకే మిన్నకుండిపోయాడు హరిసర్వోత్తమరావు !

శ్రీనివాసరావు కూడా వారివెంట పయనమయ్యాడు. మదనపల్లి చేరేవరకు వారి మార్గమొక్కటి !

బండి మదనపల్లి చేరాక ఇద్దరి దారులు శాశ్వితంగా వేరయ్యాయి !

# 5

బెజవాడ....... అద్దె ఇంట్లో......

రామాబాయమ్మ అల్మారాలో, పుస్తకాలను సర్దుతూ వుండగా, ఓ పుస్తకం జారి క్రిందపడింది !

అక్కడే వాలు కుర్చీలో కూర్చుని, 'కృష్ణాపత్రిక'కు వ్యాసం వ్రాస్తున్న హరిసర్వోత్తమరావు చటుక్కున తలెత్తి చూశాడు ! రామాబాయి ఆ పుస్తకాన్ని అందుకొని అల్మారాలో అమర్చబోతుండగా–

"రాముడూ ! ఆ పుస్తకమిలా ఇవ్వు !" అంటూ చెయ్యి చాచాడు.

పుస్తకాన్ని అందుకుని పరిశీలనగా చూచాడు హరిసర్వోత్తమరావు.

అది తను వ్రాసిన పుస్తకమే !

'అబ్రహాంలింకను జీవిత చరిత్ర'

"విజ్ఞానమండలి' చే ప్రచురింపబడిన తొలి అనువాద గ్రంథం.'

"సాహిత్యం – అదొక లోకం !

అందులోని ఆనందం ఆస్వాదిస్తేనే కాని తెలియదు.... ఆ తృప్తి...... ఆ అనుభూతి. ఇక సాహితీ మిత్రులు తోడైతే ! బాహ్య ప్రపంచమే కళ్ళకు కన్పించదు. అదే సాహిత్య తత్త్వం.'

"విజ్ఞాన చంద్రిక' గ్రంథమండలి స్థాపన... అందుకు తను, తన మిత్రులు కొమర్రాజు లక్ష్మణరావు, అయ్యదేవర కాళేశ్వరరావు, రావిచెట్టు రంగారావు, మద్రాసు నగరంలోని మునగాల రాజానాయని వెంకట రంగారావు బంగళాలో ప్రతి సాయంకాలం చేరటం... చర్చలు జరపడం...... ఆనాటి ఆరాటం...... పోరాటం...... శ్రమ, కళ్ళముందు లీలగా కదులాడుతుండగా......

"హరి సర్వోత్తమరావుగారూ !"

అన్న పిలుపు విన్పించి తేరుకొని తలెత్తి చూశాడు. ఎదురుగా, వందేమాతర ఉద్యమంలో తనలాగే చురుగ్గా పాల్గొంటున్న పింగళి లక్ష్మీనారాయణ, బోడినారాయణరావు, బొడ్డపాటి శేషగిరిరావు అగుపించారు.

"రండి !" అంటూ వారిని సాదరంగా ఆహ్వానించి ఆశీనులను చేస్తూ, అడిగాడు హరిసర్వోత్తమరావు.

"ఏమిటో విశేషం ? ఉద్యమ మిత్రులంతా ఒక్కుమ్మడిగా విచ్చేశారు !"

"మీతో ఓ ముఖ్య విషయం చర్చించాలని వచ్చాము !"

"ఏ విషయంపై ?" కుతూహలంగా అడిగాడు హరిసర్వోత్తమరావు.

"ఉద్యమ విషయం గురించే !"

"చెప్పండి !" అంటూ భార్యను పిలిచి తన ఉద్యమ మిత్రులను అర్ధాంగికి పరిచయం చేసి చెప్పాడు.

"రాముడూ ! కాఫీ పట్రా !"

"అలాగే !" అంటూ నవ్వుతూ వొంటింట్లోకి వెళ్ళింది రామాబాయి.

మళ్ళీ 'అసలు విషయం' పై మాటలు మొదలయ్యాయి.

పింగళి లక్ష్మీనారాయణ చెప్పుకొచ్చాడు.

"మనం వందేమాతరం ఉద్యమంతో పాటు కాంగ్రెస్‌పార్టీ ప్రచారంలో కూడా పాలుపంచుకుంటే బాగుంటుందని మా అభిప్రాయం !"

కాసేపు ఆలోచించాక చెప్పాడు సర్వోత్తమరావు.

"అలాగే చేద్దాం !"

"మన ఉద్యమం ప్రజానీకంలో బాగా వ్యాప్తి చెందాలంటే ఉద్యమ లక్ష్యాలను వివరించేందుకు ఓ పత్రిక ఎంతైనా అవసరం. మీరేమంటారు ?"

"మీరన్నది అక్షరాలా నిజం ! కాని......" అంటూ ఆగిపోయాడు హరిసర్వోత్తమరావు.

"ఆగిపోయారేం. చెప్పండి !" హరిసర్వోత్తమరావు ముఖంలోకి ఆదుర్దాగా చూస్తూ అడిగాడు పింగళి లక్ష్మీనారాయణ.

"పత్రికా నిర్వహణ చాలా ఖర్చుతో కూడుకొన్న పని ! గతంలో ఆ అనుభవం చవిచూశాం ! అప్పట్లో 'విజ్ఞాన చంద్రిక' సంస్థకు ఆర్థికవనరులు సమకూర్చినారు మునగాల రాజావారు, నేడు అలాంటివారు ఎవరున్నారు ?"

"ఆ విషయం గురించి తర్వాత ఆలోచిద్దాం ! ముందుగా పత్రిక ఆలోచన సమంజసంగా వుందంటారా ?"

"చక్కటి ఆలోచనే చేశారు ?"

"ఆ మాటొక్కటే చాలు ! మాకు కొండంత బలం ! అయితే మేము స్థాపించబోయే పత్రికకు 'ఎడిటర్'గా మీరుండాలని మా అందరి అభిమతం." అటూ తన మిత్రులవైపు చూశాడు లక్ష్మీనారాయణ.

బోడినారాయణరావు, శేషగిరిరావు మిత్రుని కోరికని బలపరిచారు.

"నా కంటే అనుభవజ్ఞులు, పత్రికారంగంలో విశేషానుభవమున్నవారిని వుంచడం మంచిది !"

ఆ మాటకు బోడినారాయణరావు స్పందిస్తూ,

"అనుభవమున్నా ఆశయాలుండాలిగా ! మీరు "విజ్ఞానచంద్రిక" మండలికి కార్యదర్శిగా వ్యవహరించిన అనుభవం, చాలాకాలంగా పలు పత్రికలకు రచనలు చేసి, పత్రికా రచయితగా కూడా అనుభవం సంపాదించారు. అందులో ఈ ఉద్యమంలో మీ వంతు పాత్ర కూడా ఎన్నదగినది. కాబట్టి మీరు దయ వుంచి అంగీకరించాలని కోరుకొంటున్నాము."

"అలాగే – ఇందరు కోరుతుంటే తిరస్కరించడం భావ్యం కాదు. మరి పత్రికకు ఏ పేరు పెట్టదలచుకున్నారు ?" అడిగాడు హరిసర్వోత్తమరావు.

"కొత్తగా పేరు పెట్టాల్సిన అవసరం లేదనుకున్నాం ! ఎందుకంటే తిరుపతి వాస్తవ్యులు శ్రీనివాసాచార్యులుగారు ఇక్కడినుంచి వెలువడుతున్న 'వెంకటేశ్వర' పత్రికను, 'స్వరాజ్య' పత్రికగా మార్చి కొన్నాళ్ళు నడిపారు. వారిప్పుడు ఆ పత్రిక డిక్లరేషన్ అమ్మడానికి సిద్ధంగా వున్నారు కాబట్టీ ఆ పత్రికను కొంటే బాగుంటుందని అనుకొంటున్నాము. పేరు కూడా ఉద్యమానికి తగినట్లుగా వుంది. మరి మీరేమంటారు ?"

"'స్వరాజ్య' పేరైతే నచ్చింది. అయితే....."

"చెప్పండి ?" ముక్త కంఠంతో అన్నారు మిత్రులందరూ !

"ఈ పత్రిక నిర్వహణకు మూలధనం ఎవరు సమకూరుస్తున్నారు ?"

హరిసర్వోత్తమరావు ప్రశ్నకు సమాధానంగా ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు!

"సమాధానం చెప్పండి ?" రెట్టించి అడిగాడు మళ్ళీ !

"సమకూర్చేవాడు, ఒనకూర్చేవాడు అంతా ఆపైవాడే ! వాడిపైనే భారం వేశాము. వాడే ఏదో ఒకదారి చూపకపోడు. ఆ విషయం గురించి మీరు ఎలాంటి అనుమానం పడవలసిన అవసరం లేదు ! ఓ వారం తర్వాత మిమ్మల్ని కలుస్తాము. అప్పుడే మీరు కూడా మాతోపాటు వుండి పత్రిక కొనుగోలు, డిక్లరేషన్ వ్యవహారాల్లో సహకరించవలసిందిగా కోరుచున్నాము" అంటూ సమాధానం చెప్పాడు పింగళి లక్ష్మీనారాయణ.

"తప్పకుండా !" అంటూ బదులిచ్చాడు హరిసర్వోత్తమరావు.

"వస్తామండీ !" అంటూ వీడ్కోలు తీసుకుని, వారందరు వెళ్ళిపోయాక ఆలోచనలో పడ్డాడు హరిసర్వోత్తమరావు.

"పై వాడిదే భారం అంటున్నారు ! అసలు వీరు మూలధనం ఎలా సంపాదించదలచుకొన్నారో? సరే చూద్దాం !"

అనుకొంటూ 'కృష్ణాపత్రిక'కు ఉద్యమ సంబంధమైన వ్యాసం వ్రాయడంలో నిమగ్నమయ్యాడు. ప్రస్తుతం అతని జీవితాధారం పత్రికలకు చేసిన రచనల తాలూకు వచ్చే పారితోషికాలే !

* * *

హరి సర్వోత్తమరావు నుంచి శెలవు తీసుకొని వచ్చిన మిత్ర బృందంలో బోడినారాయణరావు "కొద్దిపాటి పనుంది మళ్ళీ కలుస్తాను" అంటూ వెళ్ళిపోయాడు. మిగిలిన పింగళి లక్ష్మీనారాయణ, బొడ్డపాటి శేషగిరిరావు తిన్నగా నడుస్తూ వెళ్ళి కృష్ణానది ఒడ్డున కూర్చున్నారు. ఇద్దరి మధ్య మాటలు కరువయ్యాయి ! పత్రిక ప్రారంభించడానికి మూలధనం ఎలా సంపాదించాలి ? అన్న ఆలోచనలే వారి మనసులో మెదలుతూ వున్నాయి !' కొద్దిసేపటి తర్వాత ఏదో నిర్ణయానికి వచ్చినవాడై అన్నాడు బొడ్డపాటి శేషగిరిరావు.

"ఓ ఆలోచన !"

"ఏమిటది ?" ఉత్సాహంగా అడిగాడు లక్ష్మీనారాయణ.

"చందాలు వసూలు చేస్తే !"

"మూలధనం ఎంతలేదన్నా పదివేలదాకా కావాలి ! అంత డబ్బు చందాలవల్ల పోగు చేయడం సాధ్యం కాని పని ! అయినా చందాలతో నడిపే పత్రిక చాలాకాలం కొనసాగదు."

"మరైతే ఏది దారి ?"

"ఓ ఆలోచన వచ్చింది కాని, ఆ ఆలోచన ఆచరణ సాధ్యంకాదేమోనని !"

"ఏమిటా ఆలోచన ?"

తన ఆలోచన నెమ్మదిగా తనమిత్రునికి వివరించి చెప్పాడు లక్ష్మీనారాయణ ! లక్ష్మీనారాయణ చెప్పింది విన్న బొడ్డపాటి శేషగిరిరావు ఓ నిముషంపాటు నిశ్చేష్టుడై మిత్రునివంక చూస్తూండిపోయాడు ! లక్ష్మీనారాయణ చిన్నగా నవ్వి అతన్ని కుదుపుతూ అన్నాడు.

"భయమేసిందా మిత్రమా !"

"భయమే ! అసలు ఈ ఆలోచన నీకెలా వచ్చింది ?" ఆరా తీస్తున్నట్లుగా అడిగాడు.

"అవసరాలే, మనిషికి తెలివితేటలు కలిగిస్తాయట ! ఇదీ అంతే ! ఇంతకూ నా ఆలోచనపై నీ అభిప్రాయమేమిటి ?" ప్రశ్నించాడు లక్ష్మీనారాయణ.

కొద్దిసేపు ఆలోచనకు లోనయిన శేషగిరిరావు చివరకి భారంగా నిట్టూర్చి చెప్పాడు.

"కొన్ని మంచిపనుల కోసం, చెడు కార్యాలయినా చేయక తప్పదంటారు. నువ్వు చెప్పింది ఆ కోవలోదే !"

"వ్యాఖ్యానం కాదు కావల్సింది. కార్యసాధన ! ఎలా వుంది ఈ ఆలోచన ?"

"ఆలోచన మంచిదికాదు. పైగా క్లిష్టమైనది. అయినా తప్పదంటున్నావు. కాని అమలు చేసేవారు ?" సందేహిస్తూ అడిగాడు శేషగిరిరావు.

"మనిద్దరం !" తాపీగా చెప్పాడు లక్ష్మీనారాయణ.

"మనమా ?"

"అవును ! మనిద్దరమే !"

శేషగిరిరావు కళ్ళలో విస్మయం !

"మనం పూనుకోకపోతే మరెవురు పూనుకొంటారనుకున్నావ్ ?"

"నాకెందుకో భయంగా వుంది మిత్రమా !"

"భయమా ! భయపడటం ధీరుల లక్షణం కాదు !"

"అయితే అన్నిటికి సిద్ధమయ్యే ఈ నిర్ణయానికి వచ్చావా ?" సందేహం వ్యక్తం చేస్తూ అన్నాడు శేషగిరిరావు.

"అవును ! ఏది ఏమైనా ఈ నిర్ణయంలో వెనుకంజె వేయటం జరుగదు. ఉద్యమం కోసం ప్రాణాలు పోయినా సరే ఈ సాహసం చేయక తప్పదు ! అలాగే నువ్వు నాతో సహకరించక తప్పదు !"

"ఈ విషయం బోడి నారాయణరావుకు తెలిపితే బాగుంటుందేమో ?"

"ఆయన తోనా ! వద్దు ! ఇలాంటి విషయాలంటే మండిపడతాడు. ముక్కుసూటి మనిషి ! మనతో సహకరించడు, సరికదా చీవాట్లు కూడా పెడతాడు."

"నువ్వన్నది కూడా నిజమే !" అంటూ నిట్టూర్చి "అయితే నీతోపాటు ఈ సాహస కృత్యంలో పాలు పంచుకోక తప్పదంటావు" మెల్లిగా అన్నాడు శేషగిరిరావు.

"నా ఆప్తమిత్రునిగా నీకీ బాధ్యత తప్పదు !"

"సరే ! మరి ఈ సాహస కార్యానికి ముహూర్తం ?" బెదురు బెదురుగానే అడిగాడు శేషగిరిరావు.

"చెబుతాగా !" అంటూ లేచి నిల్చున్నాడు పింగళి లక్ష్మీనారాయణ !

శేషగిరిరావు కూడా లేవకతప్పలేదు !

# 6

అర్ధరాత్రి సమయం........

ఎటు చూసినా గాఢాంధకారం !

టార్చిలైటు వెలుగులో ఎలాంటి అలికిడి రాకుండా, మెల్లిగా పిల్లిలా అడుగులో అడుగువేస్తూ తామనుకొన్న ప్రాంతానికి చేరుకొన్నారు మిత్రులిద్దరూ ! ఓ మారు ఆ ప్రాంతమంతా

నిశితంగా పరిశీలించి చూశారు. తమ వునికి ఎవ్వరూ గమనించలేదన్న నిర్ణయానికొచ్చారు. ఆ నిర్ణయం వల్ల, వారిలో వున్న కొద్దిపాటి జంకు పూర్తిగా తొలగిపోయింది.

లక్ష్మీనారాయణ, శేషగిరిరావు వంక చూస్తూ మెల్లిగా చెప్పాడు.

"నువ్వు ధైర్యంగా నా వెనువెనుకే అడుగువెయ్యి !"

"అలాగే !" అంటూ తలూపాడు శేషగిరిరావు.

లక్ష్మీనారాయణ వెన్నంటి ముందుకు నడుస్తున్న శేషగిరిరావు దృష్టి అనుకోకుండా ప్రక్కకు మళ్ళింది ! కొద్ది దూరంలో ఎవరివో మాటలు వినిపించాయి. చీకటి కారణంగా ఛాయామాత్రంగా మనుషుల ఆకారాలు అగుపిస్తున్నాయి !

లక్ష్మీనారాయణ భుజంపై చిన్నగా తడుతూ చెప్పాడు శేషగిరిరావు.

"మిత్రమా ! అక్కడెవరో మనుషులు వున్నారు !"

"కాపలా వాళ్ళయి వుంటారు !"

"వారి దృష్టి మనపైకి మళ్ళితే !" అనుమానం వ్యక్తం చేశాడు శేషగిరిరావు.

"మళ్ళినప్పటి మాట ! నువ్వు మాత్రం మాట్లాడక నా వెంటరా !"

ఇంకేదో చెప్పాలనుకున్న శేషగిరిరావు, ఆ ప్రయత్నం మానుకొని లక్ష్మీనారాయణ వెంట అడుగులు వేస్తున్నాడు. అయినా అతని దృష్టి పరిసరాలను గమనిస్తూనే వుంది ! కాసేపటి తర్వాత కోట వెనుక భాగానికి చేరుకొన్నారు. లక్ష్మీనారాయణ అటూ ఇటూ ఓ మారు నలుదిక్కులా చూసి తన నడుముకు చుట్టుకున్న ముళ్ళతాడును తీసి కొక్కెం తగిలించి, కొక్కాన్ని గిరగిర గాలిలో బలంగా తిప్పి కోట మొదటి అంతస్థువైపు విసిరాడు. కొక్కానికి పట్టు లభించని కారణంగా, తాడును లాగినపుడు, కొక్కెం వెనక్కు వచ్చి పడింది ! రెండోమారు మరీ బలంగా విసిరాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. అదే సమయంలో మొదటి అంతస్థులో కుడివైపు వున్న ఓ ఇనుప చువ్వల కిటికీ శేషగిరిరావు దృష్టిని ఆకర్షించింది ! కోట మొదటి అంతస్థులో దీపపు కాంతిమూలంగా ఆ భాగమంతా ప్రకాశవంతంగా అగుపిస్తోంది ! వెంటనే ఆ కిటికీ చువ్వలను చూపిస్తూ చెప్పాడు శేషగిరిరావు !

"ఆ కిటికీ చువ్వల మధ్యలోకి కొక్కెం వెళ్ళిపడేలా విసురు !"

లక్ష్మీనారాయణ అలాగే చేశాడు. ఆ చువ్వల మధ్యలో నుంచి విసురుగా అవతలికి వెళ్ళిపడింది కొక్కెం ! వారి ప్రయత్నం ఫలించింది ! నెమ్మదిగా తాడును లాగిచూశాడు. కొక్కెం వొంపు, కిటికీ చువ్వలకు అతుక్కుపోయి పైకి పాకడానికి ఆధారమయ్యింది !

మిత్రులిద్దరిలో ఎనలేని ఆనందం !

"మొదట నేను పైకెళ్తాను. ఆ తర్వాత నువ్వు !"

"అలాగే !" అంటూ తలాడించాడు శేషగిరిరావు.

తాడుకు ముళ్ళున్న కారణంగా అవలీలగా పైకి పాకుతూ కోట మొదటి అంతస్థును చేరుకున్నాడు లక్ష్మీనారాయణ. ఆ పరిసర ప్రాంతమంతా తేరిపార జూశాక శేషగిరిరావును పైకి రమ్మని సైగచేశాడు. వెంటనే పైకి చేరుకున్నాడు అవలీలగా శేషగిరిరావు. ఎందుకయినా మంచిదన్న ఉద్దేశంతో తాడును పైకి లాగి ఓ మూల వుంచారు ఎవ్వరికీ అనుమానం రాకుండా!

కోట మొదటి అంతస్థు చేరుకున్న మిత్రులిద్దరు ఎలాంటి అడుగుల శబ్దం వినపడకుండా అడుగులో అడుగు వేసుకుంటూ ముందుకు సాగారు. అకస్మాత్తుగా లక్ష్మీనారాయణలో ఓ అనుమానం తలెత్తింది. దానిని నివృత్తి చేసుకునేందుకు, ఓ గోడచాటున నిల్చొని, కోటముందు భాగం వైపు దృష్టి సారించాడు. కోట వెలుపల కాపలావాళ్ళు గాజు సీసాల్లాంటి వాటిలో చమురు దీపాలుంచుకొని అటూ ఇటూ పహారా కాస్తున్నారు. ఇప్పట్లో వాళితో తమకెలాంటి ఆపద లేదని శేషగిరితో చెప్పాడు లక్ష్మీనారాయణ.

"పద !"

ఆ కోటలోని ప్రతి గది తనకు తెలుసు కనుక వడివడి అడుగులతో ముందుకు సాగుతున్నాడు లక్ష్మీనారాయణ. అతన్ని పరుగులాంటి నడకతో అనుసరిస్తూ అడిగాడు శేషగిరిరావు.

"మిత్రమా ! కోటలో ఎవరూ ఉన్నట్టు లేరు......"

"వుష్. గట్టిగా మాట్లాడకు ! ముఖ్యమైన బంధువుల పెళ్ళి వున్నందున అందరూ తరలివెళ్ళారు. అందుకే ఈ మొదటి అంతస్థులో ఎవ్వరూ లేరు. వారింకా రెండురోజుల వరకు రారు !"

"మరి క్రింద ?" మెల్లిగా అన్నాడు శేషగిరిరావు."

"దాసీలు, నౌకర్లు పడుకొని వుంటారు !" నడక సాగిస్తూనే జవాబిచ్చాడు లక్ష్మీనారాయణ !

"మనం దొంగలించబోతున్న వజ్రాల పెట్టె ఎక్కడుంది ?"

"పూజామందిరంలో.. వెంకటేశ్వరుని విగ్రహం క్రింద !"

"ఈ విషయం నీకెలా తెలుసు ?"

"మా నాన్నగారు ఈ సంస్థానానికి చిరపరిచితులు ! నేను కూడా ఓసారి వారు నిర్వహించే పూజా కార్యక్రమంలో వచ్చి పాల్గొన్నపుడు గమనించాను."

"మరి ఆ గదికి తాళం వుండదా ?"

"ఆ వజ్రాల విషయం - రాజాగారి ఆప్తమిత్రులకు తప్ప మరెవ్వరికీ తెలియదు. కాబట్టి తాళం వేయరు. ఆ గదిలోకి ఎవ్వరూ వెళ్ళరు !"

"పూజ గది ఎక్కడుంది ?"

"అదుగో.... ఎదురుగా అగుపించే గదే !" అంటూ వడివడి అడుగులు వేస్తూ పూజ గదిని సమీపించాడు లక్ష్మీనారాయణ. మూసివున్న తలుపులవంక ఓ మారు తేరిపార చూసి చెప్పాడు లక్ష్మీనారాయణ !

"మిత్రమా ! మూసివున్న ఈ తలుపులు నా ఒక్కడి వల్ల తెరచుకోవు ! ఇద్దరం మన భుజబలాన్ని ఉపయోగించవలసి వుంటుంది. ఊ...... కానీ !" అంటూ అతి కష్టంమీద ఆ తలుపులకు వేసివున్న గడియ తీసి, నెట్టడం ప్రారంభించాడు లక్ష్మీనారాయణ. శేషగిరిరావు తన తోడ్పాటు అందించాడు.

'హుఫ్' అంటూ ఇద్దరూ రెండు మూడుసార్లు బలంగా తగిలిన తర్వాత పదడుగుల ఎత్తు, అయిదడుగుల వెడల్పు వున్న ఆ తలుపులు భళ్ళున శబ్దం చేస్తూ తెరుచుకున్నాయి !

ఆ శబ్దానికి కంపించిపోయాడు శేషగిరిరావు ! వణుకుతోన్న స్వరంతో చెప్పాడు !

"ఈ శబ్దానికి క్రిందపడుకొని వున్న నౌకర్లలో ఎవరైనా పైకి రాక తప్పదు. మనం పట్టుబడటం ఖాయం ! ఇప్పుడు దారేది మిత్రమా ?"

"పిరికివాడికి మల్లే భయపడతావేం ? నువ్విక్కడే వుండి ఇటెవరైనా వస్తారేమో చూస్తూ వుండు. నేను క్షణంలో వచ్చేస్తాను !" అంటూ పూజామందిరంలోకి పరుగు తీశాడు లక్ష్మీనారాయణ.

బయట నిల్చున్న శేషగిరిరావుకు గుండె దడ ఎక్కువయ్యింది ! క్రిందినుంచి పైకి ఎక్కివస్తున్నట్టుగా అడుగుల శబ్దం వినిపించేసరికి, శేషగిరిరావుకు ముచ్చెమటలు పట్టాయి !

"మిత్రమా ! త్వరగా రా ! ఎవరో వస్తున్నట్టున్నారు." అంటూ సన్నటి కీచుగొంతుతో అరిచాడు.

"ఆ.... వస్తున్నా......!" అంటూ పూజామందిరంలోంచి పరుగు పరుగున బయటికి వచ్చిన లక్ష్మీనారాయణ చేతిలో చందుకాయపెట్టె !

అడుగుల శబ్దం దగ్గరవుతూ వుంది !

ఈమారు ఇద్దరిలోనూ గుండెదడ !

గబగబ తలుపు మూసి గొళ్ళెం వేశారు శబ్దం రాకుండా !

దగ్గుస్వరం వినిపించగానే ఇద్దరిలో భయం కదలాడింది ! పరుగెత్తితే అడుగుల శబ్దం వస్తుందని మెల్లిగా అడుగులు వేస్తూ వెళ్ళి పక్కనే వున్న గోడచాటున నక్కారు, గదికి ఎదురుగా వున్న పూలకుండీని క్రిందికి నెట్టి ! ఆ శబ్దానికి నిద్రమెలుకువ వచ్చిన ఓ నౌకరు, ఆయాసం, ఉబ్బసం కారణంగా మెల్లిగా మెట్లెక్కి పూజామందిరం సమీపానికి వచ్చి చుట్టూ చూశాడు నిద్ర ముఖంతోనే ! ఎవరూ అగుపించకపోయేసరికి, "ఈ వెధవ పిల్లులకి వేళాపాళా లేదు ! బంగారం లాంటి నిద్రపాడు చేశాయి. హా... !" అని ఆవలించుకుంటూ క్రిందపడివున్న పూలకుండీని యథాస్థానంలో వుంచి తిన్నగా దగ్గుకుంటూ వెనక్కు వెళ్ళిపోయాడు.

'హమ్మయ్య' అంటూ ఊపిరి పీల్చుకున్నారు మిత్రులిద్దరు !

ఒకరివంక ఒకరు చూసుకుంటూ చిన్నగా నవ్వుకొన్నారు.

"ఎంత ప్రమాదం తప్పింది !" అనుకుంటూ తాము వచ్చిన దిశగా వడివడిగా అడుగులు వేశారు.

*　　　*　　　*

చల్లపల్లి వారి సంస్థానం !

ఆ సంస్థానాధీశుడు రాజా మల్లిఖార్జున ప్రసాద్ !

తన కోటలోని విశాలమైన హాలులో కూర్చొని తన దివాన్‌జీతో కలసి సంస్థాన వ్యవహారాలు చర్చిస్తుండగా, ఓ నౌకరు వచ్చి వినయంగా వంగి చెప్పాడు !

"రాజా వారు ! మీ కోసం బందరు నుంచి పోలీసులు వచ్చారు."

"నా కోసమా ! దేనికి ?"

"చెప్పలేదు దొరా ! మీ దర్శనార్థం వేచి వున్నారు."

"రమ్మని చెప్పు !"

నౌకరు వెళ్ళాక, ఓ నిముషం తర్వాత ఓ ఇన్‌స్పెక్టర్ ఆ హాలులోకి ప్రవేశించి రాజావారికి అభివాదం చేశాడు. ఆ అభివాదాన్ని స్వీకరించిన రాజా మల్లిఖార్జున ప్రసాద్, పోలీసు ఇన్‌స్పెక్టరును ఆశీనుడ్ని చేశాక అడిగాడు.

"ఏమిటిలా వచ్చారు ?"

"నిన్నటి రోజున బందరులో ఇద్దరు యువకులు ఓ వజ్రాల వ్యాపారి వద్ద విలువైన వజ్రాలను అమ్మజూపుతుండగా మా పోలీసులు పట్టుకొని ఠాణాకు తీసుకవచ్చి లాఠీలతో నాలుగు బాదేసరికి నిజం చెప్పారు."

"ఏమని ;" ఇన్‌స్పెక్టర్ వంక సూటిగా చూస్తూ అడిగాడు రాజా మల్లిఖార్జున ప్రసాద్!

"వీటిని రెండ్రోజుల క్రితం మీ కోటలోనుంచి దొంగలించారట. చూడండి !" అంటూ తన దగ్గర దాచుకున్న సంచిలోంచి మఖ్‌మల్ గుడ్డలో చుట్టబడిన వజ్రాలను తీసి చూపించాడు.

వాటిని అందుకుని గమనించిన రాజా మల్లిఖార్జున ప్రసాద్‌లో సంభ్రమాశ్చర్యాలు !

"ఇవిమావే ! మా కోటలోనుంచి దొంగలించే సాహసానికి పూనుకున్నారా ? ఎవరు వారు ? వాళ్ళను తప్పక శిక్షించవలసిందే ?" ఆవేశంగా పలికాడు.

"వారిని మా వెంట తీసుకొచ్చాము. వారెవరైంది మీరు గుర్తించండి ! ఏయ్ టూ నాట్ టూ, ఫోర్ నాట్ ఫోర్ ! యిద్దరిని లోపలికి తీసుకరండి !" తన క్రింది ఉద్యోగులైన కానిస్టేబుళ్ళను పిలిచాడు పోలీసు ఇన్‌స్పెక్టర్.

ఇద్దరు పోలీసుల వెంట, యిరువురు యువకులు చేతులకు సంకెళ్ళతో తన ఎదుటకు రావడం గమనించిన రాజా మల్లిఖార్జున ప్రసాద్ విస్మయం చెందాడు !

వారివంక క్షణంపాటు ఎగాదిగా చూసి చెప్పాడు. "ఇన్‌స్పెక్టర్ గారు ! వీరేదో కుర్రతనంతో నేరానికి పాల్పడినట్టున్నారు. వారిని క్షమించి వదిలివేయండి ! ఇది నా వ్యక్తిగత విన్నపము !" అంటూ అభ్యర్థించాడు చల్లపల్లి రాజా !

"అది కాదు రాజావారు ... !" ఏదో చెప్పబోతోన్న ఇన్‌స్పెక్టర్ మాటకు అడ్డు తగులుతూ చెప్పాడు మల్లిఖార్జున ప్రసాద్,

"అవసరం అయితే, ఈ విషయంలో మీపై అధికారితో కూడా మాట్లాడుతాను !"

"అబ్బే ! అంతవరకు ఎందుకులెండి ! మీ అంతటివారు చెప్పాక కాదనగలమా ! మీ కోరిక ప్రకారం వీరిని వొదిలేస్తాం. ఏయ్ కానిస్టేబుల్స్ ! వీరి చేతులకున్న సంకెళ్ళు తొలగించండి !"

సంకెళ్ళు తొలగించబడ్డాయి !

మిత్రులిద్దరూ రాజా వంక నివ్వెరపోతూ చూశారు, 'శిక్ష'కు బదులు 'రక్ష'ణ లభించినందుకు !

"ఇన్‌స్పెక్టర్ గారూ ! ఇక మీరెళ్ళోచ్చు ! మీరు చేసిన ఈ సహాయానికి కృతజ్ఞతలు !"

"అంత మాటెందుకులెండి రాజావారూ ! మా ఉద్యోగ ధర్మం చేశాం ! వస్తాం రాజావారు !" అంటూ మరోమారు అభివాదం చేసి అక్కడ్నించి బయటికి నడిచాడు ఇన్‌స్పెక్టర్ !

మిత్రులిద్దరు ఖిన్నులయి చేతులు జోడించి చెప్పారు.

"క్షమించండి రాజావారు !"

"తప్పుచేసి క్షమించమంటే ఎలా ?"

గద్దింపు స్వరంతో పలికాడు రాజా మల్లిఖార్జున ప్రసాద్.

మిత్రులిద్దరూ తలలు వంచుకొని నిల్చున్నారు మౌనంగా !

లక్ష్మీనారాయణ వంక సూటిగా చూస్తూ మళ్ళీ పలికాడు రాజా మల్లిఖార్జున ప్రసాద్.

"చదువుకొన్నావు. సిగ్గులేదూ ! అందులోనూ మాకు కావలసిన వాడవయి వుండి ఇలాంటి నీచానికి పాల్పడుతావా ? యార్లగడ్డ కరణంగా మీ నాన్నగారు ఎంతటి పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. మాకు ఎంత ఆత్మీయులుగా వుండేవారు ! అలాంటి వారి కడుపున పుట్టిన నీకు దొంగతనం చేయడానికి, అదీ మాకోటలో ... నీకు మనసెలా వచ్చింది ?"

"పరిస్థితులు ఒక్కోసారి ఎలాంటి పని అయినా చేయిస్తాయి రాజావారు !" అన్నాడు లక్ష్మీనారాయణ.

"పరిస్థితులా ! ఏమిటవి ? మీ కుటుంబం ఆర్థిక ఇబ్బందుల్లో వుందా ? వుంటే చెప్పు ! మీ నాన్న మాకు చేసిన సేవలకుగాను ఆదుకొంటాను." లక్ష్మీనారాయణ వంక సూటిగా చూస్తూ అన్నాడు మల్లిఖార్జున ప్రసాద్.

"క్షమించండి రాజావారు ! నా స్వార్థానికైతే మేమీలాంటి పనులు చేయం." సూటిగానే జవాబిచ్చాడు లక్ష్మీనారాయణ.

"అయితే చెప్పు ఎవరు చేయించారీ పని ?" ఉద్వేగంతో ప్రశ్నించాడు మల్లిఖార్జున ప్రసాద్ !

"ఉద్యమం కోసం. ఉద్యమ ప్రచారం కోసం. వందేమాతరం ఉద్యమం జీవించటం కోసం ! ప్రజల్లో ఉద్యమ ప్రచారం జరగాలంటే ఓ పత్రిక నేడు అత్యవసర సాధనం. అందుకు మూలధనం కావాలి ! చందాలతో జరిగేపని కాదని తెలుసుకున్నాం ! మూలధనం సమకూరేందుకు మరోమార్గం లేక ఈ సాహసానికొడిగట్టాం రాజావారు. మన్నించండి !" ప్రాధేయపడుతూ విన్నవించుకొన్నాడు లక్ష్మీనారాయణ.

లక్ష్మీనారాయణ మాటలు శూలాలై రాజా మల్లిఖార్జున ప్రసాద్ హృదయానికి సూటిగా కుచ్చుకున్నాయి. హృదయం విప్పారింది ! కళ్ళు తెరుచుకున్నాయి ! ఉద్యమమే ఊపిరిగా – అందుకోసం ప్రాణాలైనా అర్పణ చేసే వీళ్ళ సాహసం – తన తనువెల్ల పులకింపజేసింది. తత్ఫలితంగా కళ్ళు చెమ్మగిల్లాయి ! హృదయం నవనీతమైంది ! ఆయన పెదవులపై మందహాసం తొణికిసలాడింది ! ఆ ఆలోచనలతోనే.

"చూడండి ! మీ ఆశయం మంచిదే, కాని ఆచరణలోనే లోపం ! ఎప్పుడూ కూడా ఇలాంటి నేరాలకు పాల్పడకండి ! దానివల్ల మీరు నష్టపడటమే కాక ఉద్యమంపైదుష్ప్రచారం జరుగుతుంది ! మూలధనం చట్టబద్ధమైన మార్గాల్లో సంపాదించాలిగాని ఇలా వక్రమార్గాల ద్వారాకాదు. అయినా మీ ఆశయం వెనుక ఓ లక్ష్యముంది కాబట్టి మీ నేరాన్ని తొలి తప్పుగా భావించి మన్నిస్తున్నాను !"

రాజా మల్లిఖార్జున ప్రసాద్ మాటలకు మరోమారు ఖిన్నులై చూశారు యిరువురు !

"మీకు మూలధనం ఎంత కావాలి ?"

మిత్రులిద్దరూ నోట మాటలేక స్థాణువులా నిల్చుండిపోయారు ! ఆ తర్వాత నెమ్మదిగా చెప్పారు, "పదివేలు".

"దివాన్ జీ ! వీరికి పదివేలు ఇచ్చి పంపండి !" అనగానే దివాన్ జీతో పాటు, మిత్రులిద్దరూ కూడా మరోమారు నిశ్చేష్టులయ్యారు ! వారి నిశ్చేష్టతను గమనించిన రాజా మల్లిఖార్జున ప్రసాద్ చిర్నవ్వుతో వారి భుజాలపై తట్టి దివాన్ జీ వైపు చూస్తూ అన్నాడు !

"ఈ విషయం మన నలుగురిలోనే వుండాలి. బయటికి పొక్కరాదు. వెళ్ళి డబ్బివ్వండి !" అంటూ మొదటి అంతస్థులో వున్న గది వైపు అడుగులు వేశాడు.

'చిత్తం' అంటూ దివాన్ జీ, లక్ష్మీనారాయణని, శేషగిరి రావుని తన వెంట రమ్మని కనుసైగ చేశాడు !

# 7

"స్వరాజ్య" వారపత్రిక కార్యాలయం !

మూలధనాన్ని తాము సేకరించినా, ముద్రాపకుడిగా బోడి నారాయణరావును, క్రితం అనుకున్న ప్రకారం హరిసర్వోత్తమరావును 'ఎడిటర్'గా నిర్ణయించడం జరిగింది !

తాము పత్రిక నిర్వహణ బాధ్యతను మాత్రమే స్వీకరించారు సాహస మిత్రులయిన పింగళి లక్ష్మీనారాయణ, బొడ్డపాటి శేషగిరిరావులు.

మూలధనం సేకరించిన వైనాన్ని హరిసర్వోత్తమరావుకు తెలియకుండా జాగ్రత్త వహించారు. ముద్రణా వ్యవహారాలలో భాగస్వామిగా ఉద్యమ మిత్రుడయిన కాశీనాధుని వీరమల్లయ్యను కూడా చేర్చుకున్నారు.

పత్రిక తొలి సంచిక విడుదల సందర్భంగా, బందరునుంచి ముట్నూరి కృష్ణారావు గారిని, స్థానికుడు సహ మిత్రుడు అయిన అయ్యదేవర కాళేశ్వరరావుగారిని ముఖ్యవక్తలుగా ఆహ్వానించారు.

సమావేశాన్ని ఆర్భాటంగా కాక, తమ కార్యాలయంలోనే ఏర్పాటు చేశారు. ముట్నూరి కృష్ణారావు, పత్రిక తీరును అందులో స్వదేశీ ఉద్యమం (వందేమాతరంగా ప్రభవించిన జాతియోద్యమం క్రమేణా దేశీయ ఉద్యమంగా మారింది) గురించి చక్కటి వ్యాసాలు, వాటి ఆవశ్యకత, ప్రత్యేకించి హరిసర్వోత్తమరావుగారి సంపాదకీయం జనావళిని స్వాతంత్ర్య కాంక్షను రేపేదిగా వుండటం గమనించి ప్రత్యేకంగా ప్రసంశిస్తూ చెప్పాడు.

"ఉద్యమ మిత్రుల సహకారంతో, అభ్యుదయ భావాలతో, దేశ స్వాతంత్ర్య కాంక్షతో ఏర్పడ్డ ఈ పత్రిక చిరకాలం మన్నాలని మనసారా కోరుకుంటున్నాను. ఇందలి వ్యాసాలు, శీర్షికలు, ముద్రణ తీరు చాలా ఆకర్షణీయంగా వున్నాయి. హరిసర్వోత్తమరావు ఆధ్వర్యంలో సర్వాంగ సుందరంగా రూపుదిద్దుకొన్న ఈ పత్రిక దినదిన ప్రవర్ధమానమై ప్రజల విశ్వాసం తప్పక చూరగొంటుందనే దృఢ విశ్వాసం నాకుంది. ఈ సందర్భంగా ఓ ముఖ్య విషయం మనవి చేసుకొంటున్నాను. ఆంగ్ల సాహిత్య ప్రభావంతో మనవారు తెలుగు పత్రికలను ప్రారంభించినా, 'ఎడిటర్', 'ఎడిటోరియల్' అన్న పదాలకు తెలుగున సరియైన పదాలు లభించక పోవడం వల్ల ఇంతకాలం 'ఎడిటర్', 'ఎడిటోరియల్' అన్న పదాలే వ్యవహరించటం జరుగుతోంది. హరిసర్వోత్తమరావు తన మేధా శక్తితో 'సంపాదకుడు', 'సంపాదకీయం' అన్న పదాల్ని తొలిసారిగా తెలుగులో ఉపయోగించి పత్రికారంగానికి గొప్ప మేలు చేశాడు. ఈ పదాలే ఇక భావితరం వారికి మార్గదర్శకంగా వుంటాయని భావిస్తున్నాను. ఈ సృష్టికర్తను మరొకసారి అభినందించి శెలవు తీసుకొంటున్నాను !"

అయ్యదేవర కాళేశ్వరరావు మాట్లాడుతూ, "నన్ను ముఖ్యంగా ఈ పత్రికకు వ్యాసాలు వ్రాయమని కోరారు మిత్రులు ! ప్రజలను జాగృతపరచడానికి ఇంత చక్కని అవకాశం ఈ పత్రిక ద్వారా నాకు లభించటం నా పురాకృత పుణ్య ఫలితంగా భావిస్తున్నాను ! హరిసర్వోత్తమరావుగారి ఆధ్వర్యంలో ఈ పత్రిక మూడు పువ్వులు ఆరు కాయలై విరాజిల్లాలని, పత్రిక స్థాపనకు అవిరళ కృషి సల్పిన మిత్రులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెల్పుకొంటు శెలవు తీసుకొంటున్నాను !" అంటూ ముగించారు !

సమావేశం ముగిసింది !

మర్నాటి ఉదయం పత్రిక జనావళి మధ్యకు వెళ్ళింది ! అంత నిర్భయంగా జాతీయ భావాలను దేశాభిమానాన్ని ప్రేరేపించిన పత్రికను చూసిన ప్రజానీకం సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యింది !

*　　　　*　　　　*

రోజులు గడుస్తున్నాయి !

'స్వరాజ్య' పత్రిక అశేష పాఠకలోకాన్ని ఆకర్షిస్తూ వుంది ! ముఖ్యంగా హరిసర్వోత్తమరావుగారి సంపాదకీయాలు జనాన్ని వుద్రూతలూగించి, ఉద్యమంలో తమ వంతు పాత్ర కోసం వువ్విళ్ళూరేట్లు చేశాయి ! దేశాభిమానం నానాటికి ప్రజల్లో పెంపొందసాగింది.

"ప్రభుత్వమునకు సామ మార్గాన ఎన్ని విన్నపములు పంపుకొన్ననూ లాభం లేదు. సూటిగా ప్రభుత్వమును ధిక్కరించుటకు ముందు, సత్యమును, సంస్థాపన చేయు నూతనోద్యమమునకు 'స్వరాజ్య' పత్రిక పునరంకితమైంది ! ఆంగ్లేయ ప్రభుత్వం పరిపాలనలో ప్రజలకు ఎలాంటి ద్రోహం ఎట్లు జరుగుచున్నదో వివరించి ప్రజల, స్వాతంత్ర్య సమరానికి నడుముకట్టడానికి ఆయత్తం చేయడమే 'స్వరాజ్య' ఏకైక ఆశయం !" అంటూ హరిసర్వోత్తమరావు సమర శంఖారావం పూరించాడు.

తెల్లవాళ్ళ దుశ్చర్యలను విమర్శించుటకు తీవ్రాతి తీవ్రమైన పదజాలములను వుపయోగించి ప్రజాలను దేశభక్తిపూరితులను చేయసాగాడు.

తత్ఫలితంగా –

యువకులు క్రమేణా స్వతంత్ర భావాలను అలవరచుకొని ఉద్యమంవైపు మొగ్గసాగారు!

ఓ రోజు ...

'స్వరాజ్య' పత్రిక కార్యాలయంలో తనకు కేటాయించిన ఆఫీసు గదిలో 'స్వదేశీ పరిశ్రమల స్థాపనల ఆవశ్యకత' పై సంపాదకీయం వ్రాసుకొంటున్న హరిసర్వోత్తమరావు గదిలోకి తన పత్రికలో పనిచేసే ఓ కంపోజిటర్ వచ్చి చెప్పాడు.

"మీ కోసం ఎవరో వచ్చారు సార్"

"సంపాదకీయం వ్రాస్తున్నాను. కాసేపు వుండి రమ్మని చెప్పు !" అంటూ తిరిగి సంపాదకీయం వ్రాయడంలో నిమగ్నమయ్యాడు.

సంపాదకీయం వ్రాస్తున్నపుడు అన్యులెవర్ని తన గదిలోకి రానివ్వడు హరిసర్వోత్తమరావు. చివరికి లక్ష్మీనారాయణ అయినా, శేషగిరిరావు అయినా ! సంపాదకీయం వ్రాయడం పూర్తయ్యాకే వారికి ప్రవేశం !

హరిసర్వోత్తమరావు మనస్థత్వం తెలుసు కాబట్టి మిత్రులెవరూ ఆ సమయంలో అతని నిశ్చలతకు భంగం కలుగనీయరు, ఎంత అవసరమున్నా సరే !

'సంపాదకీయం' పూర్తయ్యేసరికి అరగంటకు పైగానే పట్టింది ! వ్రాసిన సంపాదకీయాన్ని ఓ మారు సరిచూసుకున్నాక, అక్కడక్కడ మార్పులు చేశాక గుర్తొచ్చింది ! తన కోసం ఎవరో వచ్చారన్న విషయం !

గదిలోంచి బయటికి వచ్చిచూశాడు.

గది బయట ఓ స్టూల్ పై తన కోసమే కూర్చొని వున్న తన మిత్రుడు, ఎం.ఏ. లో సహపాఠి అయిన శ్యాంజీ రామారావును చూడగానే హరిసర్వోత్తమరావులో ఆనందం వుప్పొంగింది !

"మిత్రమా రామారావు ఎన్నాళ్ళకు నీ దర్శనం ! ఎలా వున్నావు ?" ఆప్యాయంగా పలుకరించాడు హరిసర్వోత్తమరావు.

"అరగంట ఎదురు చూసేలా చేసి మరి ఎన్నాళ్ళకా దర్శనం అని అడుగుతున్నావా సర్వోత్తమా !" చలోక్తి విసిరాడు శ్యాంజీ రామారావు !

"క్షమించు మిత్రమా అది నా వృత్తి ధర్మం ! ఈ సంపాదకీయం ఇవ్వాళ అచ్చవ్వాలి. ఒక్క నిముషంలో వస్తాను !" అంటూ పక్కగదిలో వున్న కంపోజిట్ సెక్షన్‌లోనికి వెళ్ళి వ్యాసాన్ని ముద్రాపకుడిగా వ్యవహరిస్తున్న బొడి నారాయణరావు కిచ్చి చెప్పాడు.

"రేపటికి ప్రింటింగ్ వర్క్ మొత్తం పూర్తవుతుందికదూ !"

"ఆ ... " అంటూనే సంపాదకీయం అందుకున్నాడు బొడి నారాయణరావు, కంపోజ్ చేసిన ఫారాలను సరిచూస్తూ.

"నాకోసం ఓ మిత్రుడొచ్చాడు. నాతో పాటు అతన్ని ఇంటికి తీసుకెళ్ళాల్సిన అవసరం వుంది ! మళ్ళీ సాయంకాలం వస్తాను. ఆ లోపు సంపాదకీయం కంపోజ్ చేయించి ప్రూఫ్ తీయించి వుంచు. వస్తాను మిత్రమా !"

"ఆ ..."అన్న సమాధానమే మళ్ళీ ఇచ్చాడు బొడి నారాయణరావు.

ఎదురుగా వున్నది మిత్రుడయినా, సంపాదకుడైనా 'పని' ముఖ్యం అన్న సిద్ధాంతం బొడి నారాయణరావుది ! ఆ విషయం హరిసర్వోత్తమరావుకు తెలుసు కాబట్టి వెంటనే బయటికి వచ్చి,

"పద మిత్రమా ! ఇంటికెళ్ళి మాట్లాడుకుందాం !" అంటూ రామారావు భుజంపై చేయి వేసి ముందుకు నడిచాడు హరిసర్వోత్తమరావు.

భోజనాలయ్యాక అసలు విషయం చెప్పుకొచ్చాడు శ్యాంజీ రామారావు !

"మిత్రమా ! స్వదేశీ ఉద్యమం విస్తరిస్తోన్న ఈ తరుణంలో మన దేశంలో స్వదేశీ పరిశ్రమల స్థాపన ఎంతయినా అవసరం అన్న విషయం నీకు తెలియంది కాదు. నాకు స్వదేశీ పరిశ్రమ స్థాపించాలని అభిలాషగా వుంది. అందుకు నీ వంతు సహకారం కావాలి !"

"తప్పక నా వంతు సహకారం అందిస్తాను. చెప్పు మిత్రమా ఏం చేయాలి ?" నవ్వుతూ అడిగాడు హరిసర్వోత్తమరావు.

"మన దేశంలో స్వదేశీ పరిశ్రమలు స్థాపించాలంటే ఆ పరిశ్రమ పట్ల సాంకేతిక పరమైన, వాణిజ్యపరమైన, నిర్మాణాత్మకపరమైన విద్య అవసరం. డబ్బున్నవారు విదేశాలకు వెళ్ళి తమకు కావలసిన విద్యను అభ్యసించి వస్తున్నారు. నాకున్నూ విదేశాలకు వెళ్ళి పరిశ్రమలకు సంబంధించిన విద్య అభ్యసించాలని కోరిక వుంది. కాని – అక్కడికి వెళ్ళాలంటే ఖర్చుతో

కూడుకొన్న పని ! ఆ ఖర్చు భరించేంతటి ఆర్థిక స్తోమత నాకు లేదు. కాబట్టి ... నీవే ... ఇందుకు సహకరించాలి !"

"ఇంతకూ ఏ పరిశ్రమకు సంబంధించిన విద్యను అభ్యసించాలనుకొంటున్నావు. అందుకుగాను ఏ దేశానికి వెళ్ళాలనుకొంటున్నావు ?" ప్రోత్సాహంగా ప్రశ్నించాడు హరిసర్వోత్తమరావు.

"సబ్బు బిళ్ళల తయారీ పరిశ్రమ విద్యను అభ్యసించాలనుకొంటున్నాను. అందుకుగాను జపాన్ వెళ్ళాలని వుంది !"

"ఖర్చెంత వరకు రావచ్చు ?"

"సుమారు అయిదారువేలు !"

"అయిదారు వేల రూపాయలు సమకూరాలంటే కొంత గడువు కావాలి ! అంతవరకు నీవు నా ఇంట్లోనే వుండాలి."

"మిత్రమా ! ఈ సహాయం జీవితాంతం మరువలేను !" చెమర్చిన కళ్ళతో, గాద్గద స్వరంతో కృతజ్ఞతా పూర్వకంగా పలికాడు రామారావు.

"చాలా దూరం నుంచి ప్రయాణం చేసి వచ్చావు. నువ్వెళ్ళి విశ్రాంతి తీసుకో ! మళ్ళీ రాత్రి మాట్లాడుకుందాం !"

అంటూ అతని విశ్రాంతికి తగిన ఏర్పాట్లు చేసి తన గదిలోకి వెళ్ళి, భార్యను పిలిచి "రాముడూ ! నేనలా బయటికి వెళ్తున్నాను. అట్నుంచి పత్రికా ఆఫీసుకెళ్తాను. వచ్చేసరికి ఆలస్యం కావచ్చు ! రామారావుకు ఏ లోటు రానీయకు !" అంటూ వెళ్ళబోతున్న భర్తను ఉద్దేశించి అంది రామాబాయి !

"ఇందాకే భోంచేశారు ! కాసేపు విశ్రాంతి తీసుకుని వెళ్ళరాదు !"

"విశ్రాంతి !" అంటూ చిన్నగా నవ్వుతూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

"దేశ వ్యాప్తంగా అవిశ్రాంతంగా స్వరాజ్యం కొరకు శ్రమిస్తూ వుంటే విశ్రాంతి అంటావేమిటి రాముడూ ! స్వరాజ్యం సిద్ధించాకే మనకు విశ్రాంతి !" అనేసి ఇల్లు దాటిన హరిసర్వోత్తమరావు నడుస్తూ వున్నాడన్న మాటేగాని, అయిదారు వేలు ఎలా పోగుచేసి ఇవ్వాలి అన్న ఆలోచనే అతని మస్తిష్కంలో మెదులుతూ వుంది. తానైతే సరస్వతీ పుత్రుడయ్యాడే కాని, లక్ష్మీ పుత్రుడు కాలేకపోయాడు. అయివుంటే ఇలాంటి వారికి జాగు చేయక సహాయ పడుండేవాడు.

ఆలోచనలతో కూడిన ఆ నడక నేరుగా అయ్యదేవర కాళేశ్వరరావు ఇంటి వరకు సాగింది !

# 8

కాకినాడ .... 1907 మే 13 తారీకు !

పోలీసు ఠాణా చుట్టు గుమికూడిన జనం !

"వందేమాతరం ! వందేమాతరం ! ... వర్ధిల్లాలి ! వైద్యాధికారి కెంపూ డౌన్ ... డౌన్ ..." అన్న నినాదాలతో ఆ ప్రాంతమంతా హోరెత్తిపోయింది ! ఆ హోరుకు కారణం ?

కోపల్లె కృష్ణారావు అనే విద్యార్థి 'వందేమాతరం' 'వందేమాతరం' అంటూ విద్యార్థులను గుంపుగా వెంటేసుకొని కాకినాడలోని వీధులన్నీ తిరుగుతూ, మధ్యలో తనకు తారసపడిన కెంప్ అనే జిల్లా వైద్య శాఖాధికారిని చూచి మరింత గట్టిగా అరచాడు, 'వందేమాతరం వర్ధిల్లాలి' అంటూ !

ఆ నినాదం విన్న ఆ అధికారి, నిలువెల్ల ఆవేశంతో వూగిపోతూ చేతిలో వున్న కొరడాతో కృష్ణారావుని చావబాదాడు.

ఈ సంఘటన విద్యార్థుల్లోనూ, పురజనుల్లోనూ అలజడిని, ఆవేశాన్ని రేపింది !

"మా కళ్ళముందే ఇంత ఘోరానికి తలపెడుతావా ?" అంటూ కెంప్ వెంట పడ్డారు జనం.

వంటిపై రెండు గట్టి దెబ్బలు తగిలేసరికి కెంప్‌కు ప్రాణభయం పుట్టుకొచ్చింది. పరుగున "ఆఫీసర్స్ క్లబ్" లోకి పరుగుతీశాడు. సమయానికి అక్కడ తనను ఆదుకోవడానికి ఎవ్వరూ లేకపోయేసరికి ఏం చేయాలో దిక్కుతోచలేదు కెంప్‌కు ! ఆ లోపే 'క్లబ్' ను చుట్టుముట్టిన జనం అందులోని కుర్చీలను, మేజాలను ధ్వంసం చేశారు. ఈ దాడి వార్త విన్నంతనే జిల్లా కలెక్టర్ జె.ఏ. కుమ్మింగ్ (J.A. Cumming) పోలీసుల బలగంతో వచ్చి ఆ గుంపును చెదరగొట్టే ప్రయత్నం చేశాడు.

రెచ్చిపోయిన జనం కుమ్మింగ్ వెంటబడి గాయపరచారు. జనం కుమ్మింగ్ వెంటబడినప్పుడు కెంప్, ఇదే అదనుగా భావించి పరుగు పరుగున కొద్ది దూరంలో వున్న పోలీసు ఠాణాలోకి వెళ్ళి 'పరిస్థితి' చెప్పి ఠాణా తలుపులు మూయించాడు. కిటికీల ద్వారా 'ఠాణా' దగ్గరకు వస్తున్న జనసందోహాన్ని చూసి పోలీసువారు కూడా భయపడ్డారు. ఆ భయంవల్లే కెంప్ వంక చిరాగ్గా చూస్తూ అన్నారు.

"వారి మానాన వారు నినాదాలు చేసుకుంటూ వుంటే మీరెందుకు కలుగ జేసుకున్నారు? కలుగజేసుకున్నది చాలక, ఆ కుర్రాడ్ని అలా ఎందుకు చావబాదారు ?" అంటూ ప్రశ్నించారు.

"ఏదో ఆవేశం కమ్ముకొచ్చి కొట్టాను ! ఇప్పుడు మీరే నన్ను ఎలాగో ఒకలాగు రక్షించాలి. లేకపోతే వారు నన్ను ప్రాణాలతో బ్రతకనివ్వరు ! ప్లీజ్ సేవ్ మై లైఫ్ !"

ప్రాణ భయంతో రెండు చేతులు జోడించి వేడుకొన్నాడు కెంప్ !

"జిల్లా కలెక్టర్‌కే దిక్కులేదు ! ఎలా ? తలుపు తెరిస్తే చాలు, మిమ్మల్నే కాదు, అడ్డొస్తే మమ్మల్ని కూడా చావబాదుతారు !"

పోగయిన జనాన్ని చూసి పోలీసువారి కళ్ళలో కూడా ప్రాణభీతి కదలాడింది ! ఆ భీతిని గమనించిన కెంప్‌లో కొద్దిపాటి కోపం ? ఆ కోపంతోనే చెప్పాడు.

"వెంటనే వారిని పిట్టల్ని కాల్చేసినట్లు కాల్చేయండి !"

కెంప్ తలతిక్క సమాధానం అక్కడున్న ఇన్‌స్పెక్టర్‌కు కూడా కోపం తెప్పించింది.

ఇంతలో ఠాణా చుట్టు గుమిగూడిన జనం గట్టిగా అరచారు "మర్యాదగా ఆ కెంపు గాడ్ని బయటికి ఈడ్చుండి ! లేదంటే ఠాణాను ధ్వంసం చేస్తాం !"

ఆ అరుపులకు ఠాణాలోని పోలీసుల గుండె 'ఠా' రెత్తింది !

ఏం చేయాలో దిక్కు తోచలేదు ?

"మాకెలాంటి పరిస్థితి దాపురించేలా చేశావు కదరా !"

అన్నట్టుగా కొరకొర చూపులతో కెంప్ వంక చుశారు పోలీసులు !

ఇంకెంత మాత్రం ఆలస్యం చేసినా ప్రజానీకం అన్నంతపని చేస్తారు, అని భయపడ్డ పోలీసు ఇన్‌స్పెక్టర్ ఒక నిర్ణయానికి వచ్చాడు !

'తుపాకులతో జనాన్ని చెదరగొట్టే దానికన్నా శాంతిమార్గాన్నే అవలంభించడం ఎంతో ఉత్తమం' అని అనుకుంటూ లేని ధైర్యం కూడగట్టుకొని కానిస్టేబుళ్ళ వంక చూస్తూ చెప్పాడు.

"నేను బయటకి వెళ్ళగానే తలుపు వేసెయ్యండి. మళ్ళీనే చెప్పేదాక తెరవకండి !"

'అలాగే' అంటూ తలలూపారు పోలీసులు !

ధైర్యం తెచ్చుకొన్న ఇన్‌స్పెక్టర్ తలుపువారగా తెరిచి బయటకు రాగానే, చప్పున తలుపు బిగదీశారు లోపల వున్న పోలీసులు !

ఠాణాలోంచి బయటికి వచ్చిన ఇన్‌స్పెక్టర్ రెండు చేతులు ఎత్తి "శాంతించండి ! నే చెప్పేది వినండి !" అంటూ గట్టిగా అరిచాడు.

ఇన్‌స్పెక్టర్ పలుకుల్ని ఏ మాత్రం లెక్కచేయక ముందుకు దూసుకపోతున్న విద్యార్థి బృందాన్ని, ప్రజానీకంలోని కొంతమంది పెద్దలు "ముందు అతను చెప్పేది విందాం ! మీరు శాంతించండి !" అంటూ వారిని వారించి ఇన్‌స్పెక్టర్‌తో చెప్పారు.

"చెప్పండి ! మీరేం చెప్పదలచుకొన్నారు ?"

ఇన్‌స్పెక్టర్ చెప్పడం ప్రారంభించాడు.

"ప్రజలారా ! డా. కెంప్ చేసింది క్షమించరాని నేరం ! కాబట్టి అతనిపై చట్టపరంగా చర్య తీసుకుంటాం ! అని హామీ ఇస్తున్నాను. మీరు శాంతించండి ! అతన్ని కోర్టుకు హాజరుపరుస్తాం ! అంతవరకు ఎలాంటి దౌర్జన్యానికి దిగకండి !"

అతని మాటల్లో నిజాయితీ వుందనిపించి విద్యార్థుల్ని ఆపిన పెద్దలు,

"సరే ! అదీ చూద్దాం ! వాడిని కోర్టుకు హాజరుపరచక పోతే, మీ భరతం పట్టి తీరుతాం !" అంటూ విద్యార్థుల వంక చూస్తూ,

"విద్యార్థులారా ! మనకు అవకాశం ఇమ్మని కోరుతున్నాడు ఇన్‌స్పెక్టర్ ! అలాగే ఇద్దాం ! కోర్టులో మనకు న్యాయం జరక్కపోతే, అప్పుడు మళ్ళీ ఆందోళన చేద్దాం ! గాయపడిన కృష్ణారావుకు వైద్యసహాయం చేద్దాం పదండి" అంటూ విద్యార్థుల ఆవేశానికి అడ్డుకట్ట వేస్తూ అక్కడి నుంచి అందరిని కదిలించారు.

'హమ్మయ్య' అంటూ తేలిగ్గా నిట్టూర్చాడు ఇన్‌స్పెక్టర్.

"ఓ గాడ్ ! యూ హ్యావ్ సేవ్‌డ్ మీ" అంటూ వూపిరి పీల్చుకున్నాడు కెంప్ !

"నిన్ను రక్షించింది ఆ దేవుడు కాదు ! ఈ వూరి పెద్దలు. వారే గనక అడ్డుపడక పోయివుంటే, ఈ పాటికి నిజంగానే ఆ 'గాడ్'నే చేరుకొని వుండేవారు !" అంటూ కెంప్ వైపు చీత్కారంగా చూస్తూ అన్నాడో కానిస్టేబుల్ !

జనం వెళ్ళిపోయాక ఠాణా లోపలికి వచ్చిన ఇన్‌స్పెక్టర్ కెంప్‌ను చూస్తూ "రేపు మిమ్మల్ని కోర్టుకు హాజరుపరుస్తాం. ప్లీజ్ బీ రెడీ !" అన్నాడు.

కోర్టు విచారణ అనగానే కెంపూలో ప్రాణ భయంపోయి ఏదో తెలియని పిరికితనం ఆవహించింది !

"కోర్టుదాకా కాకుండా ఇక్కడే పరిష్కరించే ప్రయత్నం చేసివుండరాదా ?"

"ఇక్కడే పరిష్కరించడం అంటే – మీ చావు ఒక్కటే పరిష్కార మార్గమయ్యేది. నో ... ఉయ్ ఆర్ హెల్ప్ లెస్ ! సారీ సర్ ! రేపు కోర్టుకు తీసుక వెళ్ళేదాక మీరు ఇక్కడే వుండక తప్పదు. మీ ప్రాణాలకు కూడా సేఫ్ !" అంటూ బయటికి వెళ్ళిపోయిన ఇన్‌స్పెక్టర్ వంక గుడ్లప్పగించి అలాగే చూస్తుండిపోయాడు కెంప్ !

ఈ సంఘటన ఆంధ్ర రాజకీయాలలో జరిగిన తొలి క్రిమినల్ కేసుగా నమోదయ్యింది!

* * *

'తీవ్ర ప్రయత్న ఫలితంగా ....

అయ్యదేవర కాళేశ్వరరావు, 'స్వరాజ్య' పత్రిక మిత్రుల సహకారంతో చందాల రూపంలో పోగయిన రెండువేల రూపాయలను రామారావు చేతికందిస్తూ చెప్పాడు హరిసర్వోత్తమరావు.

"నా పరిధి మేర ఈ రెండువేలు మాత్రమే పోగు చేయగలిగాను. మిగిలిన డబ్బుకుగాను నీకు ఉత్తరం వ్రాసిస్తాను. తీసుకెళ్ళి మద్రాసులో వున్న మునగాల రాజావారిని కలువు ! నీకు తప్పక సహాయం చేస్తారు" - అంటూ ఉత్తరం వ్రాసి రామారావు చేతి కందించాడు హరిసర్వోత్తమరావు.

ఉత్తరాన్ని అందుకున్న రామారావు ఎలా కృతజ్ఞతలు తెల్పుకోవాలో తెలియక, చటుక్కున హరిసర్వోత్తమరావు పాదాలను తాకబోయాడు. ఆ ప్రయత్నాన్ని వారిస్తూ, "ఏమిటి మిత్రమా ఇది ! నా సహపాఠిగా నీకీ మాత్రం సహాయం చేయటం నా ధర్మం ! నువ్వు సబ్బు బిళ్ళల తయారీ పరిశ్రమకు సంబంధించిన విద్యను నేర్చుకొని, దిగ్విజయంగా తిరిగిరావాలని ఓ స్నేహితుడిగా హృదయపూర్వకంగా కోరుకొంటున్నాను" అంటూ మద్రాసులోని 'హిందు' దినపత్రికకు వ్రాసిన వ్యాసానికిగానూ ఆవేళేవచ్చిన పది రూపాయలను రామారావు జేబులో వుంచుతూ -

"ఇవి ప్రయాణపు చార్జీలకు వుంచుకో ! నా పరంగా ఇంతకంటే ఎక్కువ ఆర్థిక చేయూతను అందించలేని పరిస్థితి నాది !"

హరిసర్వోత్తమరావు మాటలు రామారావు కళ్ళవెంట నీళ్ళు వచ్చేలా చేశాయి !

"మిత్రమా ఏమిటిది చిన్న పిల్లాడిలా !" చిన్నగా నవ్వుతూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

"ఇది కన్నీరు కాదు మిత్రమా ! ఆనంద బాష్పాలు !

హిమాలయం ఎత్తంత ఎదిగిన నీ వ్యక్తిత్వాన్ని చూసి పొంగారిన ఆనంద బాష్పాలు !"

"పొగడ్తలు మనిషి నైతిక పతనానికి తొలిమెట్టు ! అందుకే అవంటే నాకు గిట్టవు ! నీవూ జీవించు ! ఇతరులను జీవించేలా చెయ్ అన్న సూత్రం నాది ! అయినా మిత్రమా ఇప్పుడివన్నీ ఎందుకుగాని, నువ్వెంత తొందరగా మద్రాసు వెళితే అంత మంచిది. ఆ రాజావారు ఇంటిపట్టునే వుండే మనిషి కాదాయే ! ... పద ... స్టేషన్ వరకు వచ్చి వీడ్కోలు చెబుతాను." - అంటూ భార్యను పిలిచాడు హరిసర్వోత్తమరావు.

"రాముడూ !"

"ఆ c ... వస్తున్నా !" అంటూ వచ్చిన రామాబాయి భర్త వంక ఏమిటన్నట్టు ప్రశ్నార్థకంగా చూసింది. ?

"రామారావు మద్రాసు పయనమయ్యాడు. అలా స్టేషన్ వరకు వెళ్ళివస్తాను !"

"వదినమ్మా ! నేనిక్కడ వున్నన్ని రోజులు నన్నెంతో ఆదరంగా చూశావు. నీ రుణం నేనెలా తీర్చుకోగలను !" కండ్ల వెంట నీళ్ళు రాగా రెండు చేతులు జోడించి నమస్కరించాడు.

రామాబాయి హృదయం ఆర్ద్రమైంది !

"నా రుణం తీర్చుకుంటాననంటున్నావు. అందుకు మార్గం చెప్పనా !" అంది రామాబాయి.

"చెప్పు వదినమ్మ ! నా జన్మసార్ధకం చేసుకుంటాను !" అంటూ రామాబాయమ్మ వంక ఆదుర్దాగా చూశాడు శ్యాంజీ రామారావు.

రామాబాయమ్మ చెప్పుకొచ్చింది !

"నువ్వు సబ్బుల పరిశ్రమ పెట్టినపుడు తొలి సబ్బు కొనుగోలుకు గాను మరవకుండా తప్పక పిలవాలి !"

ఆ మాట రామారావు హృదయ పుటంచులను తాకింది. ఎంత నిస్వార్ధ హృదయం ! రామాబాయమ్మది అనుకుంటూ అన్నాడు.

"అన్నకు తగిన ఓదినవమ్మా ... మీ ఇద్దరి చేతుల మీదుగనే పరిశ్రమ స్థాపనకు పునాది రాయివేస్తాను !"

"చాలు ! ఈ ఒక్క మాటే చాలు ! అదే మాకు కొండంత తృప్తి, ఆనందం !"

"వస్తా వదినమ్మా !"

"క్షేమంగా వెళ్ళి లాభంగా తిరిగి రా నాయినా !"

"పద ! రామారావు" అంటూ అతని బెడ్డింగ్‌ను తానే అందుకొన్నాడు హరిసర్వోత్తమరావు.

"నా బెడ్డింగ్ నీవు మోయడమా ?" మిత్రుని వంక నిశ్చేష్టుడై చూస్తూ అన్నాడు రామారావు.

"నాకలాంటి నా మోషీలు లేవు పద ! బండికి వేళవుతుంది !" అంటూ మిత్రుని భుజంపై చేయి వేసి ముందుకు నడక సాగించాడు హరిసర్వోత్తమరావు.

* * *

రోజులు గడుస్తూవున్నాయి !

ఓ నాడు పత్రికా కార్యాలయం నుంచి ఇంటికి చేరిన హరిసర్వోత్తమరావుతో అంది రామాబాయి.

"ఏమండీ !"

"ఏమిటి రాముడూ !" వాలు కుర్చీలో వాలిపోయి అన్నాడు హరిసర్వోత్తమరావు.

"మీకెలా చెప్పాలో తెలియడంలేదు ...!"

"ఎలా చెప్పాలో తెలీకపోతే ... పోని కాగితంపై వ్రాసివ్వు !" – చమత్కారంగా నవ్వుతూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

"అది కాదండీ ! నేను ... నేను ..." అంటూ చెప్పబోతూ ఆగిపోయింది. ఆమె మోములో సిగ్గుదొంతరలు !

ఏదో చాలా ముఖ్యమైన విశేషముందని గ్రహించిన హరిసర్వోత్తమరావు భార్య వంక కొంటెగా చూస్తూ పలికాడు.

"మరీ నీకంతగా సిగ్గయితే కళ్ళు మూసుకుంటానులే ! వచ్చి చెవులో చెప్పు !"

కళ్ళు మూసుకున్నాడు హరిసర్వోత్తమరావు. రామాబాయి సిగ్గు మొగ్గలవుతూ భర్తకు దగ్గరగా చేరి చెవిలో చెప్పింది.

"మీరు తండ్రి కాబోతున్నారు !"

ఆమె సమాధానం విన్న హరిసర్వోత్తమరావులో ఉవ్వెత్తుగా ఎగిసిన ఆనందం !

"నిజమా ! అన్నట్టుగా భార్య కళ్ళలోకి చిలిపిగా తొంగిచూశాడు. "నిజమే !" అన్నట్టుగా తలూపి అంది.

"మీరు ఆఫీసుకు వెళ్ళాక, వొంట్లో వికారంగా వుంటే పక్కింటి తాయారమ్మ గారి సహాయంతో డాక్టరు గారి దగ్గరకు వెళ్ళాను. డాక్టరమ్మ పరీక్షించి చెప్పింది !"

"ఎంత చక్కని వార్త నాచెవిని వేశావు రాముడూ ... కానీ ..." అర్థాంతరంగా ఆగిపోయాడు హరిసర్వోత్తమరావు.

"ఏమయ్యిందండీ ?" కంగారుగా అడిగింది రామాబాయి.

"ఏమీ కాలేదు రాముడూ ! ఈ శుభవార్త చెప్పగానే, అర్ధాంగికి ఏదో ఒక బహుమానం ఇవ్వడం భర్త బాధ్యత ! కానీ నేను ... నీకు ఏ బహుమానం ఇవ్వలేని అశక్త సాధారణ గృహస్తుని ! చేతిలో చిల్లి గవ్వలేని ఉత్త మనిషిని !" అని అంటున్నపుడు, అతని గుండె గూడు పట్లు ఎక్కడో కదిలినవి !

ఆయన కళ్ళు అశ్రునయనాలయినవి !!

భర్త ఆర్ద్రతను అర్థం చేసుకొన్న రామాబాయి, "ఎందుకండీ బాధ ? నాకెందుకండీ బహుమానాలు ! అయినా ఇంత చక్కని బహుమానాన్ని ఇచ్చారుగా ! మాటల్లో చెప్పలేని ఆనందం ! మాతృమూర్తిగా నా జన్మ తరించింది."

"ఎంత ఉదాత్త హృదయం రాముడూ నీది !" భార్యను హృదయానికి హత్తుకొని అన్నాడు హరిసర్వోత్తమరావు.

భర్త ఒడిలో వాలిన రామాబాయి, తలపై కెత్తి "నాకున్న ఒకే కోరిక – అది తీర్చరూ !" అంది.

"నీ కోరిక కాదన గలనా రాముడూ !"

"ఆ ఒక్కమాట చాలండీ ! ఈ జీవితానికి. నా కోరికల్లా నేను సుమంగళిగా నీ ఒడిలో కన్నుమూయాలని !"

"రాముడూ !" అంటూ భార్యను మరింత గాఢంగా హృదయానికి హత్తుకొన్నాడు హరిసర్వోత్తమరావు.

* * *

మరి కొన్నాళ్ళు గడిచాయి .... రామాబాయికి అయిదో నెల !

తమ వూరికి తీసుకెళ్ళి 'సీమంతం' జరపాలని వచ్చిన తన మామగారి వెంట రామాబాయిని సాదరంగా రైలెక్కించి పంపాడు హరిసర్వోత్తమరావు. తన అర్థాంగిని 'సీమంతం' పేర తీసుకెళ్ళడం రావుగారికి కొద్దిపాటి వూరట కలిగించింది. కారణం ? తను పగలనక రేయనక, ఉద్యమంలో పాలు పంచుకోవడం వల్ల ఆమె బాగోగులు పట్టించుకోవడం సాధ్యంకాదు. కాబట్టి, అక్కడయినా ఆమె గురించి తగిన శ్రద్ధ తీసుకుంటారని !

భార్యను పంపిన రోజు హరిసర్వోత్తమరావు తన డైరీలో ఇలా వ్రాసుకున్నాడు.

"నేను పెళ్ళి చేసుకొని ఓ జీవిని మానసికంగా హింసిస్తున్నానేమో !"

ఆమె నా భావాలకు, ఆశయాలకు అణుగుణంగా నడుచుకున్నా, భర్తగా నేను ఆమె పట్ల నెరవేర్చవలసిన బాధ్యతల్ని నిర్వర్తించలేకపోతున్నానేమో !!

నాలో ఏదో తెలియని అసంతృప్తి !!!

ఈ అసంతృప్తి బహుశా జీవితాంతం ఉంటుందేమో !!!! ఊహిస్తే భవిష్యత్తంతా గజిబిజి ????

నా ధ్యేయం ఎన్నటికి మారదు !!!!

రామాబాయి నా ధ్యేయానికి తట్టుకుంటుందా !?!!!!

* * *

కాకినాడ పోలీసు ఠాణా ఇన్‌స్పెక్టర్ అన్న మాట ప్రకారం డా॥ కెంప్‌ను కోర్టు మెట్లెక్కించినా, స్వజాతి ప్రభుత్వపు ఆంక్షలకు తల ఒగ్గిన న్యాయాధికారి, కృష్ణారావును, కొట్టినందుకు మూడువందల రూపాయల జరిమానా విధించి పొమ్మన్నాడు. డా॥ కెంప్‌ను కొట్టబోతూ క్లబ్‌లోని 'ఫర్నీచర్'ను ధ్వంసం చేసినందుకుగాను ఇరవై మందిపై కేసులు బనాయించిందీ ప్రభుత్వం. వారిలో అరిపెరాల లక్ష్మీనరసింహారావు, చిన పేరయ్య, బారు వెంకట నారాయణ ముఖ్యులు!

న్యాపతి సుబ్బారావు వాదనతో, కొంతమంది బయటపడ్డా మరికొంతమందికి శిక్షలు పడక తప్పలేదు  ఇది వారి ద్వంద్వ నీతికి ప్రతీక !

హరిసర్వోత్తమరావు ఈ కేసు పూర్వాపరాలను మొత్తం తమ పత్రిక మొదటి పేజీలో ప్రచురిస్తూ, బ్రిటిష్ ప్రభుత్వం ద్వంద్వ ప్రవృత్తిని దుయ్యబడుతూ ఘాటుగా సంపాదకీయం వ్రాశాడు !

ఆ సంపాదకీయం ఆంగ్ల ప్రభుత్వం పట్ల నిరసన తెలిపేలా చేసింది !

తత్ఫలితం ?

'స్వరాజ్య' వారపత్రికపై ఓ కన్నేసి అదను కోసం కాచుకొని కూర్చొంది బ్రిటిష్ ప్రభుత్వం!

రోజులు గడుస్తూ వున్నాయి ......

హరిసర్వోత్తమరావు పత్రికా సంపాదకుడి బాధ్యతలను నిర్వహిస్తూనే వందేమాతరం, స్వదేశీ ఉద్యమ ప్రచారానికి వెళ్ళడమేకాక, బందర్లో డాక్టర్ పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, కోపల్లె హనుమంతరావు, కొండా వెంకటప్పయ్యగార్లు అకుంఠిత దీక్షతో ఏర్పాటు చేసిన జాతీయ కళాశాలలకు తాను కూడా సెనేట్ సభ్యుడిగా ఎన్నుకోబడినందున దాని స్థాపనకు గాను, వారితో పాటు కలసి విరాళాల నిమిత్తం వూరూరు తిరగడం ప్రారంభించాడు. ఇదేకాలంలో సర్వోత్తమరావు సహకారంతో ఏలూరు, గుడివాడ, నరసాపూరు, మైదుకూరు, కడప, ఒంగోలు ప్రాంతాల్లో కూడా జాతీయ పాఠశాలలు ప్రారంభింపబడ్డాయి.

ఈనేపథ్యంలో 1907 సంవత్సరం పూర్తిగా గడిచిపోయింది !

1908 సంవత్సరం మొదలయ్యింది ! గడిచిన సంవత్సరం కంటే ఈ సంవత్సరం తన జీవితాన్ని మరో మలుపు తిప్పబోతుందని హరిసర్వోత్తమరావు కలలో కూడా ఊహించలేదు !

# 9

1908.

భారతదేశంలో బ్రిటిష్ వారి పాలన మొదలయ్యాక దక్షిణ భారతదేశంలోని నౌక, వాణిజ్య వ్యాపారాలన్నీ ఆంగ్లేయుల గుత్తాధిపత్యంలోకి వచ్చి చేరాయి.

స్వదేశీ ఉద్యమానికి ప్రభావితుడైన వి.ఒ. చిదంబరం పిళ్ళై అనే తమిళ వ్యాపారి ఆంగ్లేయుల గుత్తాధిపత్యాన్ని ధిక్కరిస్తూ, తన సంపదనంత వెచ్చించి తమిళ దేశానికి, ఆంధ్రదేశానికి వారధిగా అనేక నౌకలను కొని తూత్తుకుడిలో 'స్వదేశీస్టీమ్ షిప్ నావిగేషన్' కంపెనీని స్థాపించి వ్యాపారం చేయడం ప్రారంభించాడు. తత్ఫలితంగా తమిళ సముద్ర తీరప్రాంతంలోనూ, ఆంధ్రదేశంలోని దక్షిణ కోస్తాతీరంలోనూ, ఆంగ్లేయుల గుత్తాధిపత్యం తగ్గి దేశీయుల ఆధిపత్యం ఎక్కువయ్యేసరికి ఇంగ్లీషు వారి వ్యాపార లావాదేవీలన్నీ ఆగిపోయాయి !

అంతకు ముందు బ్రిటిష్ స్టీమ్ నావిగేషన్' కంపెనీ వారి స్టీమర్లు మాత్రమే వుండేవి ! ఛార్జీలు ఎక్కువ ! దానికి తోడు మన ప్రయాణీకులకు అసౌకర్యాలే కాక అవమానాలు కూడా జరుగుతుండేవి ! ఈ బాధలను సహించలేక దేశభక్తుడు చిదంబరం పిళ్ళై చేసిన సాహసం ఆంగ్లేయులకు కన్నెర్ర అయింది. తమ మనుగడకే ముప్పు వాటిల్లుతుందని గ్రహించి పిళ్ళైపై రాజకీయాందోళన నేరాన్ని మోపి, యావజ్జీవ కారాగార శిక్ష విధించి జైలుకు పంపారు ! దీనికంతకు మూలకారకుడు అప్పటి కాకినాడ కలెక్టర్ ఏష్ ! చిదంబరం పిళ్ళైను జైలుకు పంపడమే కాక, దేశీయుల హస్తగతమైన నౌకా వాణిజ్యాన్ని తిరిగి, తన స్వదేశీయులకు అప్పగించాడు.

ఫలితం ?

ఇటు కాకినాడ తదితర ప్రాంతాలలోనూ, అటు తమిళ దేశంలోనూ అలజడి, ఆందోళన చెలరేగింది !

అలాంటి సమయంలోనే 'ఏష్'కు తిరుచనవేళి (తిరునల్వేలి) జిల్లాకు బదిలీ అయ్యింది. ఆ బదిలీయే తన పాలిటి మృత్యుముఖంగా భావించలేకపోయాడు కలెక్టర్ ఏష్ !

* * *

ఆ రోజు 1908 జూలై 15వ తారీఖు !

'కూ' ......' అంటూ చెన్నపట్నం నుంచి బయల్దేరిన రైలు 'తిరుచనవేళి' వైపు వేగంగా పరుగులు తీస్తోంది !

ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో ప్రయాణం చేస్తున్న 'ఏష్' లండన్ నుంచి దిగుమతి అయిన ఖరీదైన విస్కీని సేవిస్తూ కిటికీ గుండా రైలు వెంట పరుగులు తీస్తున్నట్టుగా వున్న కొండా కోనను చూస్తూ ఆహ్లాదాన్ని అనుభవిస్తున్నాడు !

అదే సమయంలో ......

'ఏష్'ను మట్టుబెట్టాలని పిళ్ళై పట్ల సానుభూతి పరుడైన నీలకంఠబ్రహ్మచారి, అతనికి తోడుగా మరొక మిత్రుడు, థర్డ్‌క్లాస్ కంపార్ట్‌మెంట్ నుంచి కిటికీ చువ్వల ఆధారంగా ఒక్కొ పెట్టె దాటుకుంటూ వచ్చి 'ఏష్' వుంటున్న పెట్టెను చేరుకున్నారు. వారు ఎడమవైపు నుంచి పాక్కుంటూ రావటం వల్ల కుడివైపు కిటికీ పక్కన కూర్చొని వున్న ఏష్ వీరి రాకను గమనించలేకపోయాడు ! గమనించివుంటే, అతని కోటులో వున్న పిస్టల్ గుళ్ళకు ముందుగా వారే బలి అయ్యేవారు. అతని దృష్టి వారిపై లేదు. కాబట్టి, వారు క్షణ మాత్రం కూడా ఆలస్యం చేయక మూసి వున్న తలుపును విసురుగా తోసి లోపలికి ప్రవేశించారు !

హఠాత్తుగా తనముందు ఇద్దరు యువకులు ప్రత్యక్షమయ్యే సరికి, ఖంగుతిన్న ఏష్, 'హూ ఆర్ యూ !' కోపంతో గొంతు చించుకొని అరుస్తూ, తన కోటు లోపల వున్న పిస్టల్‌ను

బయటికి తీయబోయాడు. కానీ, అప్పటికే ఆ యిద్దరు యువకులు తన కణతలకు పిస్టల్ మొనలను గుచ్చి భీత్కారంగా చూస్తూ చెప్పారు.

"రేయ్ ! తెల్లకుక్కా !! దైవం లాంటి మా పిళ్ళైను జైలుకు పంపుతావట్రా ? నిన్నిప్పుడే యమలోకానికి పంపుతాం ! నీ కన్న వాళ్ళను తల్చుకో !"

తమిళంలో ఆ యువకులు అన్నది అర్థం కాకపోయినా చేతల్ని బట్టి తనకు చావు తప్పదని నిర్ణయించుకున్న ఏష్ వారిని దీనంగా బ్రతిమలాడుతూ అన్నాడు.

"ప్లీజ్ డోంట్ కిల్ మీ ! కావాలంటే ఈ సూట్ కేసులో వున్న డబ్బంతా తీసుకోండి ! నన్నొదిలి వేయండి ప్లీజ్"

"నిన్నా ! నిన్నొదిలితే ఇంకెంతో మంది అమాయకులను జైలుకు పంపుతావు ? అసలు మా గురించి మీరేమనుకుంటున్నార్రా ? మీరేం చేసినా, చూస్తూ సహిస్తూ వుండటానికి మేము పిరికి పందలం కామురా ? పౌరుషమున్న వాళ్ళం ! రేయ్ నిన్నే కాదు ! మీరు ఈ సీమ వదిలి వెళ్ళేవరకు ప్రతి భారతీయుడు మిమ్మల్ని ఏరి ఏరి మట్టు పెడతార్రా కుక్కా !"

ప్రాణ భయంలో కూడా నక్కలాంటి ఆలోచనలు వున్న ఏష్ గబాల్న ముందుకు వాలి తన కోటు జేబులోని పిస్టల్‌ను తీసి కాల్చే ప్రయత్నం చేశాడు. కాని అతని కన్న ఎక్కువ తెలివితేటలున్న ఆ యువకులిద్దరూ, ఒకే మారు ట్రిగర్ నొక్కారు !

అంతే

ఒకేమారు డజను తూటాలు అతని గుండెను, ఉదారాన్ని చీలుస్తూ అవతలికి దూసుకెళ్ళాయి. ముందుకు వంగిన ఏష్ అలాగే బోర్లపడి పోయాడు. అతడు ప్రాణాలొదులుతూ అరిచిన అరుపుతో, ఆ పెట్టె ప్రకంపించిపోయింది !

ఆ యువకులిద్దరిలో ఉబ్బుబికిన ఆనందం !

నిర్జీవుడైన ఏష్ రక్తంతోనే, అతని దుస్తులపై 'వందేమాతరం' అంటూ వ్రాసి – పరుగులు తీస్తున్న రైలులో నుంచే క్రిందికి దుమికారు !

*　　　*　　　*

'ఏష్ ధారుణ హత్య'తో బ్రిటిష్ ప్రభుత్వం ఉన్మాదిలా చలించిపోయింది !

విచక్షణను మరిచింది !

ఏష్ హత్య గురించి పలు ప్రాంతాల్లో జనం గుంపుగా కూడి చర్చించుకొంటున్న సందర్భంలో .... లాఠీలను ఝళిపించింది ! తుపాకుల మ్రోత మోగించింది బ్రిటిష్ ప్రభుత్వం.

పర్యవసానం ?

తమిళదేశంలో ముగ్గురు వ్యక్తులు పోలీసుల తూటాలకు బలి అయ్యారు.

అదే సమయంలో ......

స్వదేశీ ఉద్యమ ప్రచార నిమిత్తం భీమవరం చేరుకొన్న హరిసర్వోత్తమరావు ప్రచారం అయ్యాక, ఓ ఉద్యమకారుడుపై సంఘటన గురించి చెప్పగానే అతనిలో ఆగ్రహం కట్టలు తెంచుకొంది !

"అరే ఫిరంగీ ! క్రూర వ్యాఘ్రమా ! నిష్కారణముగా నీవు ముగ్గురు హిందువులను ఒక్కసారిగా పొట్టన పెట్టుకొంటివి గదా ! నీవు నీతి చట్టములను కూడా అతిక్రమించుచున్నావు. ఓ భయభ్రాంతుడా ! పొగరుబోతు తనమున యిట్టి కన్నులుగానని వానికి సహజ లక్షణమైన యిట్టి వ్యతిరేకాభిప్రాయములను కలిగి, నీవు నీ రహస్యములను బయటపెట్టుకొంటివి. హిందూ జాతీయాభివృద్ధితో మీ విదేశ పరిపాలనా విధానమంత మొందగలదని - నీవే రుజువు చేసి చెప్పుకొన్నావు."

ఇలా ఆవేశపూరితంగా సాగిన తన సంపాదకీయాన్ని, ఓ ఉద్యమకారుని చేతి కిచ్చి చెప్పాడు హరిసర్వోత్తమరావు.

"వెంటనే బెజవాడకు వెళ్ళి, దీనిని అయ్యదేవర కాళేశ్వరరావు కివ్వు !"

హరిసర్వోత్తమరావు ఆజ్ఞానుసారం బెజవాడ చేరుకున్న ఉద్యమమిత్రుడు నేరుగా అయ్యదేవర కాళేశ్వరరావును కలిసి చెప్పాడు.

"భీమవరం నుంచి హరిసర్వోత్తమరావుగారు, ఈసంపాదకీయాన్ని పంపించారు !"

- అంటూ ఓ కవరులో వుంచిన సంపాదకీయ వ్యాసాన్ని అయ్యదేవర కాళేశ్వరరావుకు అందించాడు.

ఆ సంపాదకీయాన్ని అందుకొన్న అయ్యదేవర కాళేశ్వరరావు, "హరిసర్వోత్తమరావు పంపగానే శ్రమ తీసుకుని, ఇంతదూరం వచ్చినందుకు చాలా సంతోషం !"

- అంటూ అతనికి కాఫీ తాగించి తిరుగు ప్రయాణానికి గాను ఛార్జీ ఇచ్చి పంపాక, కవరు తెరిచి చదవటం ప్రారంభించాడు.

చదవటం పూర్తయ్యాక, కాళేశ్వరరావు స్తబ్ధుడయ్యాడు ! శరీరమంతా ముచ్చెమటలు పట్టాయి.

'ఇంత ఉద్రేకపూరితమైన వ్యాసం ప్రచురిస్తే ఇంకేమైనా వుందా !' అని మనసులో అనుకొంటూ మరొక్కసారి ఆ సంపాదకీయాన్ని జాగ్రత్తగా పరిశీలించి రాజద్రోహం క్రిందికి వచ్చు తీవ్రమైన మాటలను తీసివేసి, ముద్రాపకుడైన బోడి నారాయణరావుకు పంపాడు !

సంపాదకీయాన్ని అందుకున్న బోడి నారాయణరావు చదవటం మొదలుపెట్టాడు. కాళేశ్వరరావు కొట్టివేతల క్రింది అసలు పదజాలాలను చదివిన బోడి నారాయణరావులో ఆవేశం!

వెంటనే ఓ కంపోజిటర్‌ను పిలిచి చెప్పాడు. "కొట్టివేతలను తీసివేసి అసలు సంపాదకీయాన్నే కంపోజ్ చేసి అర్జంటుగా పట్రా ! ఈ సంచికలోనే ప్రచురించాలి !"

అతను కోరిన ప్రకారమే, ఓ గంటకే కంపోజ్ అయి వచ్చిందా సంపాదకీయం !

జాగ్రత్తగా ప్రూఫ్ దిద్దిన బోడి నారాయణరావు ఆ కంపోజిటర్ వంక చూస్తూ,

"ఇందులో ఒక అక్షరం కూడా పొల్లుపోకుండా అచ్చువ్వాలి, తెలిసిందా ?" అంటూ చెప్పాడు.

రెండ్రోజులు గడిచాయి !

పత్రిక జనంలోకి వెళ్ళింది. ఆ రోజు 26-3-1908 !

హరిసర్వోత్తమరావు 'సంపాదకీయం' చదివిన పాఠక జనం 'ఎంత ధైర్యం !' ఎన్ని గుండెలుంటే ఇలా వ్రాయాలి ? దీని పరిణామం ఎలా వుంటుందో ? అని లోలోపల భయపడ్డారు.

వారు తలచినట్లే జరిగింది !

తమను ఆ తీరును విమర్శిస్తూ వ్రాసేసరికి, సరియైన అదను కోసం కాచుకొని వున్న బ్రిటిష్ ప్రభుత్వం ఇదే 'మంచి తరుణం' అనుకొని తిడుతూ సంపాదకీయం వ్రాసినందుకు హరిసర్వోత్తమరావుపై, దానిని ముద్రించిన నేరానికి బోడి నారాయణరావుపై రాజద్రోహ నేరాన్ని మోపింది !

ఇరువురిపై అరెస్టు వారెంట్‌లు జారీ అయ్యాయి !

*                    *                    *

బందరులో ......

స్వదేశీ ఉద్యమ ప్రచారంలో భాగంగా భీమవరం నుంచి బందరు చేరుకొన్న హరిసర్వోత్తమరావు ఓ సమావేశంలో తన ప్రసంగం పూర్తి చేసి తిరిగి వేదికపైన కుర్చీలో ఆసీనుడవుతుండగా ......

జనంలో ...... కలకలం ! ......

ఓ పోలీస్ ఇన్‌స్పెక్టర్ ...... కొంతమంది కానిస్టేబుళ్ళు జనాన్ని లాఠీలతో చెల్లా చెదురు చేస్తూ, జనం మధ్యలో నుంచి వేదికవైపుకి దూసుకొచ్చారు !

హరిసర్వోత్తమరావు చుట్టూ పోలీసులు కమ్ముకున్నారు. "హరిసర్వోత్తమరావు గారూ ! మిమ్మల్ని రాజద్రోహ నేరం క్రింద అరెస్టు చేస్తున్నాము. సీ ది వారెంట్ !"

– అంటూ విషయం చెప్పుకొచ్చాడు ఇన్‌స్పెక్టర్ !

తన్ను కమ్ముకున్న పోలీసుల వంక, ఇన్‌స్పెక్టర్ వంక చూస్తూ చిన్నగా నవ్వుతూ చెప్పాడు.

"నన్ను అరెస్ట్ చేయడానికి జనాల్లో ఇంత భీతావహము పుట్టించనవసరములేదు. పదండి !" అంటూ ఆగి ... "ఒక్క నిముషం ఇన్‌స్పెక్టర్ !" అంటూ తన అరెస్ట్‌తో చెల్లా చెదురవుతొన్న జనాన్ని ఉద్దేశించి చెప్పాడు హరిసర్వోత్తమరావు.

"ప్రజలారా ! మీరెంత మాత్రం భయపడకండి ! ఇలాంటి అరెస్టులు మన ఉద్యమాన్ని అణగార్చలేవు ! ...... ఒక విషయం గుర్తుంచుకోండి ! మనమిప్పుడు త్యాగం చేయడానికి సిద్ధపడితేగాని, రేపటితరం స్వేచ్ఛా వాయువులు పీల్చుకోలేదు. వందేమాతరం !"

జనాల్లో ఆవేశం !

చెల్లా చెదురైన జనం మళ్ళీ ఒక్కటయింది !

వారు కూడా ఒక్క పెట్టున 'వందేమాతరం, మందే రాజ్యం' అంటూ నినాదాలు ఇచ్చారు.

ఇదే రోజున మహారాష్ట్రలో కూడా రాజద్రోహ నేరం క్రింద అతివాది బాల గంగాధర తిలక్‌ను అరెస్టు చేశారు !

జిల్లా కోర్టు భవనంపై బాంబులు వేసి భయభ్రాంతులు సృష్టించిన ఖాదీరామ్ బోస్ అనే పద్దెనిమిది ఏళ్ళ యువకుడ్ని పట్టుకొని బ్రిటిష్ ప్రభుత్వం ఉరి తీసినందుకు నిరసనగా ప్రభుత్వాన్ని దుయ్యబడుతూ తన 'కేసరి' పత్రికలో ఘాటుగా సంపాదకీయం వ్రాసినందుకు !

ఆరోజు ......

1908, జూలై 18 తారీఖు !

ఆంధ్రలో, మహారాష్ట్రలో సంపాదకీయాలు వ్రాసి రాజద్రోహం నేరం క్రింద అరెస్టయిన తొలి వ్యక్తులు వీరే !

* * *

బెజవాడ సబ్ జైలు !

బందరు నుండి భారీ బందోబస్తు మధ్య బెజవాడకు తెచ్చిన హరిసర్వోత్తమరావును నేరుగా సబ్‌జైలుకు తీసుకెళ్ళారు ! అక్కడ తనకంటే ముందే అరెస్టు కాబడి తన రాక కోసమే ఎదురు చూస్తోన్న బోడి నారాయణరావును చూస్తూ చిర్నవ్వుతో అడిగాడు హరిసర్వోత్తమరావు "నా సంపాదకీయం, నిన్ను కూడా ఇక్కడికి చేర్చింది కదూ !"

బోడి నారాయణరావు కూడా చిరునగవుతోనే సమాధానమిచ్చాడు.

"సంపాదకుడు, ప్రచురణకర్త భార్యాభర్తల్లాంటివారు ! భర్త ఎక్కడుంటే భార్య కూడా అక్కడే ! తమ రెక్కడుంటే నేనూ అక్కడే !"

"మన పింగళి లక్ష్మీనారాయణ, శేషగిరిరావు కనుమరుగయ్యారు !"

"మన అరెస్టు తర్వాత వారిని కూడా అరెస్టు చేసే ప్రయత్నాలు సాగాయి. కాని ఈ విషయం ముందుగానే పసిగట్టిన లక్ష్మీ, శేషగిరి పారిపోయారు."

బోడి నారాయణరావు సమాధానం విన్న హరిసర్వోత్తమరావు మనసులో ఒకింత బాధ! ఆ బాధతోనే చెప్పాడు.

"లక్ష్మీనారాయణ లాంటి సాహసి ఇలా చేయడం తగదు ! పారిపోవడం వల్ల ప్రయోజనం లేదని నా నమ్మకం ! ప్రజల దృష్టిలో, ప్రభుత్వం దృష్టిలో వారు పిరికివారు అన్న భావన ఏర్పడుతుంది ! పోరాటాలు సాగించేటప్పుడు అన్నింటికి తెగించే వుండాలి ! అరెస్టుకు, జైళ్ళకు ఏ మాత్రం జంకకూడదు. అప్పుడే మనం ఆశయసాధకులమవుతాం !"

"మీరు చెప్పింది నిజమే ! ఒక్కోమారు ఎంత సాహసి అయినా, భయం పిరికి పందను చేస్తుంది.

వీరిద్దరి మాటలు ఇలా సాగుతుండగా, కాళేశ్వరరావు సబ్ జైలు అధికారి అనుమతితో వారి చెంత కొచ్చాడు. అతని వెంట మరొక వ్యక్తి కూడా వున్నాడు. ఆ వ్యక్తిని, హరిసర్వోత్తమరావుకు, బోడి నారాయణరావు గార్లకు పరిచయం చేస్తూ చెప్పాడు.

"వీరి పేరు చింతకింద సూర్యనారాయణమూర్తి గారు, మీ కేసును తీసుకుని మీ పక్షాన వాదించడానికి వచ్చారు. మీ తరఫున వాదించమని బెజవాడలోని ప్రముఖ న్యాయవాదులందర్నీ అభ్యర్థించాను. కానీ ఒక్కరూ ముందుకు రాలేదు. ఏమీ పాలు పోని పరిస్థితిలో, వీరే స్వయంగా నా చెంత కొచ్చి మీ తరఫున వాదించుతానని తన నిర్ణయాన్ని చెప్పగానే, చాలా సంతోషించాను. వెంటనే నా వెంట తీసుకొచ్చాను."

చింతకింద సూర్యనారాయణమూర్తి వంక ఇద్దరు కృతజ్ఞతా పూర్వకంగా చూస్తూ చెప్పారు.

"మీ నిర్ణయానికి కృతజ్ఞతలు చెప్పుకొంటున్నాం !"

ప్రజా సేవకే అంకితమైన మీ తరుపున కేసును వాదించే అవకాశం నాకు లభించటం నా అదృష్టం ! ... ఈ కాగితాలపై మీరు సంతకాలు చేయండి !"

– అంటూ వకాల్తా తాలూకు కాగితాలపై వారిరువురి సంతకాలు తీసుకున్నాడు.

"మిమ్ములను బెయిల్‌పై విడిపించే ప్రయత్నం చేస్తాను." అంటూ ఇంకేదో చెప్పబోతుండగా సబ్ జైలు సెంట్రీ వచ్చి చెప్పాడు.

"జైలు వార్డెన్‌గారు మిమ్మల్నిక వెళ్ళమన్నారు."

"వస్తాను మిత్రమా !" అయ్యదేవర కాళేశ్వరరావు పలుకుల్లో బాధ ! "వస్తానండీ !" చింతకింద సూర్యనారాయణమూర్తి కళ్ళలో ఆనందం ! దానికి కారణం ? సర్వోత్తమరావు, నారాయణరావు లాంటి గొప్ప వ్యక్తుల కేసు వాదించబోతున్నందుకు !

వారిరువురు వెళ్ళిపోయాక, హరిసర్వోత్తమరావును, బోడి నారాయణరావును వూచల మధ్యకు నెట్టాడు సెంట్రీ !

*　　　　　*　　　　　*

'రాజద్రోహం' నేరం క్రింద తన భర్త అరెస్ట్ చేయబడ్డాడన్న వార్త వినగానే రామాబాయికి స్పృహతప్పింది.

వీణాబాయిలో, ఆమె భర్తలో కలవరపాటు ! ఆందోళన !! "మన అమ్మాయికి ఎంత కష్టమొచ్చి పడిందండీ !" అంటూ వీణాబాయి భర్తను పట్టుకొని బావురుమంది !

భార్యను ఓదారుస్తూ, "నువ్వే ఇలా బెంబేలు పడితే ఎలా ? అమ్మాయి పరిస్థితి చూడు ! నేనిప్పుడే బండి కట్టించుకొస్తాను. ఈ వేళ రాత్రి బండికే మనందరం బెజవాడ వెళ్దాం ! ... లే ... లేచి అమ్మాయిని కనిపెట్టుకొని వుండు !"

– అంటూ పరుగులాంటి నడకతో వెళ్తోన్న భర్త వంక చూస్తూ ఉప్పెనలా ఎగిసివస్తోన్న దుఃఖం ఆపుకొంటూ, స్పృహలోంచి ఇప్పుడిప్పుడే తేరుకొంటున్న కూతుర్ని అక్కున చేర్చుకుని, "రామా ... అమ్మా రామా ... !" అంటూ పక్కనే వున్న మంచి నీళ్ళ చెంబులోని నీళ్ళను కూతురి ముఖంపై చిలుకరించి, ముఖాన్ని తన చీర కొంగుతో తుడిచింది. పూర్తిగా స్పృహలోకి వచ్చిన రామాబాయి, గాద్గద స్వరంతో నిలువెల్లా కంపించిపోతూ అంది !

"నేను వెంటనే వారిని చూడాలి !"

"వెళ్దామమ్మా .. వెళ్దాం !... మీ నాన్నగారు బండి కట్టించుకొని రావడానికి వెళ్ళారు !"

అరగంట గడిచాక, ఎద్దుల బండి ఇంటి ముందు ఆగింది ! "వీణా త్వరగా తయారవు. బండి వచ్చింది !" అంటూ బయటి నుంచే భార్యనుద్దేశించి కేకేస్తూ లోపలికి వచ్చాడు వీణాబాయి భర్త కేశవరావు.

అందరిలోనూ నిస్తేజమైన కదలిక !

ఇంటికి తాళం వేయబడింది !

బండి ముందుకు కదిలింది !

రామాబాయి భర్త అరెస్టు కాబడ్డాడు అన్న వార్త తెలిసిన 'పెరికలపెంట' గ్రామ ప్రజలందరూ గుమికూడి, ముందుకు కదిలిపోతోన్న ఎద్దులబండి వంక జాలిగా చూస్తూ, "పాపం ! ఎంత కష్టమొచ్చిపడింది ! అయినా ఆ తెల్లదొరలతో పొట్లాట పెట్టుకొని మన గలిగే మొనగాడెవడే ? ఇప్పుడు చూడు రామాబాయికి ఎంత కష్టం వచ్చి పడిందో ! పైగా ఉట్టి మనిషి కానాయె ! అట్లాంటోడు అసలు పెళ్ళెందుకు చేసుకున్నట్టూ ?" ఓ వృద్ధురాలి వ్యాఖ్యలకు చుట్టూ చేరిన జనంలోని కొంతమంది తలాడించారు. వారిలోనే కొంతమంది చదువుకున్న యువకులు ఆ

వృద్ధురాలి వంక చూస్తూ, "అదిగాదే అవ్వా ! వారల్లుడి గురించి నీకేం తెలుసు ? తెల్లదొరలతో పోట్లాట పెట్టుకోకుంటే మన బతుకులింతే ! మొన్ననే నీ కొడుకుపై దొంగతనం కేసు పెట్టి పోలీసులు చితకబాదింది అప్పుడే మర్చిపోయావా ? బో చెప్పొచ్చావులే ! ఎళ్ళెళ్ళు ......" అన్నారు.

"ఏందిరా మీరు కూసేది ? కుఱ్ఱ సన్నాసుల్లారా ! మీకేం తెలుసులా సంసారంలో బాధలు. ఇప్పుడా అమ్మాయి గతేం కాను ?"

"అవ్వతో మీకేంట్రా తగాదా ! పదండి. పదండి !" అంటూ గుంపుగా చేరిన జనం ఒక్కొక్కరూ తమ తమ ఇళ్ళవేపు నడక సాగించారు.

* * *

తన భార్య, కూతురుతో బెజవాడ చేరుకొన్నాడు కేశవరావు. కేసు విచారణ కొన్ని నెలలు జరిగిన తర్వాత, హరిసర్వోత్తమరావుని, అతని మిత్రుని సెషన్స్ కోర్టులో విచారణ నిమిత్తం తిరిగి బందరు పంపారు. బెజవాడ నుండి మళ్ళీ బందరుకు ప్రయాణం కట్టాడు కేశవరావు భార్యతో, కూతురుతో !

# 10

బందరులోని సెషన్స్ కోర్టులో హరిసర్వోత్తమరావు, బోడి నారాయణరావులపై విచారణ ప్రారంభమైంది !

కేసు విచారణ న్యాయాధికారి కెర్పాస్ప్. భారతీయుడే ! పార్సీ మతానికి చెందినవాడు. ప్రభుత్వం తరఫున పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా చెన్నపట్నం నుంచి కళ్ళి నారాయణరావు, హరిసర్వోత్తమరావు, బోడి నారాయణరావుల తరఫున జె.డి. శ్యామూల్, రామాచార్యులు వాదనకు ఉపక్రమించారు.

విచారణ రోజు ......

బందరులోని పౌరులందరూ సెషన్స్ కోర్టు చుట్టు మూగారు ! వాదన మొదలయ్యింది.

విచారణ నిమిత్తం మొదట హరిసర్వోత్తమరావు కోర్టు బోనులోకి వచ్చి నిలబడగానే, కోర్టు పద్ధతి ప్రకారం ప్రమాణం చేయించారు. ఆ తర్వాత ప్రభుత్వపు న్యాయవాది కళ్ళి నారాయణరావు అతని వంక సూటిగా చూస్తూ ప్రశ్నించాడు.

"నీ పేరు ?"

"చదువుకొన్న వారు, పైగా ప్రభుత్వం తరుపున పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా పని చేస్తున్నవారు. భోనులో నిలబడ్డ ముద్దాయిని 'నీవు' అని ఏకవచనంతో సంభోదించడం సభ్యతకాదు ......"

కోర్టులో ముద్దాయితో అవమానం పొందటం ఇంతవరకు ఎన్నడూ జరుగలేదు. కోపంతో శరీరం ఉడికినా నిగ్రహించుకొనక తప్పలేదు పి.పి. కళ్ళి నారాయణరావుకు !

వాదన వినడానికి వచ్చిన జనంలోంచి నవ్వులు !

న్యాయాధిపతి "ఆర్డర్ ... ఆర్డర్ ..." అంటూ అరిచాడు !

కేశవరావు, అతని భార్య, కూతురు మాత్రం మౌనంగా చూస్తుండిపోయారు !

"ప్రభుత్వాన్ని ఘాటుగా విమర్శిస్తూ, సంపాదకీయాలు వ్రాసి, రాజద్రోహ నేరం చేసిన వారిని 'మీరు' అని గౌరవించాల్సిన పనిలేదు."

"ఐ అబ్‌జెక్ట్ యువర్ హానర్ !" డిఫెన్స్ లాయర్ జె.డి. శామ్యూల్ తను కూర్చున్న స్థానంలోంచి లేచి అన్నాడు.

"యస్. యూకెన్ ప్రొసీడ్ !" న్యాయమూర్తి ఉత్తర్వు !

"నేరం రుజువు కాకమునుపే ఒక ముద్దాయిని, అలా సంభోదించడం పి.పి.గారు కోర్టు నియమాలను ఉల్లంఘించినట్లవుతుంది."

న్యాయమూర్తి స్థానంలో వున్న కెర్షాస్ప్ "నారాయణరావుగారూ ! డిఫెన్స్ లాయరు వాదనలో నిజముంది. కాబట్టీ 'మీరు' గానే వారిని సంభోదిస్తూ విచారణ ప్రారంభించండి !"

కెర్షాస్ప్ మాటలకు కుపితుడైనా, అది సమయం కాదు కాబట్టి కోపాన్ని అణుచుకుంటూ తిరిగి విచారణ ప్రారంభించాడు పి.పి. కళ్ళి నారాయణరావు.

"మీ పేరు ?"

"గాడిచెర్ల హరిసర్వోత్తమరావు."

"ఎంతవరకు చదువుకున్నారు ?"

"ఎం.ఏ. ..."

"టీచర్స్ ట్రైనింగ్ కూడా చేశారనుకుంటాను !" కావాలనే అడిగాడు పి.పి.

"అవును"

"ఎక్కడ చదివారు ?"

"రాజమహేంద్రవరం"

"శిక్షణ పూర్తి చేశారా ?"

"లేదు !"

"కారణం ?"

"వందేమాతరం ఉద్యమంలో పాల్గొనడం వల్ల !"

"విద్యార్థిగా వుంటూ ఉద్యమాల్లో పాల్గొంటే భవిష్యత్తు ఏమవుతుందన్న ఆలోచన కలుగ లేదా ?"

"నా భవిష్యత్తు కన్న దేశభవిష్యత్తు నాకు ముఖ్యం!"

"ఫలితంగా కాలేజీ నుండి డిస్మిస్ చేయబడ్డారు. అవునా ?"

"అవును !"

"ప్రభుత్వం మిమ్మల్ని ఏ ఉద్యోగానికి కూడా అర్హులు కాకుండా చేశారు. నిజమా ?"

"నిజమే !"

"మై లార్డ్ ! నోట్ దిస్ పాయింట్ !" అంటూ మళ్ళీ తన వాదన కొనసాగించాడు.

"కాలేజీ నుండి డిస్మిస్ అయ్యాకా ఏం చేశారు ?"

"వందేమాతరం ఉద్యమంలో ముమ్మరంగా పాల్గొన్నాను."

"అందుకేగా అరెస్టు చేసింది ప్రభుత్వం."

"కాదు !"

"మరెందుకు ?"

"'స్వరాజ్య' పత్రికలోని నా సంపాదకీయానికి !"

"సంపాదకీయాలు వ్రాసినంత మాత్రానా ప్రభుత్వం మీపై నేరం మోపుతుందా ?"

"ఏమో నాకు తెలియదు !"

"సంపాదకులయినంత మాత్రాన ప్రభుత్వాన్ని విమర్శించడం మీ ధ్యేయమా ?"

"తప్పు చేసిన వారెవరైనా సరే విమర్శించడం పత్రికల బాధ్యత. సంపాదకుడి లక్ష్యం కూడా !, చివరకు ప్రభుత్వమైనా ..."

"అందుకే ప్రభుత్వం మీపై రాజద్రోహ నేరం మోపింది."

"ప్రభుత్వం ... ప్రభుత్వం ... అసలు ఈ ప్రభుత్వానికి మాపై పెత్తనం చెలాయించే అధికారం ఎక్కడుంది ? ఈ బ్రిటిష్ ప్రభుత్వం ఈ దేశంలో చట్టబద్ధంగా ఏర్పడిందా ? అలా ఏర్పడటానికి ఈ దేశంలో ఎన్నికలేం జరుగలేదే ! నాయకులెవరూ ఎన్నుకోబడలేదే !"

"అది ప్రజాస్వామ్య దేశంలో .... వారికిది వలస దేశం. కాబట్టి వారు చేసిందే ... చెప్పిందే చట్టమంటారు ... సీ ... మై లార్డ్ ! ఆవేశపూరితమైన ఇతని మాటలు ఆంగ్ల ప్రభుత్వం ఏర్పాటు చేసిన చట్టాలనే అవహేళన చేస్తున్నాయి !"

"అవహేళన కాదు మై లార్డ్ ! యదార్థాన్ని విన్నవించాను." న్యాయాధీశుని చూస్తూ చెప్పాడు హరిసర్వోత్తమరావు.

" మై లార్డ్ ! వీరు ఆవేశపూరితమైన మాటలతో, రాతలతో, ఉపన్యాసాలతో ప్రజలకు ప్రభుత్వం పట్ల విశ్వాసం సన్నగిల్లేలా చేస్తున్నాడు. ఇవన్నీ ప్రభుత్వ వ్యతిరేక చర్యలే ! కాబట్టి వీరిపై ప్రభుత్వం రాజద్రోహ నేరం ఆపాదించడం సమంజసమే ! ఈ రాజద్రోహిని కఠినంగా శిక్షించవలసిందిగా కోరుచున్నాను. వీరి పూర్వీకులు మహారాష్ట్ర నుండి వచ్చినవారు. ఆవేశము వీరి ఊపిరి ! అందునా శివాజీని స్ఫూర్తిగా తీసుకున్న వ్యక్తి ! వీరి 'శివాజీ ఉత్సవపు తాలూకు ఉపన్యాసాల ప్రతులు, 'స్వరాజ్య' పత్రికలోని సంపాదకీయాలు మీ ముందు సాక్ష్యాధారాలుగా వుంచుతున్నాను." అంటూ తన వెంట తెచ్చిన కొన్నింటిని జడ్జి ముందుంచాడు కళ్ళి నారాయణరావు.

హరిసర్వోత్తమరావు మనోనిబ్బరంతో మౌనంగా నిల్చుండిపోయాడు బోనులో !

కేసు వాయిదా పడింది !

తిరిగి రిమాండ్‌లోకి వెళ్ళారు హరిసర్వోత్తమరావు, బోడి నారాయణరావు !

* * *

కేసు ఉత్కంఠత రేపింది జనంలో ! హరిసర్వోత్తమరావుకు ఐదు, ఆరు సంవత్సరములకు తక్కువ శిక్షపడదని కోర్టు హాలులో హాజరయిన ప్రేక్షకులు గుసగుసలు ప్రారంభించారు.

మళ్ళీ విచారణ ...... సాక్షాలు ......

మునగాల రాజానాయని వెంకట రంగారావు, మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో హరిసర్వోత్తమరావు గురువైన వేదం వెంకట రాయశాస్త్రి హరిసర్వోత్తమరావు నడవడిక పట్ల సాక్షం చెప్పారు.

ఇంకా ఈ కేసు పట్ల ఓ నిర్ణయానికి రావటానికి, వాది ప్రతివాదుల వాదనలు వినడానికి తగిన వ్యవధి కావాలని కేసును వాయిదా వేశాడు కెర్షాన్స్ !

వాది తరపు వకీలు 'బెయిల్' కోసం చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. కోర్టు హాలు దగ్గర మాట్లాడే అవకాశం దొరకటం లేదు హరిసర్వోత్తమరావు కుటుంబ సభ్యులకు. చివరకు సబ్‌జైలు దగ్గరికే వెళ్ళక తప్పలేదు.

* * *

తన్ను చూడడానికి, మాట్లాడడానికి వచ్చిన అత్త, మామలతో, భార్యతో ఏం మాట్లాడాలో తోచక మౌనంగా వుండిపోయాడు హరిసర్వోత్తమరావు ! కేశవరావే మాట్లాడ్డం ప్రారంభించాడు.

"బాబూ ?"

మౌనంగానే మామగారి వంక చూశాడు హరిసర్వోత్తమరావు.

"నీ వేమనుకోనంటే ఓ మాట చెప్పదలచుకొన్నాను." సంశయిస్తూనే అన్నాడు కేశవరావు.

"చెప్పండి !"

"ఒక్కసారి, నెలలు నిండిన నీ భార్య ముఖాన్నయిన చూసి నీ నిర్ణయం మార్చుకో బాబు !"

"అంటే మీ ఉద్దేశ్యం ?" చీరె చెరుగును నోటికి అడ్డంగా పెట్టుకొని, కళ్ళ నిండా నీళ్ళు నింపుకుని తనవంకే కన్నార్పకుండా చూస్తోన్న అర్ధాంగి వంక, మామగారి వంక చూస్తూ అడిగాడు హరిసర్వోత్తమరావు.

"మరేం లేదు బాబూ ! నీవు ప్రభుత్వానికి క్షమాపణ చెప్పుకొంటే చాలు !"

మామగారి మాటకు సవినయంగా సమాధానం చెప్పాడు. "నేనేం నేరం చేశానని క్షమించమని అడగమంటారు మామగారూ, ఈ ప్రభుత్వం అన్యాయంగా కాల్పులు జరిపి, ప్రజల ప్రాణాలు హరిస్తుంటే సాటి మానవునిగా చూస్తూ వూరకుండలేకపోయాను. 'ఇది తప్పు' అని విమర్శించడం నేరమంటారా ?"

"నీ దృష్టిలో, ప్రజల దృష్టిలో నేరం కాకపోవచ్చు, కాని ప్రభుత్వం దృష్టిలో అది నేరంగా అగుపిస్తోంది ! ...... కాబట్టి నిన్నీ స్థితికి తెచ్చింది."

"అందుకు భయపడి క్షమాపణ చెప్పుకోవాలంటారా !"

"భయపడి అనీ కాదు, మనకుటుంబ పరిస్థితులు, నీ భార్య పరిస్థితి గమనించి అయినా ......" మెల్లిగా చెప్పుకొచ్చాడు కేశవరావు.

"ప్రతి వ్యక్తీ ఇలా పరిస్థితులకు బానిసైతే, ఈ దేశానికి స్వాతంత్ర్యం రావటం అన్నది కల్ల! ఇంట పరిస్థితులకు బానిసలం, బయట ఆంగ్లేయులకు బానిసలం ! ఈ బానిస స్థితి సంపూర్ణంగా తొలగిపోవాలన్నదే నా ధ్యేయం ! ఈ ధ్యేయం నెరవేరేంత వరకు ఎన్ని విపత్తులు ఎదురైనా, ఎదుర్కోదలుచుకున్నాను మామా గారూ ! చివరకు ఈ ప్రభుత్వం నన్ను వురి తీసినా సరే !"

"బాబూ ?" నిలువెల్లా చలించిపోతూ అన్నాడు కేశవరావు. "అలాంటి మాటలు అనకు బాబు ! నీకేమీ కాదు. ఆ సర్వేశ్వరుడు నీ పట్ల తప్పక కరుణ చూపుతాడు. నిన్నీ గండం నుంచి గట్టెక్కిస్తాడు."అంటూ దీర్ఘంగా ఓ నిట్టూర్పు విడిచి, భార్య వంక చూస్తూ, "వీణా !" అంటూ పిలిచాడు.

ఆ చూపులోని అంతరార్థాన్ని గ్రహించిన వీణాబాయి భర్తతో పాటు దూరంగా వెళ్ళి నిలబడింది, కూతురు తన భర్తతో ఏకాంతంగా మాట్లాడే అవకాశమిచ్చేందుకు !

అత్తా, మామల ప్రయత్నాన్ని చూసి, అర్థం చేసుకున్న హరిసర్వోత్తమరావు మామగార్ని దగ్గరకు పిలిచి చెప్పాడు.

"మా మధ్య ఏకాంతంగా మాట్లాడుకునేంతటి విషయాలేమీ లేవు ! ... నాకు తెలుసు ! ఓ భర్తగా నా అర్ధాంగి పట్ల సరియైన న్యాయం చేయలేకపోతున్నానని ! అందుకు ఎంతగానో బాధపడుతున్నాను. ఈ విషయంలో మీరందరు నన్ను మన్నించాలి !"

"ఇందులో మన్నింపులదేముందిలే బాబు ! నీవు ఎంచుకున్న మార్గం అలాంటిది. అందువల్ల కొంత సంసార జీవితాన్ని త్యాగం చేయక తప్పదు. నాకు తెలుసు బాబూ ! ...... తెలుసు ......" కళ్ళనిండా నీళ్ళు నింపుకుంటూ అంది వీణాబాయి.

"వస్తాం బాబు"

భర్తతో మాట్లాడటానికి మాటలు పెగలక, కళ్ళ నీళ్ళ పర్యంతం అయిన చూపుల్తోనే తలవంచుకొని నిల్చుండిపోయింది రామాబాయి !

అలా నిల్చుండి పోయిన రామాబాయి చెంతకు చేరి, ఆమె కన్నీళ్ళను తుడిచి 'నీవైనా నా నిర్ణయాన్ని మనస్ఫూర్తిగా హర్షించ'మన్నట్లుగా ఆమె కళ్ళలోకి చూశాడు హరిసర్వోత్తమరావు. భర్త మనోగతాన్ని అర్థం చేసుకున్న రామాబాయి చూపుల్తోనే తన అంగీకారాన్ని తెలిపి, వంగి ఆయన పాదాలకు నమస్కరించింది.

ఆ హృదయ విదారకమైన దృశ్యాన్ని చూసిన వీణాబాయి, కేశవరావుల గుండెలు తరుక్కుపోయాయి.

తన పాదాలను తాకిన రామాబాయి భుజాలు పట్టుకుని పైకి లేపాడు హరిసర్వోత్తమరావు.

"వస్తానండీ" అన్నట్లుగా వున్నాయి ఆమె చూపులు ! విడిచిపోలేనన్నట్లుగా వుంది ఆమె హృదయం !

భార్య కనుమరుగు కాగానే హరిసర్వోత్తమరావు హృదయాంతరాల్లో కడలి కెరటంలా దుఃఖం పొంగుకొచ్చింది. అయినా నిగ్రహించుకొంటూ చెమ్మగిల్లిన కళ్ళను తుడుచుకొంటూ బోడి నారాయణరావు వంక చూస్తూ చిన్నగా నవ్వాడు. అంతటి బాధలో కూడా నవ్వగలిగే శక్తి వున్న హరిసర్వోత్తమరావు వంక విస్మయంగా చూస్తూండి పోయాడు నారాయణరావు !

* * *

విచారణ తిరిగి ప్రారంభమైంది !

పి.పి. ప్రాసిక్యూషన్ పూర్తయ్యాక, జె.డి. శామ్యూల్ తన డిఫెన్స్ వాదనను ప్రారంభిస్తూ, "మి లార్డ్, చట్టం రూపొందించిన ప్రభుత్వమే, ఆ చట్టాన్ని అతిక్రమించి, ప్రజలపై కాల్పులు జరిపినపుడు, ఆ చర్యను విమర్శించే హక్కు ప్రతి పౌరుడికీ వుంటుంది. ఆ హక్కు తోటే,

హరిసర్వోత్తమరావు తన సంపాదకీయంలో ప్రభుత్వాన్ని విమర్శించాడు. ప్రభుత్వాన్ని విమర్శిస్తూ సంపాదకీయం వ్రాసినంత మాత్రానా, ప్రభుత్వం రాజద్రోహ నేరాన్ని ఆరోపించడం సమంజసం కాదు. ప్రభుత్వాన్ని ధిక్కరించి తిరుగుబాటును లేవదీసి, స్వపరిపాలన చేసిన సందర్భంలోన్నూ, లేదా అందుకు ప్రయత్నించిన సందర్భంలోనూ 'రాజద్రోహ నేరం' అన్వయిస్తుంది ! అంతే కాని ప్రభుత్వాన్ని విమర్శించినంత మాత్రాన 'నేరం కాజాలదు. ఇది ఆవేశపు చర్య మాత్రమే కాని నేరం కాదని మనవి చేస్తున్నాను. కావున మీరు నిందితుల యందు దయ వుంచి వీరిని విడుదల చేయవలసిందిగా కోరుకొంటున్నాను."

రామాచార్యులు కూడా జె.డి. శామ్యూల్ వాదననే సమర్థిస్తూ, తన వాదన చెప్పుకొచ్చాడు. ఇద్దరి వాదనలు విన్న కెర్షాన్స్, "డిఫెన్స్ వాదులు చెప్పినట్లుగా ఇందులో రాజద్రోహ నేరమేమీ అగుపించలేదు. ఇదొక 'దుందుడుకు' చర్యగా భావించవలసిన వస్తుంది. అయినా ప్రభుత్వం పట్ల తీవ్ర పదజాలంతో విమర్శించడం చట్ట రీత్యా నేరవే అవుతుంది. కాబట్టి హరిసర్వోత్తమరావుకు ఆర్నెలలు, బోడి నారాయణరావుకు తొమ్మిది నెలలు సాధారణ శిక్షను విధిస్తున్నాను. మేధా సంపత్తి గల వీరు ఇకపై ఇలాంటి దుందుడుకు చర్యలకు పాల్పడక భవిష్యత్తులో జాగ్రత్తగా మసలు కొమ్మని మందలిస్తూ తీర్పుయిచ్చాడు.

కెర్షాన్స్ 'తీర్పు' అందర్నీ విస్మయ చకితుల్ని చేసింది !

"కనీసం, అయిదారు సంవత్సరాలు కఠిన కారాగార శిక్ష తప్పదు !" అనుకున్న పి.పి. కళ్ళి నారాయణరావుకు 'సాధారణ జైలు శిక్ష' విధించే సరికి కెర్షాన్స్ తీర్పు అసమంజసమనిపించింది !

వెంటనే చెన్నపట్నానికి ప్రయాణమైపోయి, అక్కడి అధికారులతో, కెర్షాన్స్ భారతీయుడైనందున ముద్దాయిల పక్షంగా తీర్పు చెప్పాడని, తీర్పుపై హైకోర్టుకు అప్పీలు చేయండి అంటూ సూత్రీకరించాడు. ప్రభుత్వం వెంటనే అందుకు పూనుకుంది !

దాని పరిణామం ?

హైకోర్టు న్యాయమూర్తి బెన్సన్ కేసును పునర్విచారించి తమ తీర్పును ఇలా ఇచ్చారు !

"హరిసర్వోత్తమరావు లాంటి ప్రమాదకారులకు కఠినశిక్ష తప్పనిసరి ! కాబట్టి ఇతనికి మూడేళ్ళ కఠిన కారాగారశిక్షను విధిస్తున్నాను. బోడి నారాయణరావుకు విధించబడిన తొమ్మిది నెలల శిక్షను ఖాయపరుస్తున్నాను."

హైకోర్టు తీర్పు విన్న ఆంధ్ర ప్రజానీకమంతా ఒక్కమారుగా కలవరపాటు చెందారు !

పరమానందబరితుడైనది ఒక్కరే ఒక్కరు !

ఆ ఒక్కరు సాక్షాత్తు పి.పి. కళ్ళి నారాయణరావు !!

కారణం ?

బ్రిటిష్ ప్రభుత్వం. పి పి. స్థాయి నుంచి జిల్లా జడ్జి స్థాయికి అతని పదవి పెంచడమే !

ఈ తీర్పును సాకుగా చెసుకొని ఐ.సి.ఎస్. ఆఫీసరగు కెర్నాస్ప్‌కు, జడ్జి హోదా నుంచి తొలగించి 'సబ్ కలెక్టర్'గా నరసరావుపేటకు బదిలీ చేసింది బ్రిటిష్ ప్రభుత్వం ! తన తీర్పుకు వ్యతిరేకంగా శిక్షను పెంచేలా చేసిందే కాక, తన హోదాను కూడా తగ్గించి వేయడంతో తీవ్ర మనస్తాపానికి గురియైన కెర్నాస్ప్ బ్రిటిష్ ప్రభుత్వానికి తన రాజీనామా లేఖను పంపాడు.

"మీ ప్రభుత్వం ఇంతటి ద్వంద్వ ప్రవృత్తితో ప్రవర్తిస్తుందని నేనూహించలేదు. ఒక న్యాయాధికారి చెప్పిన తీర్పుపై మరొక న్యాయాధికారి తీర్పు చెప్పడంలోనే అసమంజసముంది. అంతేగాక నా పదవిని తగ్గించి సబ్ కలెక్టర్‌గా బదిలీ చేసిన మీకు, న్యాయస్థానం పట్ల వున్న గౌరవమేమిటో తేటతెల్లమౌతోంది ! ఒక న్యాయాధికారి పట్లే, మీరింతటి అమానుష వైఖరికి పూనుకొంటే, ఇక సామాన్య ప్రజానీకం పట్ల మీరు ఎలా కక్ష సాధిస్తున్నారో నాకిప్పుడే అర్థమైంది! అందుకే నా పదవికి రాజీనామా చేస్తున్నాను. గుడ్ బై !

ఇట్లు

**కెర్నాస్ప్.**

*　　　　*　　　　*

సాధారణ జైలు శిక్షకు గాను బోడి నారాయణరావును రాజమండ్రి సెంట్రల్ జైలుకు, కఠిన కారాగార శిక్ష పడ్డందుకుగాను హరిసర్వోత్తమరావును తమిళ దేశంలోని రాయవేలూరులోని సెంట్రల్ జైలుకు తరలించడానికి గాను, ఆదేశాలు జారీ చేయబడ్డాయి !

తెల్లవారితే ప్రయాణం ... ఇరువురిదారులు వేరవబోతున్నాయి! మళ్ళీ కల్సుకునేది ఎంత కాలానికో ...... ?

ఆ రాత్రి ......

బోడి నారాయణరావుకు అన్నం సహించలేదు !

జొన్న ముద్దలాంటి అన్నం వైపు, నీళ్ళ లాంటి చారువైపు అలాగే చూస్తుండి పోయాడు !

"ఏమిటలా చూస్తున్నావు మిత్రమా ! కానివ్వు !" చిన్నగా భుజం తడుతూ అన్నాడు సర్వోత్తమరావు.

"నాకెందుకో తినాలనిపించడంలేదు. తెల్లవారితే మన ప్రయాణం చెరో దిక్కుకు ! నాకైతే ఫరావాలేదు. మరి నీ పరిస్థితే ధారుణం ! కనీసం తెలుగు మాట్లాడే వారు కూడా వుండరేమో ?"

"ఎవరో ఒకరు వుండకపోతారా ! మనలాంటి వారి జీవితాలు ఎక్కడ మొదలవుతాయో, ఎక్కడ అంతమవుతాయో ? ఆ సర్వేశ్వరునికే తెలియాలి ! ఇక మన మధ్య స్నేహం అంటావా! ఇదో మజిలీ ! బాటసారి లక్ష్యం మజిలీ చేస్తూ ముందుకు సాగిపోవడమే కాని, అక్కడే స్థిరపడ్డం కాదుగా ! మన జీవితాలు కూడా **అంతే** ! తిరిగి ఎప్పుడో ఒకప్పుడు కలుసుకోక మానములే ! **బాధ**పడకు మిత్రమా ! ఏ పాటు **తప్పి**నా ఈ సాపాటు ముఖ్యం మనిషికి వూ... కానీ ... !"

హరిసర్వోత్తమరావు మాటల**తో తి**నడానికి వుపక్రమించిన బోడి నారాయణరావు ఏదో గుర్తు తెచ్చుకున్న వాడై అడిగాడు.

"మిత్రమా ! రాయవేలూరు జైలు నరకానికి ప్రతీక అంటారు ...... మూడేళ్ళ కఠిన కారాగార వాసాన్ని నువ్వెలా భరిస్తావో, ఏమో ?"

"నరకమైనా, స్వర్గమైనా అనుభవించక తప్పదు. నువ్వు నా గురించి బెంగ పెట్టుకోవద్దు. ముందు అన్నం తిను ! మళ్ళీ పెందరాళే మనం లేవాలి !"

జొన్న అన్నం లాంటి అన్నం ముద్ద మింగుడు పడకున్నా తప్పదు కాబట్టి తినే ప్రయత్నం చేయసాగాడు బోడి నారాయణరావు !

'రుచి' అన్న దాన్ని మరచి మామూలు భోజనానికి మల్లే తింటూ వున్న హరిసర్వోత్తమరావు వంక ఆశ్చర్యంగా చూస్తూ మనసులోనే అనుకున్నాడు బోడి నారాయణరావు.

"స్థిత ప్రజ్ఞుడు' అంటే ఏమిటో ఇప్పుడర్థమయ్యింది !"

* * *

మలి ఝాము వేళ ... !

సబ్ జైల్లోని గోడ గడియారం నాలుగు గంటలు కొట్టింది !

సెంట్రీ వచ్చి సెల్ తెరిచాడు. అప్పటికే నిద్ర నుంచి మేలుకొన్న హరిసర్వోత్తమరావు, బోడి నారాయణరావును నిద్రలేపి చెప్పాడు. "మనం బయల్దేరే వేళవుతోంది. త్వరగా రెడీ అవ్వాలి !" కొద్ది సేపట్లోనే **తయా**రయ్యారు మిత్రులిద్దరు !

అయిదయ్యింది ......

హరిసర్వోత్తమరావును వెంట బెట్టుకొని వార్డర్ దగ్గరకు వెళ్ళాడు సెంట్రీ !

సర్వోత్తమరావు కాళ్ళకు, చేతులకు సంకెళ్ళు తగిలించబడ్డాయి !

"బోడి నారాయణరావును ఎప్పుడు తీసుకెళ్తున్నారు ? వార్డర్ వంక చూస్తూ అడిగాడు హరిసర్వోత్తమరావు.

"అతను వెళ్ళాల్సిన బండి సాయంకాలానికిగాని రాదు" అంటూ సెంట్రీ వంక చూస్తూ చెప్పాడు వార్డర్ !

"ఇతన్ని తీసుకెళ్ళి పోలీసులకు ఒప్పజెప్పు" అలాగే ! అంటూ తలూపి హరిసర్వోత్తమరావును వార్డర్ గది నుండి వెలుపలికి తీసుకురాగానే, అతని కోసమే కాచుకుని కూర్చున్న ఓ పోలీస్ ఇన్‌స్పెక్టర్, మరో ముగ్గురు పోలీసు జవాన్లు హరిసర్వోత్తమరావుకు తగిలించిన సంకెళ్ళను చేత పుచ్చుకున్నారు.

గట్టి బందోబస్తు మధ్య రైల్వేస్టేషన్ చేరిన హరిసర్వోత్తమరావు, తన్ను చూడడానికి కనీసం ఒక్కరైనా రానందుకు మనసులో బాధపడ్డాడు.

రైలు 'కూ' అంటూ కూతపెడుతూ ముందుకు సాగింది.

రైలు పూర్తిగా స్టేషన్ దాటిపోయాక, 'హమ్మయ్య !' అంటూ నిట్టూర్చి, హరిసర్వోత్తమరావుకు వీడ్కోలు ఇవ్వడానికి వచ్చిన జనాన్ని రైల్వేపోలీసు ఠాణా నుంచి బయటికి వొదిలారు రైల్వేపోలీసులు.

అలా బయటికి వొదిలిన వారిలో అయ్యదేవర కాళేశ్వరరావు ఒకరు !

# 11

బందరు నుంచి బయల్దేరిన రైలు చెన్నపట్నం చేరే సరికి మర్రోజు అయింది ! చెన్నపట్నం దాక హరిసర్వోత్తమరావుకు కాపలా వుంటూ వచ్చిన పోలీసులు, తమ బాధ్యతను తమిళ పోలీసులకు వొప్పచెప్పి, తిరుగు ప్రయాణమయ్యారు. మళ్ళీ అక్కడ్నుంచి రైలు ప్రయాణం మొదలయ్యింది ! కాళ్ళకు, చేతులకు సంకెళ్ళతో రాయవేలూరు వెళ్ళే రైలెక్కుతూ వుండగా రైల్వేస్టేషన్‌లోని ప్రయాణీకులు, ఉద్యోగులు గుంపులు గుంపులుగా చేరి హరిసర్వోత్తమరావు వంకే చూస్తుండిపోయారు ! ఆ గుంపులో 'విజ్ఞానచంద్రిక మండలి' స్థాపకుడు కొమర్రాజు లక్ష్మణరావు కూడా వున్నాడు. మిత్రుణ్ణి ఆ పరిస్థితిలో చూడగానే లక్ష్మణరావుకు దుఃఖం ముంచుకువచ్చింది. ఎలాగైనా మాట్లాడి తీరాలి' అనుకున్నవాడై, 'సర్వోత్తమా ! ......." అంటూ బిగ్గరగా పిలిచాడు. రైలెక్కబోతున్న హరిసర్వోత్తమరావు, చప్పున వెను తిరిగి చూశాడు. లక్ష్మణరావు కంటికి అగుపించగానే హరిసర్వోత్తమరావులో ఎక్కళ్ళేని ఆనందం పుట్టుకొచ్చింది ! తన దగ్గరకు రాకుండా ఆపుతోన్న పోలీసులను ఉద్దేశించి చెప్పాడు.

"అతను నా ప్రాణమిత్రుడు. దయచేసి నా దగ్గరకు రానివ్వండి !"

హరిసర్వోత్తమరావు విజ్ఞప్తిని ఖాతరు చేసే సంస్కార హృదయం ఆ పోలీసులకు లేదు. అందుకే తమిళంలో "నువ్వు నోర్ముయ్ !" అంటూ అతన్ని విసురుగా రైల్లో కెక్కించారు.

రైలు ముందుకు సాగింది !

"వస్తాను మిత్రమా !" అంటూ సంకెళ్ళు వున్న చేతులు పైకెత్తి వూపుతూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

రైలు వేగం పుంజుకుంది ! జనం మధ్యలో నుండే చేయి వూపుతూ కన్నీటి వీడ్కోలిచ్చాడు కొమర్రాజు లక్ష్మణరావు !

తనకు వేసిన సంకెళ్ళను పట్టుకుని, తన పక్కన కూర్చున్న పోలీసుల వంక కోపంగా చూస్తూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

"నేను మీ ప్రభుత్వం విధించిన రాజద్రోహం శిక్షకు గురి అయినంత మాత్రాన ఎవ్వరూ నాతో మాట్లాడకూడదా ? నన్నెవ్వరూ కలువరాదా ?" తనకు తమిళం మాట్లాడ్డం వచ్చు కాబట్టి తమిళంలోనే అడిగాడు హరిసర్వోత్తమరావు.

"మీరు గాని, మీతో మరెవ్వరు గాని మాట్లాడకుండా వుండేందుకు అవసరమైన చర్యలు తీసుకోవాలి అని మాపై అధికారుల ఆజ్ఞ ! ఆ ఆజ్ఞను మేం విధిగా పాటించాలి ! ఈ విషయంలో మేము నిమిత్త మాత్రులం !"

వారి సమాధానం విన్న హరిసర్వోత్తమరావులో ఏవేవో ఆలోచనలు ! వాటిలోనే నిమగ్నమయి వున్నాడు రాయవేలూరు చేరేదాక !

రాయవేలూరు చేరే సరికి సాయంకాలమయ్యింది ! అక్కడ కూడా పోలీసుల బందోబస్తు మధ్య హరిసర్వోత్తమరావును సెంట్రల్ జైలుకు తరలించారు !

సెంట్రల్ జైల్లోకి అడుగు పెడుతోన్న హరిసర్వోత్తమరావు, జైలు ముఖద్వారం వంక, చుట్టూ వున్న పరిసరాలను కలయజూశాడు !

దుర్భేద్యమైన ఎత్తయిన ప్రహారి గోడలు ... ! హరిసర్వోత్తమరావు పరిసరాలను అలా కలయజూడటం గమనించిన ఓ పోలీసు, "తప్పించుకపోవాలని చూస్తున్నావేమో ! ఈ జైలులో నుంచి తప్పించుకోవటం నీ తరం కాదు కదా ! నీ తాత తరం కూడా ! పద లోపలికి !" అంటూ విసురుగా లోపలికి నెట్టాడు. అలా హరిసర్వోత్తమరావు లోపలికి నెట్టబడగానే జైలు ముఖద్వారం మూసుకుంది ! హరిసర్వోత్తమరావు వెంట వచ్చిన పోలీసులు అతని సంకెళ్ళు తొలగించి, జైలు వార్డర్‌కు ఒప్పచెప్పి, తమ వద్ద వున్న కాగితాలను అతని ముందు వుంచారు.

"మీరు, కానిస్టేబుల్స్ వెంట పంపిన హరిసర్వోత్తమరావు అనబడే వ్యక్తి మా జైలు చేరుకున్నారు" అని వ్రాసి సంతకం చేసి తిరిగి వారి కందించాడు.

అతను వ్రాసింది అందుకున్న వెంటనే 'ఇక మా బాధ్యత తీరిపోయిందన్నట్టుగా చిన్నగా నిట్టూర్చి 'వెళ్ళొస్తాం సార్ !" అంటూ వార్డర్‌కు ఓ సెల్యూట్ చేసి అక్కడి నుంచి నిష్క్రమించారు. వారు వెళ్ళిపోగానే జైలు వార్డర్ ఖైదీల రిజిస్టర్ పుస్తకం అందుకొని పక్కనే వున్న తన క్రింది ఉద్యోగులకు ఆదేశమిచ్చాడు.

"ఇతని బట్టలు వూడదీయండి !"

"ఊఁ ... కానియ్ !" అంటూ హరిసర్వోత్తమరావు వంక చూశారు సెంట్రీలు.

హరిసర్వోత్తమరావు మొదట తన చొక్కాను తీశాడు. సెంట్రీలు చేరువగా వెళ్ళి ఎక్కడెక్కడ పుట్టుమచ్చలున్నది లెక్కపెట్టి చెప్పాడు. వారు చెప్పింది వ్రాసుకున్న వార్డర్...... ఓ.కె...... నెక్స్ట్ ..."

"పైజామా విప్పదీయ్ ..." అన్నారు సెంట్రీలు హరిసర్వోత్తమరావు వంక చూస్తూ !

"ఇందాక వ్రాసుకున్నవి చాలావా ?"

"చెప్పిందిచెయ్ ?" గద్దించాడు.

పైజామా విప్పదీశాడు హరిసర్వోత్తమరావు.

కాలిమడిమ నుంచి మొదలు నాభి వరకు పరీక్షగా చూశారు సెంట్రీలు ఉన్న వాటిని చెప్పారు.

"ఊఁ" అంటూ పేరును, ఎత్తును, రూపురేఖలను ... మొత్తం రిజిష్టరులోకి ఎక్కించుకొని చెప్పాడు జైలు వార్డర్.

"ఇతన్నీలాగే సెల్‌లో తోయండి !"

"ఇద న్యాయం ! నా బట్టలివ్వండి !" ఆవేశం ముంచుకొస్తుండగా గట్టిగా అరిచి చెప్పాడు హరిసర్వోత్తమరావు.

"రాజద్రోహ నేరానికి పాల్పడినపుడు అన్యాయమనిపించలేదా ? ఇంకా చూస్తూ నిల్చున్నారేం? ఇతన్ని తీసుకెళ్ళండి ! ఇవాల్టికి విశ్రాంతి ఇచ్చి అసలు కార్యక్రమం రేపు మొదలు పెడదాం !"

ఇద్దరు సెంట్రీలు హరిసర్వోత్తమరావును సెల్ వైపు లాక్కుపోగానే, మిగిలివున్న సెంట్రీ వంక చూస్తూ చెప్పాడు.

"రేపు ఉదయం ఆర్ముగం గాడ్ని పట్రా !"

"చిత్తం" అన్నట్టుగా తలూపి వెళ్ళిపోయాడు సెంట్రీ !

* * *

కూతురి భవిష్యత్తు చింత చేస్తూ, అప్పుడప్పుడే నిద్రలోకి జారుకొంటున్న కేశవరావును, వీణాబాయి వచ్చి ఆందోళన స్వరంతో "ఏమండీ ! ఏమండీ !" అంటూ తట్టి లేపింది !

"ఏమయ్యింది వీణా ?" నిద్ర నుంచి మేలుకొంటూ అడిగాడు కేశవరావు.

"అమ్మాయికి పురిటి నొప్పులొస్తున్నాయండీ ! మీరు వెంటనే వెళ్ళి మంత్రసానిని తీసుకు రండి !"

కూతురికి పురిటి నొప్పులనగానే కేశవరావులో కూడా ఆరాటం మొదలయ్యింది.

"ఇప్పుడే వెళ్ళి పిల్చుకొస్తాను !" అంటూ వున్న పళంగానే బయల్దేరి వెళ్తొన్న భర్త వంక చూస్తూ అంది వీణాబాయి.

"బయట వర్షం పడుతూ వుంది. గొడుగు తీసుకెళ్ళండి !"

"అదిప్పుడు ఎక్కడుందో వెతికే ఓపికలేదు. వర్షం వస్తే ఏం ? ..." అంటూ వీధి వాకిలి తెరుచుకొని నెత్తిన తుండుగుడ్డ వేసుకొని వర్షంలో తడుస్తూనే వూర్లోకి పరుగులు తీశాడు కేశవరావు !

ప్రసవ వేదన ఎక్కువయ్యే సరికి, నొప్పులకు తట్టుకోలేక రామాబాయి బాధతో గట్టిగా అరుస్తూ వుంది.

"అమ్మా ... నే తట్టుకోలేనే ! ఈ నొప్పులు భరించలేనే !" అంటూ –

"కాస్త ఓర్చుకోమ్మా ! నాన్న మంత్రసానిని పిలుచుకరావడానికి వెళ్ళారు. ఈ పాటికి వచ్చేస్తూ వుంటారు ... కాస్త ఈ వేన్నీళ్ళు తాగమ్మా !" అంటూ కూతురి నోటికి వేన్నీళ్ళను అందించి కొద్ది కొద్దిగా తాగించింది.

వర్షపు జోరు ఎక్కువయింది !

పెళ పెళార్భాటాలతో ఉరుములు ... మెరుపులు

"అర్జునా ఫల్గుణా ... అనుకుంటూ ... భర్త రాక కోసం వీధి గుమ్మం దగ్గర అటూ ఇటూ తచ్చాడుతూ వుండిపోయింది వీణాబాయి.

అరగంట గడిచాక ... భర్త రాకను, అతనితో పాటు వున్న మంత్రసానిని చూశాక ... చిన్నగా నిట్టూర్చి అంది.

"రామ్మారా త్వరగా ! అమ్మాయికి నొప్పులు ఎక్కువవుతున్నాయి ..."

తడిసిన గుడ్డలతోనే మంత్రసాని పరుగున రామాబాయి వున్న గదిలోకి వెళ్ళింది. పక్కగదిలో నుంచి పొడిగుడ్డలు తీసుకొని వీణాబాయి కూడా ఆ గదిలోకి వెళ్ళగానే మంత్రసాని తలుపుమూసేసింది !

బాగా తడిసి ముద్దయిన కేశవరావు వసారాలో ఆరవేసిన తుండును అందుకొని ముఖం తల తుడుచుకుంటూ మనసులోనే దేవుడ్ని వేడుకున్నాడు.

"బాలాజీ ! నా బిడ్డకు సుఖ ప్రసవం జరిగేలా చూడు తండ్రీ ! నీ కొండకు వచ్చి ముడుపు చెల్లించుకొంటాను."

మూసివున్న ఆ గదిలో నుంచి రామాబాయి వేసే కేకలకు ఆ ఇల్లంతా ప్రతిధ్వనించిపోతోంది.

కాసేపటికి అరుపులు తగ్గిపోయాయి.

కెవ్వుమన్న పసిగొంతు ఏడుపు వినిపించింది !

కేశవరావులో అంతవరకూ ఆవహించుకొన్న భయం తొలగి ఆనందం చోటు చేసుకుంది. ఆరాటాన్ని ఆపుకోలేక వెళ్ళి తలుపు తడుతూ అన్నాడు.

"ఆడపిల్లా ! మగపిల్లాడా !"

"మగ పిల్లాడు. మీకు మనవడు పుట్టాడండీ !" గది లోపల్నించే ఆనందం పట్టలేక సమాధానమిచ్చింది వీణాబాయి.

"ఆ ... నిజంగా ఏదీ తలుపు తెరు !"

"కాసేపు ఆగండి ! ... చూద్దురు గానీ !"

అలా ఎందుకని ఆగమందో అర్థమయింది కేశవరావుకు ! తన తొందర పాటుకు చిన్నగా నవ్వుకుంటూ ఆ గది ముందే అటూ ఇటూ పచార్లు చేయసాగాడు కేశవరావు. అతని మనసు ఆనందోత్సాహంతో తెలియాడుతోంది.

* * *

సూర్యోదయమయ్యింది !

తిండిలేని కారణంగా రాత్రంతా నిద్రపట్టక, అప్పుడప్పుడే నిద్రలోకి జారుకుంటోన్న హరిసర్వోత్తమరావు తానున్న గది తలుపు శబ్దం చేస్తూ తెరుచుకునే సరికి, ఉలికి పాటున కళ్ళు తెరచి చూశాడు. కళ్ళెదురుగా జైలు సెంట్రీ !

"పద !" సర్వోత్తమరావు వంక తేరిపార చూస్తూ అన్నాడు.

"ఎక్కడికి ?"

"ఇక్కడ మేం చెప్పిందల్లా చేయడమే కాని, ఎందుకు, దేనికి అని అడగకూడదు. మారు మాట్లాడక నా వెంటరా !"

"ఈ లోచెడ్డీతో ఎలా రాను ?- నా దుస్తులివ్వండి !"

"నీ మొహానికి దుస్తులు కూడానా ? మర్యాదగా నా వెంట రాకపోతే ఈ లాఠీతో నీ నడ్డి విరగ్గొడతాను." పళ్ళుకొరుకుతూ అన్నాడు సెంట్రీ.

మారు మాట్లాడక మౌనంగా అతన్ని అనుసరించాడు హరిసర్వోత్తమరావు. జైలు ఆవరణలో వున్న ఓ కుర్చీలో కూర్చుని విలాసంగా కాలు వూపుతూ వున్న జైలు వార్డర్ దగ్గరకి తీసుకెళ్ళాడు సెంట్రీ.

హరిసర్వోత్తమరావుని చూడగానే వార్డర్‌లో పైశాచిక ఆనందం ! "కూర్చోబెట్టండి !" అంటూ సెంట్రీలకు హుకుం జారీచేశాడు.

సెంట్రీలు హరిసర్వోత్తమరావు రెక్కలు విరిచి పట్టుకొని, ఎదురుగా వున్న రాతి అరుగుపై కూర్చోబెట్టారు.

తన పక్కనే నిల్చొని పొగాకు నములుతోన్న మంగలి ఆర్ముగం వంక చూస్తూ చెప్పాడు.

"వూ ! ఆర్ముగం ! నీ పని మొదలు పెట్టు !"

అతని ఆజ్ఞ కోసమే కాచుకుని వున్న ఆర్ముగం, పొగాకు జిగటును పక్కకు వూసి తన చెంతనే వుంచుకున్న పొదుగులో నుంచి గడ్డాలు గీయడానికి ఉపయోగించే కత్తిని బయటకు తీశాడు. అదే సమయంలో ఓ సెంట్రీ కుండెడు నీళ్ళు తెచ్చి హరిసర్వోత్తమరావు తలపై గుమ్మరించాడు. తనకేం చేయబోతున్నారో గ్రాహ్యమయింది హరిసర్వోత్తమరావుకు ! తన్ను వుడుంలా పట్టుకుని వున్న సెంట్రీల నుండి తప్పించుకోవాలని గింజుకున్నాడు. అయినా ఫలితం లేకపోయింది. అలా గింజుకున్నందుకు పర్యవసానం ?

వార్డర్ లాఠీతో హరిసర్వోత్తమరావు ముఖంపై విసురుగా కొట్టాడు. ఆ లాఠీ దెబ్బకు హరిసర్వోత్తమరావు పెదవి చిట్లి రక్తం కారింది. నుదురు బొప్పి కట్టింది.

"నేను పశువుని కాను ! మనిషిని ! ఏమిటింతటి అన్యాయం, ఇది అమానుషం" అంటూ గట్టిగా అరిచాడు హరిసర్వోత్తమరావు.

అతని అరుపుకు మరింత చిర్రెత్తు కొచ్చింది జైలు వార్డర్‌కు ! 'పెడీల్, పెడీల్' మంటూ లాఠీతోనే వీపుపై వొడ్డించాడు. ఆ దెబ్బకు హరిసర్వోత్తమరావు వొళ్ళు హూనమైంది. నిస్సత్తువ ఆవహించింది. అరవడానికి కూడా శక్తి చాలక తలవేలాడేసుకుని కన్నార్పకుండా వార్డర్ వంకే చూస్తుండిపోయాడు !

వార్డర్ కనుసైగతో ఓ సెంట్రీ ముందుకు వచ్చి హరిసర్వోత్తమరావు తలను గట్టిగా పట్టుకున్నాడు. ఆర్ముగం తన పని చకచక చేసుకుపోయాడు. అయిదు నిముషాల్లో హరిసర్వోత్తమరావు తల వెంట్రుకలన్ని నేలరాలాయి. శిరోముండనం గావించబడింది !

"వీడి ముఖానికి పెద్దపులికి మల్లే మీసాలు కూడానా ! అవి కూడా తీసేయ్ !"

ఆర్ముగం సర్వోత్తమరావు మీసాలను కూడా తీసేశాడు.

జైలర్ దృష్టి ఈ మారు మొలతాడుపై పడింది ! అది కూడా తీయించాడు. హరిసర్వోత్తమరావు వొంటిపై జంధ్యం అగుపించకపోయే సరికి –

"బాపనోడివని రికార్డులో రాసుందే ? జంధ్యం ఏమయ్యింది ?"

"తెంచేశాను !" హీనసర్వంతో జవాబిచ్చాడు హరిసర్వోత్తమరావు.

"అందుకే ఇలాంటి పాడు బుద్ధులు పుట్టాయి నీకు ! అచ్చమైన బాపనోడివి అయివుంటే, బుద్ధిగా వుండేవాడివి. ఇలాంటి వాటిల్లోకి ఎందుకొస్తావు ?"

- అంటూ హరిసర్వోత్తమరావు వొంటిపైని లోచెడ్డీని కూడా లాగించాడు. పూర్తిగా నగ్నమయిన శరీరంతో కృంగిపోయాడు. సిగ్గుతో కళ్ళుమూసుకుని, తలదించేసుకున్నాడు.

"ఆడదాన్లా సిగ్గుపడతావేం ? ఇక్కడెవరూ ఆడాళ్ళు లేరులే ! ఊ ... ఈ గోచి తొడిగించండి !" అంటూ ఆర్డర్ జారీ చేశాడు వార్డర్.

మొలను దాచేంత మేర మాత్రమే వున్న లంగోట లాంటి గోచిని హరిసర్వోత్తమరావుకు తొడిగించారు. గోచి తొడగడం పూర్తవగానే, కాళ్ళకు, చేతులకు కలిపి వుండేలా సంకెళ్ళు తగిలించారు. తల సైతం తిప్పేందుకు, వంచేందుకు వీలు లేకుండా మెడకు కొయ్యను కూడా తగిలించారు. అనుకున్నవన్నీ పూర్తయ్యాక, హరిసర్వోతమరావును ఈడ్చుకుంటూ వెళ్ళి పక్కనే వున్న నూనెగానుగ కాడికి, అతని రెండు చేతులను కట్టారు.

"కానియ్యండి ?" అనే సరికి అతని వొంటిపై కొరడా దెబ్బలు మొదలయ్యాయి. గానుగ చట్రం నెమ్మదిగా ముందుకు కదిలింది !

* * *

పుదుచ్చేరి రైల్వేస్టేషన్ !

బైరాగి దుస్తులు ధరించి బెజవాడ నుంచి పలాయనం చిత్తగించి వచ్చిన పింగళి లక్ష్మీనారాయణ పుదుచ్చేరి రైల్వేస్టేషన్‌లో, ఓ మూల వున్న బెంచీపై పడుకొని, ఆలోచనలో పడ్డాడు. అతనిలో ఆత్మావలోకనం మొదలయ్యింది !

"తాను చేసింది తప్పేమో ? అరెస్ట్ వారెంట్ వచ్చినంత మాత్రాన తప్పించుక రావడమేనా? అయినా తానింత దూరం ఎందుకు వచ్చేసినట్టు ? ఇంతదూరం రావడానికి కారణం ? అరెస్ట్ బారి నుంచి తప్పించుక రావాలనే కదూ ! ఇక్కడ తన్నెవరయినా గుర్తు పడితే ? ....

ఆత్మావ లోకనం తొలిగి తార్కికత మేలుకొంది !

"తన పిచ్చి గాని ఈ ప్రాంతంలో తన్నెవరు గుర్తుపడతారు ? పెరిగిన ఈ గడ్డం, మాసిన ఈ వేషధారణ, బెజవాడలోనే గుర్తుపట్టలేదు. ఇక హాయిగా ఇచ్చ వచ్చిన చోటుకు వెళ్ళవచ్చు !"

లక్ష్మీనారాయణ ఇలాంటి ఆలోచనల్లో వుండగా ... ఒక్కుమ్మడిగా రైల్వేస్టేషన్‌లో దూసుకువచ్చిన ఓ యువక బృందం 'వందేమాతరం' ... 'వందేమాతరం'... అంటూ నినాదాలు చేయసాగింది.

సందర్భమేమిటో పింగళి లక్ష్మీనారాయణకి అర్థం కాలేదు. తాను కూడా వారితో కలిసి నినాదాలు చేయాలనిపించింది. పడుకున్న వాడు లేచి కూర్చున్నాడు. ఇక వెళ్ళి వారితో గొంతు కలుపుదామనుకొంటు వుండగా, బిలబిలమంటూ అక్కడికి చేరుకున్న పోలీసులు కనిపించిన

ప్రతివ్యక్తిని తమ చేతుల్లో వున్న లాఠీలతో గొడ్డును బాదినట్లు బాదసాగారు. లాఠీ దెబ్బలకు తాళలేక బాధతో యువకులు అరిచిన అరుపులతో ఆ ప్రాంతమంతా ప్రతిధ్వనించిపోయింది! అయినా వొదలక అలా కొట్టుకుంటూనే వారిని రైల్వేస్టేషన్ బయటికి తోసుకపోయారు. వారందరూ వెళ్ళిపోయాక, అక్కడే వున్న ఓ రైల్వే ఉద్యోగిని అడిగాడు.

"ఏం జరిగింది ?" అంటూ

అతను విసుక్కుంటూనే లక్ష్మీనారాయణ వంక ఎగాదిగా చూస్తూ జవాబు చెప్పాడు.

"త్రివేంద్రంలో వందేమాతరం ఉద్యమాన్ని పురస్కరించుకొని ఓ గొప్ప సభ జరుగబోతుందట! అక్కడికి వెళ్ళాలని, ఇప్పుడు తన్నులు తిన్న యువకుల ప్రయత్నం ! రైలు తప్ప వేరు దారి లేదు. కాబట్టి ఇక్కడికి చేరారు. ఈ విషయం పోలీసులకు తెలిసి, వచ్చి వొడ్డించి తీసుకెళ్ళారు. అది సరే ! తమరెవరు ? ఎక్కడనించి వచ్చారు ? ఎక్కడికి వెళ్ళాలి ? అయినా వీరి గురించి ఇంత ఇదిగా అడుగుతున్నారు ?" లక్ష్మీనారాయణ వంక అనుమానంగా చూస్తూ అడిగాడు.

ఆ ఉద్యోగి అనుమానపు చూపులకు లక్ష్మీనారాయణలో భయం మొదలయ్యింది. దానిని బయటకు కనిపించకుండా చెప్పాడు.

"సర్వసంగ పరిత్యాగిని ! నాకంటూ ఎవ్వరూ లేరు – ఏ వూరు లేదు ! ఎక్కడ మనసైతే అక్కడ కొన్నాళ్ళ పాటు వుంటాను. అనేక వూర్లు తిరుగుతూ ఈవూరొచ్చాను."

"నీవు నిజంగా సన్యాసివేనా ? లేక ఈ వేషంలో తిరుగుతూ వున్న ఉద్యమకారుడివా?"

"నన్నే అనుమానిస్తున్నావా నాయనా ?" మనసులో గుబులు చెలరేగుతున్నా సవినయంగానే జవాబు ఇచ్చాడు.

"అయితే నువ్వే ఆశ్రమానికి సంబంధించిన వాడవు ?"

"ఆశ్రమమా ? ఏం జవాబు చెప్పాలో తెలీకా నోరెళ్ళ బెట్టాడు లక్ష్మీనారాయణ.

"ఏ ఆశ్రమానికి సంబంధించిన వాడివి ? అని అడిగితే అలా నోరవ్వగించి చూస్తావేమయ్యా? అసలు మీకు గురువున్నారా ?"

ఏదో ఒకటి చెప్పి తప్పించుకోకపోతే వీడు పోలీసుల కప్పగించేట్లు వున్నాడని, మనసులో తికమకపడుతూ "తికమకాశ్రమం" నాయనా అంటూ గాబర గాబరాగా అన్నాడు.

"ఏం నన్నే పల్టీగొట్టించేట్లున్నావే ! తికమక, మకతికా !" అంటూ పడీ పడీ నవ్వుతూ అన్నాడు.

అలా నవ్వటం .... లక్ష్మీనారాయణకు కాస్త ధైర్యం పుట్టుకొచ్చింది.

ఆ ధైర్యంతోనే చెప్పాడు !

"మా అమ్మా నాన్నలు చిన్నతనంలోనే పోయారు. బంధువుల ఇంట పెరిగాను. పెద్దయ్యాక వారే పెళ్ళి చేశారు. కొన్నాళ్ళకు నా అర్ధాంగి అర్ధాంతరంగా కన్నుమూసింది. ఇక నాకు జీవితంపై విరక్తి జనించింది. సన్యాసిగా మారి దేశాటన చేస్తూ చివరకు తికమకేంద్రుల వారి ఆశ్రమం చేరాను. వారి లీలలు అనంతం ! వారిని మనం అవహేళన చేయకూడదు నాయనా తప్పు తప్పు ! మీ తరపున నేను లెంపలు వాయించుకుంటాను" అంటూ లేచి మూడు గుంజీళ్ళు తీసి లెంపలు వాయించుకున్నాడు పింగళి లక్ష్మీనారాయణ.

జాలి గొలిపే కళ్ళతో అతను చెప్పింది నిజమనుకొన్న ఆ రైల్వే ఉద్యోగి,

"పాపం ! ఇంత చిన్న వయస్సులో భార్యా వియోగము, నిజమే ! భార్యా వియోగం తట్టుకోలేనిది. నా అర్ధాంగి కూడా గతించి కొన్నాళ్ళయింది. ఎప్పుడూ ఆమె నా కలలోకి వస్తున్నది. ఆమె నెలా మరచిపోవాలో తెలియడంలేదు. నేనూ నీలాగే మారి 'తికమకేంద్రుల' వారి ఆశ్రమంలో చేరుతాను. స్వామీ ! ఆ ఆశ్రమం ఎక్కడో శలవిస్తారా ?" అంటూ ప్రాధేయపడ్డాడు.

లక్ష్మీనారాయణ గుండెల్లో రాయి పడ్డట్లయింది. ఈ శనిగాణ్ణి ఎలా వదిలించుకోవాలో తెలియక కాస్సేపు ఆలోచనలో కొట్టుమిట్టాడి ఏదో స్ఫురణకి వచ్చిన వాడై అన్నాడు.

"నాయనా ఏదీ నీ చేయి ఓ మారు చూపించు !" అంటూ చేయి చూసి, "ఆహా హా! ఏమీ హస్త వాసండి మీది ? మహార్జాతకము ! మీకు ద్వితీయ కళత్రయోగముంది ! ఆమె వల్ల మీకు ఆస్తి చేకూరబోతోంది. ఈ సంవత్సరంలోనే నీ వివాహం జరుగుతుందని స్పష్టంగా తేలుతోంది ఈ చేతిలో !"

లక్ష్మీనారాయణ మాటలకు ఉబ్బితబ్బిబ్బయిన ఆ రైల్వే ఉద్యోగి, "స్వామీ ! మీరు మా ఇంటికి దయచేయండి ! మా ఆతిథ్యం తప్పక స్వీకరించాలి."

"వీడు నన్ను ఒదిలి పెట్టేట్టు లేదు. ఏదో విధంగా నన్ను 'ట్రాప్' చేసేట్లున్నాడు. కొంపదీసి మారువేషయంలో వున్న సి.ఐ.డి నా !" అలా అనుకోగానే గుండె జలధరించినట్లయింది ! శరీరమంతా ముచ్చెమటలు పట్టాయి. ఎత్తుకు పై ఎత్తు వేయాలి అని మనసులో అనుకుని పైకి ఇలా అన్నాడు.

"మీ ఆతిథ్యం తప్పక స్వీకరిస్తాం. అయితే ఇప్పుడు కాదు. నీవు జంటగా అయినప్పుడు! ప్రస్తుతానికి పండో, ఫలమో యిస్తే పుచ్చుకుంటాం !"

"తప్పక స్వామి !' అంటూ తన క్రింది ఉద్యోగితో పళ్ళు తెప్పించి లక్ష్మీనారాయణ చేతిలో పెట్టాడు. పళ్ళతో పాటు దక్షిణ కూడా !

"ఎందుకిది ! మాకు ధనంపై వ్యామోహం లేదు."

"ఫర్వాలేదు. వుంచండి స్వామీ ! దారి ఖర్చులకు పనికి వస్తాయి. అన్నట్టు మీర్కెడికి వెళ్ళాలనుకుంటున్నారు స్వామీ ?"

తడుముకోకుండా చెప్పాడు పింగళి లక్ష్మీనారాయణ "కన్యాకుమారి !"

"అక్కడికి వెళ్ళే రైలు ఇంకో గంటలో వస్తుంది ! దగ్గరుండి మిమ్మల్ని ఎక్కిస్తాను ... స్వామీ మళ్ళీ తమ దర్శనమెప్పుడో ?"

"నీ పెళ్ళి నాటికి ! నేనెక్కడున్నా వస్తాను !"

"చాలా సంతోషం స్వామీ !"

ఓ గంట గడిచింది !

కన్యాకుమారి వెళ్ళే రైలు రాగానే, అన్న మాట ప్రకారం దగ్గరుండి రైలెక్కించాడు ఆ రైల్వే ఉద్యోగి !

రైలు కదిలాక తేలిగ్గా నిట్టూర్చి "బ్రతుకు జీవుడా !" అనుకున్నాడు పింగళి లక్ష్మీనారాయణ.

(పింగళి లక్ష్మీనారాయణ సింహళం, బర్మాలు తిరిగి కేసు పోయిం తర్వాత వచ్చి ఉద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళారు. స్వామి నారాయణానంద సరస్వతిగా మారారు.)

*　　　　*　　　　*

మిట్ట మధ్యాహ్నపు మండుటెండ !

తన మెడకు ఇరువైపులా తగిలించబడిన కొయ్య వల్ల, తల వాల్చడానికి వీలులేకపోయింది! సూర్యకిరణాలు నేరుగా కళ్ళలోకి ప్రసరిస్తూ వుండడం వల్ల కనుగుడ్లు కాలిపోతున్నట్లనిపించాయి హరిసర్వోత్తమరావుకు ! శక్తి వుడిగి పోయేంత వరకు కొరడాలతో కొట్టి గానుగ లాగించారు సెంట్రీలు !

ప్రత్యక్ష నరకమది !

ఆ నరకానికి ఇంకా అలవాటు పడని హరిసర్వోత్తమరావు స్పృహతప్పాడు. నాలుగు కొరడా దెబ్బలు కొట్టినా, కదలిక లేకపోయేసరికి, 'కొంపదీసి చచ్చాడా ?" అన్న అనుమానమొచ్చిన సెంట్రీ, హరిసర్వోత్తమరావుకు చేరువగా వెళ్ళి ముక్కు దగ్గర వేలుంచి "శ్వాస ఆడుతోంది. బ్రతికేవున్నాడు. ఈ పూటకు ఈ శిక్ష చాలు." అనుకుంటూ హరిసర్వోత్తమరావుకు తగిలించిన కాడిని విప్పదీసి, అతన్ని సెల్‌లో వేశాడు. స్పృహ వచ్చాక తినేందుకు మట్టి చట్టిలో రాగిముద్ద, రాగులు శుభ్రం చేయనందున ముద్ద నిండా పుల్లలు, రాళ్ళున్నాయి. దానితో పాటు వుడికి వుడకని పల్చటి చారునీళ్ళు పోశారు. నీళ్ళు తాగేందుకు ఓ మట్టి ముంత, మల మూత్రవిసర్జనకు

గాను ఆకు దోనె వంటి మరొక మట్టి చట్టి, మూరెడు పొడవున్న రెండు తువాళ్ళు, పడుకునేందుకు ఈతచాప, పెట్టివెళ్ళారు. సంకెళ్ళను మాత్రం తొలగించలేదు.

ఓ గంట సేపటి తర్వాత స్పృహలోకి వచ్చిన హరిసర్వోత్తమరావు తన పక్కన వుంచబడిన వాటన్నింటిని చూసి 'తన నిత్య కృత్యాలకు ఇవే ఆధారాలు కాబోలు అనుకొంటూ, ఈగలు ముసురుకున్న రాగిముద్ద వంక చూశాడు. ఆ ముద్దను చూడగానే పోతున్న ప్రాణం లేచి వచ్చినట్లనిపించింది ! ఆత్రంగా ఆ ముద్దను అందుకొని ఆబగా మింగబోయాడు. పుల్లలు నోటికి అడ్డం పడ్డాయి. గబగబ, ముద్దలోని పుల్లలను, రాళ్ళను ఏరి ముద్దను చారులో కలిపేసి ఒక్కసారే జుర్రుక తాగేశాడు. అయినా అతని ఆకలి తీరలేదు. సెంట్రీని పిలిచి 'ఇంకో ముద్ద కావాలి' అని అడుగాలనిపించింది. కాని అడగలేకపోయాడు ... మట్టిముంతలో వున్న నీళ్ళను గడగడ తాగేశాడు. కొద్దిగా కడుపు నిండినట్టనిపించింది ! హరిసర్వోత్తమరావు పరిస్థితిని ఎదురు సెల్ నుంచి గమనిస్తున్న ఓ వ్యక్తి జాలిగా అలాగే చూస్తుండి పోయాడు.

# 12

కేశవరావు తన మనవడిని ఎత్తుకొని ముద్దాడుతూ కూతుర్ని ఉద్దేశించి చెప్పాడు.

"అమ్మడూ వీడచ్చం మీ ఆయన పోలికేనే ! ఈ కళ్ళూ ... ముక్కు ... జుత్తు ..."

చిన్నగా నవ్విన రామాబాయి ... కనుకొలుకుల్లో కన్నీరు ! ఆ కన్నీటి వెనుక వున్న బాధను ... అర్థం చేసుకున్న కేశవరావు, కూతురి కళ్ళను తుడుస్తూ అన్నాడు.

"ఏం చేద్దామమ్మా ! నీ రాత ఇలా వుంది !"

"నాన్నా !" తండ్రి వంక ఆశగా చూసింది రామాబాయి !

"ఏమ్మా ?" ప్రేమగా కూతురు తల నిమురుతూ అడిగాడు కేశవరావు.

"వారి నొక్కసారి చూడాలనివుంది. వెళ్దామా నాన్న ?"

"అలాగే నమ్మ ! తప్పక వెళ్దాం ! అల్లుడికి ఈరోజే ఈ బుజ్జిగాడు పుట్టిన విషయం గురించి ఉత్తరం వ్రాశాను. అతని దగ్గర్నుంచి సమాధానం వచ్చాక వెళ్దాం !"

తండ్రి సమాధానం విన్న రామాబాయి నిరాశగా నిట్టూర్చింది !

"నాకు మాత్రం అల్లుడ్ని చూడాలని లేదటమ్మా ! మన ఉత్తరానికి బదులు వస్తే, అక్కడి పరిస్థితులు ఎలా వున్నాయో తెలుస్తాయి ... అందాక ఓపిక పట్టడం అవసరం ... అయినా ఎన్నాళ్ళు ! ఉత్తరం చూడగానే వెంటనే బదులు ఉత్తరం వ్రాసెయ్యడూ ! అంతగా బదులు రాకపోతే మనమే వెళ్దాం ! సరేనా !"

కూతురు ఆరాటాన్ని తగ్గించే ప్రయత్నం చేస్తూ అన్నాడు కేశవరావు. తండ్రి చెప్పింది విన్న రామాబాయి మౌనంగా, బోసి నవ్వులు నవ్వుతూ తన లోకంలో మునిగి వున్న కొడుకు వంక చూస్తుండిపోయింది !

కూతురున్న గదిలో నుంచి బయటి కొచ్చిన కేశవరావు, వంటిట్లో వున్న భార్యను కేకేసి చెప్పాడు.

"నేను పెన్షన్ కోసం మదనపల్లికి వెళ్ళొస్తాను."

"త్వరగా రండి ! వచ్చేటప్పుడు బుజ్జిగాడికి ఏదైనా ఆట వస్తువులు పట్రాండి !" అంది ముఖానికి పట్టిన చెమటను చీరె చెరుగుతో తుడుచుకొంటూ వీణాబాయి.

"వాడింకా నెల్లాళ్ళు కూడా నిండని పసిగుడ్డే! ఆట వస్తువులతో వాడేం ఆడుకొంటాడు."

"ఇప్పుడు కాకున్నా ఇంకొన్నాళ్ళ కయినా కావాలిగా ! తెండి !" భర్తవంక చూస్తూ అంది వీణాబాయి.

"సరే ! అలాగే తెస్తాను గాని, నా కండువా ఇలా తే !" అంటూ భార్య లోపలి గదిలోంచి తెచ్చి ఇచ్చిన కండూవాను భుజంపై వేసుకుంటూ చెప్పాడు.

"అమ్మాయికి అల్లుడు పదే పదే గుర్తొస్తున్నాడు. కాస్త ఓదార్చు !"

"సర్లేండి ! అది కూడా నాకు తెలియదా ! భలేవారే !" అంటుండగానే మనవడి ఏడుపు వినిపించి, "వస్తున్నారా బుజ్జీ !" అంటూ వడివడి అడుగుల్తో ముందుకు నడిచింది వీణాబాయి.! తనవేపైనా చూడకుండా వడివడి అడుగుల్తో నడిచి వెళ్తున్న భార్యని చూచి 'మనమడిపై ఎంత ప్రేమ' అనుకుంటూ బయటికి అడుగువేశాడు, సంవత్సరం క్రితం రెవెన్యూ ఇన్‌స్పెక్టర్‌గా రిటైర్డ్ అయిన కేశవరావు.

* * *

సమయానికి సుబ్బడి బండి వూర్లోలేనందుకు, నడవక తప్పలేదు కేశవరావు ! మదనపల్లి చేరే సరికి ఉదయం పదిగంటలు దాటింది ! మనవడికి ఎలాంటి బొమ్మలు కొనాలో ఆలోచిస్తూ పెన్షన్ కోసం నేరుగా తాలూకా ఆఫీసుకు వెళ్ళి తనకు పెన్షన్ ఇచ్చే గుమాస్తా దగ్గరికి వెళ్ళాడు.

కేశవరావుని చూడగానే అతని ముఖం మ్రాన్పడిపోయింది ! అయినా మర్యాద కోసం 'కూర్చోండి !' అంటూ తన టేబుల్ ఎదురుగా వున్న కుర్చీని చూపించాడు. కుర్చీలో కూర్చున్న కేశవరావు అతని వంక చూస్తూ చిరునగవుతో అన్నాడు.

"కాస్త త్వరగా పెన్షన్ డబ్బులు ఇవ్వవయ్యా ! నా మనవడికి కొత్త చొక్కా, బొమ్మలు కొనాలి ! మునుపటిలా నీతో తీరుబడిగా కూర్చుని మాట్లాడటానికి టైం లేదు !"

"కేశవరావు గారూ ! మీకెలా చెప్పాలో తెలియటం లేదు."

స్నేహం కొద్దీ అన్నాడు, "నాకేం చెబుతావయ్యా ! త్వరగా పెన్షన్ డబ్బులు ఇమ్మంటుంటేను !"

"పెన్షన్ విషయమేనే చెప్పేది ? ఇకపై మీకు పెన్షన్ రాదు !"

"ఏం ? సరదాకంటున్నారా ! పెన్షన్ రాకపోవడమేమిటి ?"

"నిజమే చెబుతున్నాను. మీకు పెన్షన్ ఇవ్వరాదని, నిన్ననే మద్రాసు నుంచి ఆర్డర్స్ వచ్చాయి !"

హతాశుడయ్యాడు !

కళ్ళు తేలిపోయినట్లయ్యాయి !!

తన కాళ్ళ క్రింది భూమి కదిలినట్లయింది !!!

స్పృహ తప్పి క్రింద పడిపోయాడు కేశవరావు ఆఫీసులో ! ఇతని పరిస్థితికి జాలిపడ్డ ఉద్యోగులు ఆయనను తెప్పరిల్లేలా చేశారు, కాస్సేటికి !

తరువాత బోధపడింది కేశవరావుకు కారణం !

అల్లుడు రాజద్రోహ నేరం క్రింద జైలుకు వెళ్ళినందుకు ! విడ్డూరమనిపించింది కేశవరావుకు!

"అల్లుడు జైలుకెళితే - నా పెన్షన్ ఎందుకు రద్దు చేస్తారు ?"

"సాక్షాత్తు హరిసర్వోత్తమరావు మీ అల్లుడైనందుకు ! కావాలంటే, పై నుంచి మాకు అందిన ఆర్డర్ చూడండి !" అంటూ టేబుల్ సొరగు లోనుంచి ఓ కాగితం తీసి కేశవరావు ముందుంచాడు గుమాస్తా !

ఆ ఆర్డరు చదవగానే కేశవరావు ముఖం వివర్ణమయ్యింది. మౌనంగా ఆర్డరు కాగితం వెనక్కు ఇచ్చేసి, భారమైన అడుగులతో ఆఫీసు నుంచి బయటికి నడిచాడు.

కేశవరావు పరిస్థితి గమనించిన గుమాస్తాలకు జాలి వేసింది ! అంతలోనే కొద్దిపాటి ఆవేశం ముంచుకొచ్చింది, అతనిపై కాదు, అతని అల్లుడైన హరిసర్వోత్తమరావుపై !

"తా చెడ్డ కోతి, వన మెల్ల చెరుచు !" అంటే ఇదే ! పెద్ద మొనగాడిలా ప్రభుత్వాన్ని ధిక్కరిస్తాడా ? ఇప్పుడు చూడు ! ఎలాంటి పరిస్థితిని కలిగించాడో ?"

సగటు మనుషుల దృక్పథంలో హరిసర్వోత్తమరావు చేసింది తప్పే అనిపిస్తుంది !

* * *

మధ్యాహ్నం లోపే తిరిగి ఇల్లు చేరుకున్న కేశవరావును చూస్తూ అంది వీణాబాయి.

"మనవడిపై మమకారం పుట్టుకొచ్చినట్లుందే" అంటూ తన ఒడిలో వున్న బుజ్జిగాణ్ణి చూస్తూ ముద్దు పెట్టుకొని, "మీ తాతయ్యను లాక్కొచ్చేవు గదరా ! లేకుంటే ఏ పొద్దు గూకే వేళకో ఇల్లు చేరేవారు !" అంటూ మనవడిని మరిన్ని ముద్దులతో ముంచేసింది.

భర్త వేపు నుండి ఎలాంటి సంబరపు మాట రాకపోయే సరికి వెను తిరిగి, దిన్నుకై కూర్చున్న భర్తను చూస్తూ అడిగింది వీణాబాయి !

"ఏం జరిగిందండి ? ఎందుకిలా వున్నారు ?"

జరిగింది పూసగుచ్చినట్లు చెప్పాడు కేశవరావు. భర్త చెప్పింది విన్న వీణాబాయి కళ్ళలో కూడా ఆవేదన కదలాడింది !

"ఇప్పుడెలాగండి ?" అంటూ భర్త వంక ప్రశ్నార్థకంగా చూసింది వీణాబాయి.

"కష్టాన్ని కల్గించిన వాడు, అవి తీరే మార్గం కూడా చూపించకపోడు ! ఈ విషయాలన్నీ ఏవీ అమ్మాయికి తెలియనివ్వకు. బాధకు మరింత బాధను కల్గించిన వారమౌతాం !" అంటూ ఈజీ చైర్లో వాలిపోయి ఆలోచిస్తూ వుండిపోయాడు కేశవరావు.

* * *

జైల్లో గంట గణగణమంటూ మ్రోగింది ! ఖైదీలను వుంచిన కారాగారపు గదుల తలుపులు భళ్ళున తెరుచుకున్నాయి. గంప క్రింది కోళ్ళలా, ఖైదీలందరూ బిలబిలమంటూ బయటికి వచ్చారు. హరిసర్వోత్తమరావు కూడా ! ఖైదీలందరూ జైలు ఆవరణలో ఓ మూల పెద్దకుండలో వుంచిన మెత్తని మన్నును తీసుకొని పళ్ళు తోముకో సాగారు !

"మట్టితో పళ్ళు తోముకోవడమేమిటి ?" ఖైదీల వంక విస్తుపోయి చూశాడు హరిసర్వోత్తమరావు.

క్రితం రోజు నుంచి హరిసర్వోత్తమరావు స్థితిని గమనిస్తోన్న ఓ ఖైదీ అతని చెంత కొచ్చి చెప్పాడు.

"ఇక్కడ పళ్ళు తోము కోవడానికి మన్నేవాడాలి ! ఇది ఇక్కడి జైలు అధికారులు విధించిన ఆంక్ష ! వేప పుల్లలు కాని, బొగ్గు కాని వాడరాదు."

"పళ్ళు తోము కోవడంపై కూడా ఆంక్షనా ?"

'ఏం చేద్దాం ! తెల్ల నా కొడుకుల పరిపాలనకు, నల్ల నా కొడుకులు తాళం వేస్తున్నారు.'

కాస్త మొరటుగా అన్నా, అతదన్న దానిలో నిజం లేక పోలేదు. హరిసర్వోత్తమరావు అతని వంక పరిశీలనగా చూశాడు.

రేగిన జుట్టు, బుంగురు మీసాలు, వెడల్పాటి ముఖం ... ఎత్తయిన నల్లటి విగ్రహం !

"ఏం సారో అట్లా చూస్తున్నారు !" గట్టిగా నవ్వుతూ అడిగాడు అతను !

"నీ పేరేమిటి ?"

"ఎరికల సుంకడు. తెలుగొడినేలే !"

"ఏం నేరం చేశావు ?"

"అబ్బో శానా చేశాలే !"

"చాలా చేశావా ?"

"ఔను. దొంగతనాలు, దోపిడీలు ..."

"అంటే నువ్వూ ... ?"

"బందిపోటును ?"

అతనలా సమాధానం చెప్పాక, మౌనంగా అతని వంక చూస్తుండి పోయాడు హరిసర్వోత్తమరావు అతను చెప్పేది వింటూ !

"నేనొక్కణ్ణే కాను సారో, ఇక్కడున్న వాళ్ళంతా నాలాంటి నా యాళ్ళే ! ఖూనీ కోర్లు ..., వగాకోర్లు ... మీరొక్కరే సదువుకున్నోరు !"

తాను రాజకీయ ఖైదీ అయినా, హంతకుల, చోరుల మధ్య శిక్ష అనుభవించి రావడం హరిసర్వోత్తమరావుకు ఆశ్చర్యమనిపించింది.

"ఏంటీ సారో అలా ఆశ్చర్యపోయి చూస్తున్నారు ?"

"అబ్బే ... ఏం లేదు !"

హరిసర్వోత్తమరావు అడగకున్నా తానే చెప్పుకొచ్చాడు ఎరికల సుంకడు.

"జైలు కొచ్చిన కాడ్నుంచి మూన్నెళ్ళ దాకా, గానుగ పనే ... రాళ్ళు కొట్టడం ... ఆనక ఎచు తీయడం ... కంబళ్ళు నేయడం లాంటివి చేయిస్తారు. మరి మీరు మూన్నెల్ల దాకా ఈ గానుగ లాగక తప్పదు."

హరిసర్వోత్తమరావు ఏదో అడగబోతున్నంతలో ఓ సెంట్రీ, వారి మధ్య కొచ్చి తన చేతిలోని లాఠీతో ఇద్దరిపై నాలుగు అంటించి సుంకడి వంక చురచుర చూస్తూ చెప్పాడు.

"ఈడితో ఏంట్రా నీకు మాటలు ? ఈడు నీలా దోపిడీ దొంగ కాడు. అంతకంటే ప్రమాదమైనోడు. వీడికి దూరంగా వుండు ! లేదా కబడ్దార్" అంటూ లాఠీ ఝుళిపించాడు.

ఎరికల సుంకడు మౌనంగా తల ఆడించాడు.

"ఫో ... వెళ్ళు ?" అంటూ గద్దించి హరిసర్వోత్తమరావు కేసి చూస్తూ చెప్పాడు.

"త్వరగా ముఖం కడుక్కో ! నిన్ను కాడికి కట్టాలి."

"స్నానం చేసి వస్తాను."

"రోజూ స్నానం చేయడానికి ఇది నీ బాబు గాడి ఇల్లు కాదు. ఇక్కడ నెల రోజుల కొక్కసారే స్నానం !"

'వాడితో ఎందుకు మాట్లాడ్డం ? వెళ్ళి ముఖం కడుక్కో" అన్నట్టుగా దూరం నుంచే కనుసైగ చేశాడు ఎరికల సుంకడు.

కాలకృత్యాలు తీర్చుకున్న తర్వాత ... మళ్ళీ రాగి సంకటి ! పల్చటి చారు ! చారులో బొద్దింకలు చచ్చి పడుండం గమనించిన హరిసర్వోత్తమరావు సెంట్రీని పిలిచి వాటిని చూపిస్తూ కోపంగా అన్నాడు.

"అసలు మీ కళ్ళకు ఇక్కడున్న వాళ్ళు ఎలా కనిపిస్తున్నారు ? ఖైదీలకు తిండి పెట్టే విధానం ఇదేనా ? కనీసం రాగుల్నయినా శుభ్రపరచరా ? ఖైదీలయినంత మాత్రానా, మీరేం చేసినా చూస్తూ వూరికే వుండాలా ? అలా ఎన్నటికీ జరుగదని గుర్తుంచుకోండి ?"

హరిసర్వోత్తమరావు చెప్పిన మాటల్ని, వార్డర్ దగ్గరకు వెళ్ళి వినిపించి చెప్పాడు సెంట్రీ.

"వీడు ఖైదీలలో కూడా తిరుగుబాటు లేవదీసేలా వున్నాడు."

"ఎందుకు లేవదీయడు ? లేవదీస్తాడూ ... చదువుకొన్నాడుగా ... అందుకనే ఆ పొగరు. ఆ పొగరు దించితే చచ్చినట్లు మనదారికి వస్తాడు. వెళ్ళి వాడ్ని పట్రా !" అంటూ హుకుం జారీ చేశాడు వార్డర్ !

"యస్ సార్" అంటూ వెళ్ళిన ఆ సెంట్రీ, మరో ఇద్దరు సెంట్రీలను తోడు తీసుకుని హరిసర్వోత్తమరావును వార్డర్ దగ్గరకు లాక్కొచ్చారు.

"ఏరా వొళ్ళు కొవ్వెక్కిందా ? ఏవేవో పేలుతున్నావంటా !"

"మర్యాదగా మాట్లాడటం నేర్చుకోండి ! ఏవేవో ఎందుకు పేలుతాను ? ఉన్నదే అన్నాను. మీరిచ్చే తిండి, పశువులకు కూడా పెట్టరు. బొద్దింకలను కూడా చూడకుండా అలాగే వొండి మాకు వొడ్డిస్తుంటే, మా ఆరోగ్యాలు ఏం కావాలనుకున్నారు ? ఇది పాశవిక చర్య కాదా ?"

"అచ్చంగా పాశవిక చర్యే ! ఆ చర్య రుచి నిన్న కొద్దిగా మాత్రమే చూశావు. ఇప్పుడు పూర్తిగా చూద్దువు గానీ ... రేయ్ వీడి గోచీ విప్పండి !"

ఎంతగా గింజుకున్నా, హరిసర్వోత్తమరావు బలం చాలలేదు. సెంట్రీలు అతని వొంటిపైని గోచీ లాగేశారు ! నగ్నంగా తయారయ్యాడు హరిసర్వోత్తమరావు.

"చీకటి కొట్టు దగ్గరికి తీసుకురండి !" అంటూ ముందుకు నడిచాడు వార్డర్ !

నలుగురు సెంట్రీలు హరిసర్వోత్తమరావును చీకటి కొట్టు దగ్గరికి లాక్కొచ్చి అందులోకి నెట్టారు.

అయిదడుగుల వెడల్పు, మూడడుగుల పొడవు మాత్రమే వుంది ఆ చీకటి కొట్టు !

"మూసెయ్యండి ?"

చీకటి కొట్టు తలుపు మూసుకొంది !

గది లోపల వూపిరి ఆడదానికి ఏ మాత్రం అవకాశం లేదు. కటిక చీకటి !

కాసేపటి తర్వాత వూపిరి పీల్చడం కూడా కష్టమైపోయింది హరిసర్వోత్తమరావుకు !

"తలుపు తెరవండి ! నాకు ఊపిరి ఆడ్డంలేదు." అంటూ ప్రాణభయంతో అరిచిన అరుపులకు సెంట్రీలు 'శాస్తి బాగా జరిగింది' అనుకుంటూ నవ్వుకోసాగారు.

'పిల్లికి చెలగాటం ఎలుకకు ప్రాణసంకటం' అంటూ భారంగా నిట్టూర్చారు తోటి ఖైదీలు!

గడిచే ప్రతి నిముషం, నరక ప్రాయమైంది హరిసర్వోత్తమరావుకు !

పిచ్చి పట్టిన వాడిలా గట్టిగా అరుస్తూ తలుపులను బాదసాగాడు. ప్రాణవాయువు అందడం తగ్గగానే ఎగశ్వాస మొదలయ్యింది ! ఎగశ్వాస పీలుస్తూనే స్పృహ తప్పాడు హరిసర్వోత్తమరావు.

లోపల్నించి అరుపులు వినపడక పోయేసరికి చచ్చాడేమో అన్న అనుమానంతో వెంటనే చీకటి గదికి వేసున్న తాళం తీసి, అతన్ని ఈడ్చుక వచ్చి గాలి, వెలుతురు వచ్చే సెల్‌లో పడేశారు సెంట్రీలు.

అదే సమయంలో ...

ఖైదీల పేరిట వచ్చిన ఉత్తరాల్ని చింపి చదవడంలో నిమగ్నమయి వున్న జైలు వార్డర్, హరిసర్వోత్తమరావు పేర, కేశవరావు వ్రాసిన ఉత్తరం చేతికందగానే అబగా ఉత్తరాన్ని చించి చదివాడు. అందులో వ్రాసింది కుటుంబ సంబంధమైన వ్యవహారం కాబట్టి ... "ఇవ్వొచ్చు' అనుకున్నవాడై ఓ సెంట్రీని పిలిచి "ఈ ఉత్తరాన్ని ఆ రాజకీయ ఖైదీ ముఖాన కొట్టిరా" అంటూ అతని చేతికందించాడు. అతను ఉత్తరాన్ని తీసుకుని వెళుతుండగా, ఓ ఆలోచన వచ్చినవాడై "ఆ ఉత్తరాన్ని ఇటివ్వూ !" అని తిరిగి ఇప్పించుకొని చూచి పక్కనే వున్న చెత్తబుట్టలో విసిరేస్తూ 'నువ్వెళ్ళు' అన్నాడు.

వార్డర్ వింత ప్రవర్తనకు విస్తుపోయిన ఆ సెంట్రీ మనసులో 'వీడో తిక్కనా కొడుకు' అని తిట్టుకుంటూ వెళ్ళిపోయాడు.

* * *

నెల ! ...

రెన్నెల్లు !! ...

మూన్నెల్లు !!! ... గడిచాయి ...

అయినా తను వ్రాసిన ఉత్తరానికి సమాధానం రాకపోయే సరికి, ఆందోళన చెందిన కేశవరావు ఓ రోజు కూతురితో చెప్పాడు.

"అక్కడి పరిస్థితి గురించి నా కనుమానంగా వుందమ్మా ! మనమే ఓ మారు అక్కడికి వెళ్ళొస్తే బాగుంటుంది."

"అలాగే నాన్నా !" ఉత్సాహంగా తలూపింది రామాబాయి. ప్రభుత్వం పెన్షన్ ఆపుచేయడంతో, రాబడిగా వున్న కొద్దిపాటి పొలంపైనే అప్పుచేసి ప్రయాణానికి సన్నాహాలు చేశాడు కేశవరావు. భార్యతో, మనవడితో, కూతురితో రెండ్రోజుల ప్రయాణం చేశాక, రాయవెల్లూరు చేరుకున్న కేశవరావు సెంట్రల్ జైలు దగ్గరకి వెళ్ళాడు. ప్రవేశ ద్వారం వద్ద కాపలా వున్న సెంట్రీ వారిని అడ్డుకొంటూ అనుమానంగా ప్రశ్నించాడు.

"ఎవరు మీరు ?" అంటూ

తామెవరైందీ ఆ సెంట్రీతో చెప్పాడు కేశవరావు.

"ఇక్కడే వుండండీ ! వార్డన్ గారితో చెబుతాను. వారు రమ్మంటేనే లోపలికి వెళ్ళవలసి వుంటుంది."

"అలాగే !" అన్నట్టు తలూపాడు కేశవరావు.

ఓ అయిదు నిముషాల తర్వాత బయటి కొచ్చిన ఆ సెంట్రీ, "పిలుస్తున్నారు. వెళ్ళండి !"

"చాలా సంతోషం బాబు !" అంటూ భార్యను, కూతుర్ని, 'తన వెంటరండి' అంటూ సైగ చేస్తూ లోపలికి వెళ్ళాడు.

తన చెంతకొచ్చిన కేశవరావు వంక పరీక్షగా చూస్తూ అన్నాడు వార్డర్.

"ఆ రాజద్రోహిని చూడటానికి ఇంత దూరం వచ్చారా ?"

"తప్పదు కద బాబూ ? బంధం వున్నప్పుడు ఎంత దూరం నుంచి అయినా రాక తప్పదు."

"అతని చూడటానికి గాని, మాట్లాడడానికి గాని ఎవ్వర్నీ అనుమతించరాదని మాకు పై నుంచి ఉత్తర్వు ... కాబట్టి మీరిక వెళ్ళొచ్చు !"

వార్డర్ సమాధానం విన్న కేశవరావు, అతని భార్య, కూతురు హతాశులయ్యారు.

"బాబూ ! ... మమ్మల్ని దయతో కనికరించండి ! చాలా దూరం నుంచి వచ్చాం ! కాస్సేపు మాట్లాడివెళ్తాం. ఒక్క అయిదు నిముషాలు చాలు !"

"అదేం కుదర్దు ?"

"బాబూ ... ఇవి చేతులు కావు. కాళ్ళనుకో !" అంటూ ప్రాధేయపడసాగాడు కేశవరావు.

అతని ప్రాధేయతకు పక్కన వున్న సెంట్రీల హృదయం కరిగిందే కాని, వార్డర్ మనసు మాత్రం కరుగలేదు. చివరకు సెంట్రీల్లోనే ఒకడు కాస్త ధైర్యం చేసి చెప్పాడు.

"సార్ పాపం ! చాలా దూరం నుంచి వచ్చారు. మాట్లాడనీయకుండా దూరం నుంచయినా చూపిద్దాం సార్ !"

అతను చెప్పిందానికి, మిగితా సెంట్రీలు కూడా బలపరిచే సరికి 'సరే' అనక తప్పలేదు వార్డర్ కి!

"దూరం నుంచే చూపించి... పంపండి ! మాట్లాడిచ్చినట్లు తెలిసిందా మీ డొక్కలు చించి డోలుకు కట్టిస్తాను."

"అలాగే !" అంటూ ఓ సెంట్రీ, 'రండి !' అంటూ వారిని జైలు ఆవరణలోకి తీసుకెళ్ళాడు.

రామాబాయిలో ఉద్వేగం ! ఖైదీలందరి వంక పరీక్షగా చూస్తూ అంది తండ్రితో !

"వారు కనిపించడం లేదు నాన్నా !"

"అదిగో అక్కడున్న కాడిని మోస్తూ, గానుగను తిప్పుతున్నారే అతనే మీ భర్త !" అంటూ వేలు పెట్టి చూపించాడు, వెంట వచ్చి సెంట్రీ !

గుండు గీయబడి, గోచి గుడ్డతో ... మండుటెండలో ... సంకెళ్ళ మధ్య ... గానుగను తిప్పుతోన్న భర్తను చూడగానే రామాబాయికి దుఃఖం వరదలా పొంగుకొచ్చి ఏడ్చేసింది !

"ఏడుపు తగ్గించమ్మా ... మా వార్డర్ వింటే లేనిపోని తంటా వస్తుంది ... మీ రిక్కడే వుండండి ! మీ రొచ్చిన విషయం అతనికి చెప్పొస్తాను." అంటూ వడివడి అడుగులతో హరిసర్వోత్తమరావు దగ్గరకి వెళ్ళి చెప్పాడు.

"నిన్ను చూడటానికి నీ భార్య, అత్తామామగారు వచ్చారు !"

"నిజంగా !" అన్నట్టు అతని వంక చూశాడు.

"అదుగో ! అటు వైపు చూడు !"

అతను చెప్పిన దిశకు దృష్టి మరల్చాడు హరిసర్వోత్తమరావు. ఓ ఇరవై అడుగుల దూరంలో నిల్చోన్న తన వారిని చూడగానే హరిసర్వోత్తమరావుకు కూడా కన్నీరు ఆగింది కాదు. కన్నీరు కారుస్తూనే వారి వంక చూస్తుండిపోయాడు.

"ఎలా వున్నారు ?" కళ్ళతోనే ప్రశ్నించింది రామాబాయి.

"చూస్తున్నావుగా ..." అన్నట్లుగా ఆ చూపులు.

"బాబండీ ... మన బాబు ... " పిల్లవాడ్ని చూపించింది రామాబాయి.

బోసి నవ్వులు చిందిస్తూ తనవంకే చూస్తోన్నట్లున్న తన కొడుకును చూడగానే పుత్ర ప్రేమ ఎదలో నుంచి పొంగి పొర్లింది. కాని ... దరి చేర్చుకొని ముద్దాడే అవకాశం ఏదీ ?

"ఎలా వున్నాడు ?" కను చూపు ప్రశ్న ?

"బాగున్నాడు ... ఎర్రగా ... బొద్దుగా అచ్చం మీ పోలికే !" కనుచూపుతోనే జవాబు.

కన్న తండ్రి అయివుండి, కన్నబిడ్డ కళ్ళెదుట వుండి కూడా ... అక్కున చేర్చుకొని తనివి తీరా ... స్పృశించలేని దౌర్భాగ్యస్థితి ?

ఓ పది నిముషాలు గడిచాయి ...

వార్డర్ తన గదిలో నుంచి ఆర్డరు జారీ చేశాడు.

"వారిని బయటికి పంపు !"

ఆర్డరు అమలు చేయక తప్పలేదు సెంట్రీలకు !

"వెళ్ళండమ్మా ... మీరు ఇంకాస్సేపు వుంటే వార్డర్ మా భరతం పడతాడు."

"వెళ్ళొస్తానండీ !" భార్య దీనమైన చూపు

"వెళ్ళొస్తాం బాబూ !" అత్తామామల దైన్యపు చూపు.

"వెళ్ళొస్తాం నాన్నా !" బుజ్జిగాడి బోసినవ్వు చూపు !

తన నుంచి కన్నీటి వీడ్కోలు తీసుకుని వెళ్తున్న తన వారి వంక అలాగే కన్నార్పకుండా చూస్తుండిపోయాడు హరిసర్వోత్తమరావు.

జైలు గోడల మధ్య నుంచి బరువెక్కిన హృదయంతో బయటి కొచ్చిన తర్వాత 'నాన్నా!' అంటూ భోరున ఏడ్చేసింది రామాబాయి.

"వూరుకోమ్మా వూరుకో ..." అంటూ తాను కూడా లోలోపల కుమిలిపోతూనే కూతుర్ని ఓదార్చే ప్రయత్నం చేశాడు కేశవరావు.

బుజ్జిగాడు మాత్రం ఏడుస్తున్న తల్లివంక చూస్తూ నవ్వులు చిందించాడు !

# 13

ఆరు నెలలు గడిచిపోయాయి !

నూనె గానుగ, తిప్పే పని నుంచి కంబళ్ళు నేసే పనికి మార్చారు హరిసర్వోత్తమరావుని. దాంతో పాటు మూడు నెలలకో ఉత్తరం వ్రాసుకునే అవకాశం ఇచ్చారు ! కంబళ్ళు నేయడంలో నేర్పు సంపాదించిన ఎరికల సుంకడు, కంబళ్ళ నేతను నేర్పే విషయంలో హరిసర్వోత్తమరావుకు గురువయ్యాడు ! దాంతో పాటు మిగతా ఖైదీలతో కలిసి మాట్లాడుకునే అవకాశం కూడా కల్పించారు.

తిండిలోనూ, స్నానాది సౌకర్యాలలో, వేషధారణలోనూ మాత్రం ఎలాంటి మార్పు లేకపోయింది. అదే రాగి ముద్ద ! అదే పల్చటి చారు ! ఎప్పటి లాగే అన్నంలో రాళ్ళు, పులుసులో పురుగులు !

ఖైదీలు దీనికి ఒక ఉపాయం కనిపెట్టారు. అన్నం నీళ్ళలో వేసి రాళ్ళను క్రిందికి పోనిచ్చి పైపై అన్నం తినడానికి తెలుసుకున్నారు. ఖైదీలు అలా అన్నం తినడం చూచి సర్వోత్తమరావు

కూడా అలాగే చేశాడు. కాని లాభం లేకపోయింది. పులుసులో వుడికిన పురుగులను ఏరేసిన తర్వాత కూడా తినడానికి సహించలేదు. అయినా తినక తప్పలేదు.

కంబళ్ళు నేసే పని తొందరగా అలవడింది కాదు హరిసర్వోత్తమరావుకు ! ఎరికల సుంకడి సహకారంతో, వీలైనంత తొందరగానే నేర్చుకొనే ప్రయత్నం చేయసాగాడు. ఇద్దరి మధ్య స్నేహం పెనవేసుకుంది !

ఓ రోజు ...

కంబళ్ళ నేత పని నేర్పుతూ అటూ ఇటూ చూస్తూ నెమ్మదయిన స్వరంతో అన్నాడు ఎరికల సుంకడు.

"సార్ !"

"ఏమిటి ?" చీలికలుగా వున్న గొర్రె బొచ్చును తాడుగా పేనుతూ అడిగాడు హరిసర్వోత్తమరావు.

"నరకం లాంటి ఈ జైలు జీవితం ... !" అంటూ నసిగాడు.

"ఊ ... జీవితం ... ఏం చేయాలంటావు ?" ఎరికల సుంకడు వంక చూస్తూ అడిగాడు హరిసర్వోత్తమరావు.

"మనం ఈ బందీఖాన నుంచి తప్పించుకొని పారిపోదాం !"

"చాలా కష్టం !"

"కష్టమనుకుంటే ఏ పని సేయలేం ? మీరు 'ఊ' అనండి ! ఉపాయం నే సెబుతాను!" ఆశగా చూశాడు హరిసర్వోత్తమరావు కళ్ళలోకి !

"పిరికివాడికి మల్లే పారిపోవడమా ! అది నాకు నచ్చదు !"

"మీరేంది 'తిక్కరాజు'కు మల్లే వున్నారే ! సరే మీ ఇష్టం ! నేను మాత్రం ... !"

"పారిపోతాననంటావు !"

"ఔను ! ఈ విషయం సీమకైనా తెలియనియ్యరాదు వూ !" – అతనితో ఏ జవాబు చెప్పక మౌనంగా వుండిపోయాడు హరిసర్వోత్తమరావు.

*   *   *

జైలు నుంచి తప్పించుకొవాలంటే, ఒక్కరి వల్ల సాధ్యం అయ్యే పనికాదు కాబట్టి ఎరికల సుంకడు, తనకు మల్లే దొంగతనాలు చేసి జైలు కొచ్చిన ముత్తయ్య అనే తమిళ వ్యక్తిని మచ్చిక చేసుకున్నాడు. అతనికి తన ఆలోచన చెప్పి, "మరి ఇక్కడి నుంచి తప్పించుకపోదామా ?" అంటూ అడిగాడు.

అతను కూడా అదే వుద్దేశ్యంతో వుండడం వల్ల, ఎరికల సుంకడి ప్రతిపాదనకు ఎగిరి గెంతేసి మరీ ఒప్పుకున్నాడు ! రెండ్రోజుల పాటు జైలు పరిసర ప్రాంతాల్ని గమనించి, తన పథకానికి తుది మెరుగులు దిద్దుకున్న ఎరుకల సుంకడు ముత్తయ్యను పిలిచి చెప్పాడు.

"ఈ రాత్రికే మనం తప్పించుకుందాం ! ఆకాశం మబ్బు పట్టి వుంది. రాత్రివేళకు బాగా వర్షం కురువొచ్చు ! వర్షం వల్ల మనం సులభంగా తప్పించుకపోవడానికి వీలవుతుంది."

"అలాగే !" అంటూ అంగీకారంగా తలూపాడు ముత్తయ్య !

నేత పని నేర్చుకోడానికి తన దగ్గరికి వచ్చిన హరిసర్వోత్తమరావుతో, "సార్ ! ఈ వేళ నా వొంట్లో ఎట్టాగో వుంది. నిన్న చెప్పినట్లుగానే అల్లిక వేయండి !" అంటూ హరిసర్వోత్తమరావును పంపించేశాడు ఎరికల సుంకడు !

ఎరికల సుంకడు ఊహించినట్టుగానే, సాయం వేళకు సన్నగా తుంపర మొదలైంది.

రాత్రి ఏడింటి కల్లా, ఖైదీలకు రాగి ముద్దను తినిపించి ఎవరికి కేటాయించిన గదులలో వారిని పంపి తాళం వేస్తూ వస్తున్నాడు, రాత్రి డ్యూటీ వుండే సెంట్రీ ! ఎరికల సుంకడి దగ్గరి కొచ్చేసరికి, అందులో ముత్తయ్య వుండటం గమనించి అడిగాడు.

"ఇక్కడ వున్నావేం ? నీ సెల్ లోకి వెళ్ళు ?"

"సార్ ! ఒక్కడ్నే పండుకుంటే, ఏవేవో పీడ కలలొస్తున్నాయి. అందుకే ఈడికొచ్చాను. ఈ ఒక్కరాత్రికి ఇతని దగ్గరే పడుకొంటాను !..." అంటూ అభ్యర్థించాడు.

'ఏం తమాషా లాడ్తున్నావా ?" కోపంగా అన్నాడు సెంట్రీ !

"అట్లా అనకండి సార్ ! ఏదో వుంటానంటున్నాడు వుండనివ్వండి !" అంటూ ఎరుకల సుంకడు చెప్పుకొచ్చాడు.

"వాని తరపున వకాల్తా పుచ్చుకొన్నావా ?" ఎరికల సుంకడు వేపు చురచుర చూస్తూ అన్నాడు సెంట్రీ.

"సార్ ! ... ఆ గదిలో ఏదో దయ్యమున్నట్టుంది సార్ ! నిన్న రాత్రి నా గుండెల మీద కూచోనింది సార్ ! ప్యానాలు పోయాయనుకున్నాను !"

దెయ్యం అనగానే సహజంగానే భయస్థుడైన ఆ సెంట్రీ, తన లోపల తెలియని భయం ఆవహించటంతో, "చెబితే విని చావరు వెధవ నాయాళ్ళు ! ఈ c ఇక్కడే పడుకొని చావు !" వారున్న సెల్‌కు తాళం వేసి ముందుకు కదిలాడు ... దయ్యాల గురించిన ఆలోచనలతో!

ఎరికల సుంకడు, ముత్తయ్యలు ఒకరి ముఖాలు ఒకరు చూసుకొంటూ నవ్వుకున్నారు.

తుంపరగా మొదలైన జడివాన, సమయం గడుస్తున్న కొద్దీ, కుంభవృష్టిగా కురియసాగింది! "పథకం అమలు జరుపుదామా ?" అన్నట్టుగా చూశాడు ఎరికల సుంకడి వంక ముత్తయ్య !

"సరే !" అన్నట్టుగా తలూపి, తన చాప క్రింద దాచిన ఇనుకకడ్డీని, ఉలిని బయటికి తీశాడు. ఉలి ఓ నెల క్రితం జైలు ఆవరణలోని మొక్కలకు పాదు చేస్తుండగా దొరికింది. ఇనుపకడ్డీని మాత్రం ... లాఘవంగా వార్డర్ గదిలో నుండి తస్కరించాడు. పథకాన్ని అమలు జరుపబోతుండగా చప్పున గుర్తొచ్చింది ఓ లావుపాటి రాయి కావాలన్న విషయం ! మధ్యాహ్నమే రాయిని తన గదిలోకి చేరుద్దామనుకొన్నాడు. సెంట్రీల చూపు తన వైపే వుండటం వల్ల ఆ పని చేయలేకపోయాడు.

"ఇప్పుడెలా ?" అన్నట్టుగా ఎరుకల సుంకడి వంక చూశాడు ముత్తయ్య !

కాసేపు ఆలోచనలో పడ్డాక, ఎరికల సుంకడి దృష్టి, తమ సెల్‌కు ఎదురుగా ఓ అయిదడుగుల దూరంలో పడి వున్న ఓ బండరాయి పైకి మళ్ళింది ! ఎరికల సుంకడి కళ్ళు మెరిశాయి.

"ఆ బండను మనం లోపలికి లాక్కోవాలి ?"

"ఎలా ?" ప్రశ్నార్థకంగా చూశాడు ముత్తయ్య.

"చెబుతాను !" అంటూ తను వార్డర్ గదిలో నుంచి దొంగిలించిన పొడుగాటి కడ్డీ కొనను వొంచి కొక్కెంగా మార్చాడు. తన గదిలో వున్న తుండు గుడ్డలను పేలికలుగా చేసి వాటిని పొడుగాటి తాడులా పేని కొక్కెంగా మార్చిన ఇనుపకడ్డీకి కట్టాడు. కొక్కేలు విసరడంలో నైపుణ్యం సంపాదించిన సుంకడు, వొడుపుగా కొక్కెం, బండ అంచుకు తగిలేలా విసిరాడు. కొక్కెం బండకు తగులుకొంది. మెల్లిగా వెనక్కులాగాడు. ఆబండ నెమ్మదిగా జరుగుతూ వూచల వద్దకు చేరింది ! ఇద్దరిలో చెప్పలేని ఆనందం !

బండను ఆత్రంగా లోపలికి అందుకున్నాడు ముత్తయ్య ! ఇద్దరూ తేలిగ్గా ఓ నిట్టూర్పు విడిచారు !

ఎరికల సుంకడు బీటవారిన గోడకు వులిని వుంచి, "ఉ ం కానివ్వు !" అన్నట్టుగా చూశాడు. ముత్తయ్య రెండు చేతుల్తో బలం కొద్దీ ఆ వులిపై రాతితో దెబ్బ వేశాడు ! ఆ దెబ్బకు శబ్దంతో ఆ గది ప్రకంపించిపోయింది. వురుముల, మెరుపుల పెళపెళార్భాటాలు ! కుండపోతగా కురుస్తున్న వర్షపుజోరు ! ఆ శబ్దాన్ని బయటికి వెల్లడి కానీకుండా చేశాయి.

ఇంకో దెబ్బ ! దెబ్బ మీద దెబ్బతో బీట వారిన జైలు గోడవిచ్చుకొని పెచ్చులూడి పడింది. కొక్కెంగా మారిన ఇనుపకడ్డీతో పగుళ్ళ మధ్యన నిండిపోయిన గచ్చును వెలికి లాగాడు ఎరికల సుంకడు.

ఇద్దరిలో ఉత్సాహం ఎక్కువయ్యింది !

మళ్ళీ వులి పెట్టి వుంచాడు ఎరికల సుంకడు !

ముత్తయ్య బలంగా పులి మీద బండరాయితో కొట్టసాగాడు

ఫలితంగా ... ఆ పగుళ్ళ మధ్యన వున్న రాళ్ళకు చలనం వచ్చేసింది. నెమ్మదిగా ఒక్కో రాయిని వెలికి తీయడం ప్రారంభించాడు ముత్తయ్య.

రెండు గంటల అనంతరం ఓ మనిషి దూరిపోయేంతటి సన్నని కన్న మేర్పడింది !

ఇద్దరిలోనూ ఇనుమడించిన ఆనందం ! ఆ కన్నం గుండా నెమ్మదిగా పాకుతూ జైలు వెనుక వైపుకు వచ్చారు. ధారాపాతంగా కురుస్తున్న వర్షం వారిని తడిపి ముద్ద చేసింది ! కటిక చీకటి ఆ ప్రాంతాన్ని ఆవరించుకొని వుండటం వల్ల ఎటు వెళ్ళాలో తోచక అడిగాడు ముత్తయ్య!

"ఎటు వెళ్దాం ?"

"విశాలమైన ఆవరణం మధ్యలో ఈ జైలును కట్టారు. ఆవరణం చుట్టూరా తీగ కంచెను పాతారు. ఆ తీగ కంచెను తప్పించుకొని బయటపడ్డామంటే ఇక మనల్ని పట్టే నాథుడే వుండడు. మనం ముందు వైపు నుంచే వెళ్దాం ? అక్కడే మనకు తప్పించుకునే ఓ మార్గముంది. పద !" అంటూ ముత్తయ్య చెయ్యి పట్టుకుని వెనుక వైపు నుంచి జైలు ముందు భాగానికి వచ్చాడు.

వర్షంలో సైతం కంచెకు నలు దిక్కులా కాపలా కాస్తోన్న సెంట్రీలు – వారి చేతుల్లో చమురు దీపపు లాంతర్లు !

చుట్టూ ఆవరించుకుని వున్న కారు చీకటి వల్ల వీరు, ఆ సెంట్రీలకు అగుపించడంలేదు. అయినా వారిని గమనించిన ముత్తయ్యలో వణుకు ప్రారంభం అయ్యింది. ఎరికల సుంకడి వంక చూస్తూ నెమ్మదిగా చెప్పాడు !

"సెంట్రీలు గస్తీ తిరుగుతున్నారు ఎలా ?"

"తిరుగనీ ! నువ్వు ఏ మాత్రం భయపడకుండా నా వెంటరా !" అంటూ ముందుకు పరుగు తీశాడు ఎరుకల సుంకడు ! తమ పరుగుల ధాటికి బురద నీళ్ళు చప్పుడవుతున్నా, ఏ మాత్రం లక్ష్యపెట్టక తీగ కంచె దగ్గరికి చేరుకున్నారిద్దరు. తీగ కంచెలు బలంగా ఎత్తుగా అల్లబడి వుండటం వల్ల, వాటిని ఎలా దాటాలో అర్థం కాలేదు ముత్తయ్యకు ! ప్రశ్నార్థకంగా ఎరికల సుంకడి వంక చూశాడు !

"దానికో మార్గముంది' అన్నట్టుగా అతని వంక చూసి, పక్కనే జడల దయ్యంలా విశాలంగా పరుచుకుని వున్న మర్రిచెట్టును చూపిస్తూ చెప్పాడు.

"ఈ చెట్టెక్కి అవతలికి దూకాలి ! దూకడంలో ఏ మాత్రం తడబడ్డా, తీగ కంచెపై పడే ప్రమాదముంది. ఆ తర్వాత మనల్ని దేవుడు కూడా రక్షించలేడు !" అంటూ ముత్తయ్యను చెట్టునెక్కించి చెప్పాడు.

"ఊఁ త్వరగా దూకూ !"

బలమైన ఊపుతో చెట్టు కొమ్మపై నుంచి అవతలికి దూకేశాడు ముత్తయ్య.

ఎరికల సుంకడు కూడా చెట్టెక్కాడు. అదే సమయంతో గస్తీ తిరుగుతూ అటుగా ఓ సెంట్రీ వచ్చాడు. అతన్ని చూడంగానే కొమ్మల మాటున నక్కాడు ఎరికల సుంకడు ! కాని ముత్తయ్య మాత్రం నక్కలేదు. 'వెంటనే అక్కడ్నుంచి పారిపోవాలి' అన్న ఆలోచనతో పక్కనే వున్న పొదల మాటునుంచి పరుగులు ప్రారంభించాడు.

పర్యవసానం !

అలికిడి !

కంచె ఆవల ఓ మానవాకారం పరుగుతీస్తూ అగుపించే సరికి, ఆ సెంట్రీ విజిల్‌ను బలంగా వూదాడు. ఎరికల సుంకడి అరికాళ్ళ నుంచి వొణుకు పుట్టింది !

విజిల్ విన్న మిగితా సెంట్రీలు బిలబిలమంటూ పరుగెత్తుకొచ్చారు. "ఏం జరిగింది ?" అంటూ !

ఎవరో ఖైదీ తప్పించుకొని పోతున్నట్టుంది ! వెళ్ళి పట్టుకోండి ?" అంటుండగానే అనుకోని ఓ సంఘటన జరిగిపోయింది !

కాళ్ళకయిన బురద వల్ల కొమ్మపై నుంచి పట్టు తప్పి విసురుగా తీగె కంచెపై పడ్డ ఎరికల సుంకడు.

"చచ్చాను బాబోయ్ !" అంటూ చావుకేక పెట్టాడు.

జైలు నుంచి తప్పించుకొని పట్టుబడ్డ ఎరికల సుంకడిని, రెండ్రోజుల పాటు లాఠీల్తో బాది, అన్నం నీళ్ళు ఇవ్వకుండా ఓ రోజంతా తలక్రిందులుగా వేలాడదీయించాడు వార్డర్ ! ఆ దృశ్యాన్ని, చిత్రహింసను కళ్ళారా చూసిన మిగత ఖైదీలు భయభ్రాంతులై 'తప్పించుకపోవాలి' అన్న ఆలోచనను తమ మనసు నుండి తుడిచి వేసుకున్నారు.

# 14

"నాన్నా !"

వాలు కుర్చీలో వాలిపోయి, ఆలోచిస్తున్న కేశవరావు, కూతురి పిలుపు విని తన ఆలోచనలకు స్వస్తి చెబుతూ అడిగాడు.

"ఏమ్మా ?"

"బుజ్జిగాడికి జ్వరంగా వుంది నాన్నా ! వొళ్ళు వెచ్చగా వుంది. ఎంత ప్రయత్నించినా పాలు తాగట్లేదు. మగతగా కళ్ళు మూసుకుని పడుకున్నాడు."కళ్ళలో నీళ్ళు నింపుకుంటూ అంది రామాబాయి.

"భయపడకు తల్లీ ! తగ్గిపోతుందిలే ! ... నేనిప్పుడే వెళ్ళి మనూరి ఆచారిని పిలుచుక వస్తాను ... ఆ ... మీ అమ్మ నిటు పిలు ?"

"బాబుకు దిష్టి ఏమైనా తగిలిందేమోనని, మన పక్కింటి మీనాక్షమ్మ అవ్వను పిలుచుకొని రావడానికి వెళ్ళింది !"

కూతురు జవాబు విన్న కేశవరావు మరేమి మాట్లాడకుండా కండువా భుజంపై వేసుకుని, వూర్లోకి వెళ్ళి ఆచారిని పిలుచుకవచ్చాడు. ఆ లోపు వీణాబాయి వెంట వచ్చిన మీనాక్షమ్మ అనే పండు ముదుసలి మిరపకాయలతో బుజ్జిగాడి చుట్టూ రా మూడుసార్లు, అటూ ఇటూ తిప్పి, 'ఇరుగు దిష్టి, పొరుగు దిష్టి, వూర్లో వాళ్ళ దిష్టి' అంటూ చేతిలో వున్న మిరపకాయలపై తూ ... తూ ... అంటూ వాటిని పెరట్లోకి తీసుకెళ్ళి ఓ మూల పారేసి, వీణాబాయి అందించిన చెంబులోని మంచినీటితో బుజ్జిగాని ముఖాన్ని తుడుస్తూ అంది.

"మరేం భయం లేదమ్మా ... పిల్లాడు ఎర్రగా ముద్దుగా బొద్దుగా వున్నాడు కాబట్టి ఏ శనిగ్రహం దిష్టయినా తగిలి వుంటుంది. దిష్టి తీశానుగా ! కాసేపటికి తెప్పరిల్లుకుంటాడు." అంటూ చిన్నగా రామాబాయి భుజంపై తట్టి ధైర్యాన్ని చెప్పి వెళ్ళిపోయింది.

కేశవరావు వెంట వచ్చిన ఆచారి బుజ్జిగాడి నాడిని, వొంటిని పరీక్ష చేసి చెప్పాడు.

"భయపడవలసినంత ప్రమాదమేమీ లేదు. పసికందులకు వచ్చే సాధారణ జ్వరమే ! ఈ మందును తల్లిపాలతో కలిపి కొద్ది కొద్దిగా చెంచాతో తాగించండి. అదే తగ్గిపోతుంది !" అంటూ తన వెంట తెచ్చిన మందుల పెట్టిలో నుంచి ఓ చూర్ణపు పొట్లాన్ని కేశవరావు చేతి కిచ్చాడు.

ఆచారి చెప్పినట్లుగానే తల్లిపాలతో కలిపి ఆ చూర్ణాన్ని బుజ్జిగాడికి బలవంతంగా తాగించాడు. ఓ గంట గడిచింది. జ్వరం తగ్గు ముఖం పట్టక పోగా మరింత ఎక్కువైంది.

రామాబాయిలో ఆందోళన !

"నాన్నా ఒళ్ళు కాలిపోతోంది !" పిల్లాడి ఒంటిపై చెయ్యి వేసి చూస్తూ అంది.

"మందు గుణం కనపడాలంటే ఇంకాస్త వ్యవధి పడుతుంది. నువ్వు అట్టే కంగారు పడకు !" కాస్త చిరాగ్గా అన్నాడు కేశవరావు.

తొలిసారిగా తండ్రి తనపై చిరాకు పడ్డంతో, ఖిన్నురాలయిన రామాబాయి కంట్లో నీళ్ళు తిరిగాయి ! అది గమనించిన కేశవరావు, మనసులో బాధపడుతూ,

"ఏమను కోకమ్మా ! పరధ్యాసలో పడి అన్నాను. మా అమ్మవు కదూ !" అంటూ కూతురి కన్నీళ్ళు తుడిచి చెప్పాడు.

"ఆ చూర్ణం పాలతో కలిపి ఇంకో మారు బాబుకు తాగించమ్మా ! తగ్గిపోతుంది !"

అలాగే చేసింది రామాబాయి ! వీణాబాయి బుజ్జిగాడి వొంట్లోని వేడి తగ్గడానికి గాను, చల్లటి నీళ్ళతో తడిపిన గుడ్డను, పాల భాగాన వుంచింది !

సాయంకాలం వరకూ, అలా సపరిచర్యలు చేస్తున్నా, జ్వరం తగ్గుముఖం పట్టకపోగా మరింతగా తీవ్రమయ్యే సరికి రామాబాయితో పాటు కేశవరావు, వీణాబాయి కూడా గాబరాపడ్డారు. మళ్ళీ ఆచారిని పిలుచుకవచ్చాడు కేశవరావు.

"ఈ పాటికి మందు ప్రభావం పని చేయలేదంటే ఇదేదో విషజ్వరం అయి వుండాలి. ఎందుకైనా మంచిది. వెంటనే మదనపల్లికి తీసుకెళ్ళి, అక్కడి అలోపతిక్ డాక్టర్‌కు చూపించండి! ఇక ఏ మాత్రం ఆలస్యం చేయకవెళ్ళండి !" అంటూ సూచన ఇచ్చి వెళ్ళిపోయాడు ఆచారి. మళ్ళీ వూర్లోకి పరుగు తీసిన కేశవరావు సుబ్బుడ్ని పట్టుకొని బండి కట్టించుకొని ఇంటి దగ్గరకు వచ్చాడు.

"త్వరగా బయల్దేరండి !" అంటూ ఇంటి బయట నుంచే కేకేశాడు కేశవరావు.

"ఆ ... వస్తున్నాము !" అన్న సమాధానానికి బదులుగా, పెద్దఎత్తున ఇంట్లో నుంచి ఏడ్పులు వినిపించే సరికి, పరుగున ఇంట్లోకి వెళ్ళిన కేశవరావును తల్లీ, కూతుర్లు వాటేసుకొని భోరున ఏడుస్తూ చెప్పారు.

"మన బుజ్జిగాడు ఇక మనకు లేడండీ ! ... మనల్ని విడిచి పోయాడండీ ?"

కేశవరావు కూడా దుఃఖం ఆపుకోలేకపోయాడు ! "బాబూ నీ కప్పుడే నూరేళ్ళు నిండి పోయాయిరా కన్నా !" అంటూ ఏడ్వడం ప్రారంభించాడు.

* * *

కొడుకు మరణవార్తను, తన మామగారు వ్రాసిన ఉత్తరం ద్వారా తెలుసుకున్న సర్వోత్తమరావు, చాలా సేపు స్తబ్ధంగా వుండిపోయాడు !

ఉత్తరాలు జైలు సిబ్బంది చదివాకే ఖైదీలకు చేరుతాయి. కాబట్టి 'హరిసర్వోత్తమరావు కొడుకు చనిపోయాడు' అన్న వార్త సెంట్రీల వల్ల ఖైదీలందరికీ తెలిసిపోయింది ! కొడుకును కడసారి చూపుకు కూడా నోచుకోలేని స్థితికి జాలిపడుతూ వచ్చి సానుభూతి చూపించారు ! చివరకి జైలు వార్డర్ కూడా ! ఖైదీల పట్ల జైలు సిబ్బంది ఎంత కర్కశంగా వున్నా, ఇలాంటి విషాద సమయాల్లో సాధారణ మనుషులకి మల్లే స్పందిస్తారన్న విషయం ఖైదీలందరికీ గుర్తింపు కొచ్చింది !

ఆరోజు అతని చేత ఏ పని చేయించదలచుకోలేదు వార్డర్ ! అదే విషయం హరిసర్వోత్తమరావుతో చెబుతూ

"నువ్వు ఈవేళ విశ్రాంతి తీసుకో !"

అందుకు అంగీకరించని హరిసర్వోత్తమరావు,

"ఒంటరిగా వుంటే ఆవేదన అధికమౌతుందే కాని తగ్గదు ! కాబట్టి నేను కూడా అందరికీ మల్లే పని చేస్తాను."

అంటూ కంబడి నేయడానికి ఉద్యుక్తుడై వెళ్తొన్న హరిసర్వోత్తమరావు వంక విస్మయంగా చూశాడు వార్డర్ ! చివరకు మనసులో ఇలా అనుకున్నాడు.

'ఇతని వ్యక్తిత్వం కడు విలక్షణమైంది !'

*　　*　　*

రెండేళ్ళు గడిచిపోయాయి !

హరిసర్వోత్తమరావు అనుభవిస్తోన్న జైలు జీవితంలో మాత్రం ఎలాంటి మార్పు రాలేదు. గడిచిన ఈ రెండేళ్ళలో విప్లవకారుడిగా అరెస్టు చేయబడి కోస్తా ప్రాంతం నుండి ఖైదీగా వచ్చిన దర్శి చెంచయ్య హరిసర్వోత్తమరావుకు మిత్రుడయ్యాడు.

'వందేమాతరం' అంటూ వెళ్తోన్న తన్ను ఓ పోలీసు జవాను కొట్టగా తాను తిరగబడి కొట్టి అతన్ని గాయపరచినందుకు గాను, పుదుచ్చేరికి చెందిన రమణన్ అనే ఇరవై ఏళ్ళ యువకుడు రెండు సంవత్సరాల జైలు శిక్షను అనుభవించడానికి వచ్చాడు. అతను కూడా 'మాష్టారూ' అనిపిలుస్తూ హరిసర్వోత్తమరావుకు ఆప్తుడయ్యాడు !

ముగ్గురి మధ్య స్వరాజ్య ఉద్యమానికి సంబంధించిన చర్చలు జరిగేవి ! జైల్లో వార్తాపత్రికలు నిషేధం కావడం వల్ల, దేశంలోని ఉద్యమ విశేషాలను గురించి తెలుసుకునేందుకు గానూ, తన్ను కలుసుకోవచ్చిన ఓ మిత్రుని ద్వారా రహస్యంగా వార్తాపత్రికను తెప్పించాడు రమణన్ ! ఓ రోజంతా ఈ విషయం తెలుసుకున్న జైలువార్డర్ రమణన్‌ని లాఠీలతో బాది, చీకటి గదిలో బందించాడు. తిరిగి బయటికి తెచ్చాక, అతను మతిస్థిమితం కోల్పోయి, పిచ్చికేకలు వేసేసరికి, ఆగ్రహం చెందిన ఖైదీలందరూ హరిసర్వోత్తమరావు సూచన మేరకు ఓ పూట తమకు పెట్టే రాగిముద్దను తిరస్కరించి వార్డర్ చర్య పట్ల నిరసన తెలిపారు ! ఖైదీలు తమ పరిధి మేర నిరసన తెలిపినా వార్డర్ ప్రవృత్తిలో మాత్రం ఎలాంటి మార్పులేకపోయింది.

అలాంటి సమయంలోనే ......

జైలును దర్శించడానికి, గవర్నర్ వస్తున్నాడన్న వార్త తెలిసింది ఖైదీలకు !

"ఏం చేద్దాం ?" అన్నట్లుగా ఖైదీలందరూ హరిసర్వోత్తమరావు వంక చూశారు !

"గవర్నర్ గారికి ఇక్కడి పరిస్థితుల గురించి, అధికారుల పాశవిక చర్యల గురించి మనవి చేసి, మార్పు చేసే చర్యలు తీసుకోమని విజ్ఞప్తి చేద్దాం !"

"మన మాట వింటారా గవర్నర్ ?" అనుమానం వ్యక్తం చేశాడు ఎరికల సుంకడు.

"చుద్దాం ! వినకపోతే, మార్పు చేసే వరకు, నిరాహారదీక్ష చేద్దాం !"

"సరే ! మీ అభిప్రాయం ప్రకారమే నడుద్దాం !" ముక్తకంఠంతో అన్నారు ఖైదీలందరూ !

గవర్నర్ రాక సందర్భంగా జైలు వార్డర్, జైలు సూపరింటెండెంట్ హడావిడి అంతా ఇంతా కాదు ! అనుకున్న ప్రకారం గవర్నర్ వచ్చాడు !

అప్పటికి హరిసర్వోత్తమరావు జబ్బుతో నీరసంగా వున్నాడు.

ఖైదీల గదులను, ఖైదీలను చూశాక, హరిసర్వోత్తమరావు అతని దగ్గరకెళ్ళి పరిస్థితి అంత వివరించి చెప్పాడు !

"నేరస్తులైనంత మాత్రాన, ఖైదీలు మనుషులు కారా ? వారి పట్ల అనాగరిక చర్యలతో బాధించడం అమానుషం ! మమ్మల్ని సాటి మనుషులుగా గుర్తించి తగు మార్పులు చేయండి !"

"ఐసీ ! మీరేనా హరిసర్వోత్తమరావు ! సంవత్సరం క్రితం జైలు నుంచి విడుదల కోరుతూ తెల్పుకున్నావ్ ! రాజద్రోహనేరం చేసిన నీకు మూడు సంవత్సరాల కఠినశిక్ష ఇంకా చాలా తక్కువ ! మీలాంటి వారిపట్ల పాశవిక చర్యలు తప్పనిసరి ! లేకపోతే మళ్ళీ నేరాలకు పాల్పడుతారు. ఇక మీ తిండికి సంబంధించిన విషయమంటారా ? ఈ తిండి కూడా ఎక్కువే !" అంటూ నిర్లక్ష్యంగా వెళ్ళిపోతోన్న గవర్నర్ వంక కుపితులై చూస్తుండిపోయారు ఖైదీలు !

గవర్నర్ మాటలకు నిరసనగా రెండ్రోజుల పాటు ఆహారాన్ని ముట్టకుండా తమ నిరసనను తెలిపారు ఖైదీలు !

ఖైదీల నిరసనలను చూసిన వార్డర్

"నిరాహారదీక్షలు చేస్తే మార్పు చేస్తామనుకుంటున్నారా ? మీరు మాడిచావాల్సిందే తప్ప! మార్పు అనేది అసంభవం !" అనుకుంటూ నవ్వుకొన్నాడు. కాని ఈ నిరసనే మునుముందు ఓ పెద్ద ఆందోళనగా తయారయి, ఖైదీల పట్ల తప్పనిసరిగా మార్పు తేవలసిన అవసరం, అగత్యం ఏర్పడుతుందని వూహించలేకపోయాడు జైలు వార్డర్ !

*　　*　　*

1911.

మూడు సంవత్సరాలు కాలచక్రంలో గతించిపోయాయి ! రత్న కంబళి నేయటంలో నిమగ్నుడై వున్న హరిసర్వోత్తమరావు దగ్గరకు పరుగున వచ్చాడు ఎరుకుల సుంకడు. అతడి ముఖంలోని సంతోషాన్ని గమనించిన హరిసర్వోత్తమరావు చిరునవ్వుతో అడిగాడు.

"ఏంటి మిత్రమా ! ఈరోజు చాలా హుషారుగా వున్నావు !"

"సంతోషకరమైన వార్తను విన్నప్పుడు హుషారెందుకుండదు ?"

"అంత సంతోషకరమైన వార్త ఏమిటో ?" ఎరికల సుంకడి వంక కుతూహలంగా చూస్తూ అడిగాడు హరిసర్వోత్తమరావు.

"ఈ వార్త మీకు సంబంధించిందే ! ఇంకో వారంలో మీరు విడుదల కాబోతున్నారట ! పై నుంచి ఆర్డర్స్ కూడా వచ్చాయట ! జైలు వార్డర్ ఈ విషయం సెంట్రీలతో చెబుతూ వుండగా, అటుగా వెళ్ళిన నేను విన్నాను."

తన విడుదల వార్త విన్నా, హరిసర్వోత్తమరావులో ఎలాంటి భావం అగుపించక పోయేసరికి నిరుత్తరుడైన ఎరికల సుంకడు అతని వంక తదేకంగా చూస్తూ, "మీకీ వార్త సంతోషాన్ని కల్గించటం లేదా !" అంటూ అడిగాడు. సమాధానంగా ఓ చిరునవ్వు ! మళ్ళీ తన పనిలో నిమగ్నమయ్యాడు హరిసర్వోత్తమరావు. ఆ సమయంలో ఎరికల సుంకడికి హరిసర్వోత్తమరావు ఓ కర్మయోగిలా సాక్షాత్కరించాడు.

విడుదల రోజు రానే వచ్చింది.

జైలు ముఖద్వారం వాకిళ్ళు భళ్ళున తెరుచుకున్నాయి ! హరిసర్వోత్తమరావు కంట తడిపెట్టడం చూసి అడిగాడు ఎరికల సుంకడు.

"ఎందుకా కన్నీరు మిత్రమా ?"

"నీ స్నేహం మరువలేకున్నాను మిత్రమా ! జైల్లో నాకప్పగించిన పని కూడా నీవే చేసి ..... అనుక్షణం అండగా నిలిచి ఆదుకొన్న నిన్ను విడిచి ఎలా వుండగలను ?" అంటూ ఆప్యాయంగా కౌగలించుకున్నాడు హరిసర్వోత్తమరావు.

ఆ క్షణంలో ఎరికల సుంకడి కళ్ళ నుండి అశ్రుకణాలు జలజలారాలాయి !

తోటి ఖైదీల దగ్గర, జైలు సిబ్బంది దగ్గర వీడ్కోలు తీసుకొని జైలు ద్వారం దాటి బయటికొచ్చాడు హరిసర్వోత్తమరావు.

ఎదురుగా రామాబాయి !

భర్తను చూడగానే ఆమె కనుకొలకులలోనుంచి కన్నీటి భాష్పాలు !

ఇరువురి మధ్య మౌనం – ఒకరినొకరు అలాగే చూస్తూ నిల్చుండిపోయారు ! కళ్ళతోనే ఒకరి పట్ల ఒకరు ఆప్యాయత కురిపించుకున్నారు. ఆ ఆప్యాయతలోని అవ్యక్తానురాగం వాళ్ళిద్దర్నీ కలిపి పెనవేసింది !

అపురూపమైన ఆ దృశ్యాన్ని అలాగే చూస్తుండిపోయారు రామాబాయి వెంట వచ్చిన మునగాల రాజా, కొమర్రాజు లక్ష్మణరావు, రంగారావుగారలు !

# 15

1913

మదరాసు మహానగరం !

హరిసర్వోత్తమరావు నివసించేందుకు ఏర్పాటు చేసిన గృహంలో మిత్రులు ముఫ్వురు కల్సుకున్నారు. పాత జ్ఞాపకాలు మళ్ళీ వారిని చుట్టుముట్టాయి !

ఆ జ్ఞాపకాలలో 'విజ్ఞాన చంద్రిక' ప్రస్తావన వచ్చింది !

"సంస్థ ప్రచురణలు ఎలా సాగుతున్నాయి ? లక్ష్మణరావు వంక చూస్తూ అడిగాడు హరిసర్వోత్తమరావు.

"సాగుతున్నాయే కాని.... మీరు లేని లోటు మాకు తీరని లోటుగా అగుపిస్తూ వుండింది. ఇక ఈ కార్యభారాన్ని నిర్వహించే భారం మీదే ! అన్నాడు లక్ష్మణరావు. మిగతా ఇద్దరు మిత్రులు కూడా లక్ష్మణరావు సూచనను బలపరిచారు.

తన మిత్రుల హృదయాలలోని అంతరార్థం హరిసర్వోత్తమరావుకు బోధపడింది. ఆలోచనలో పడ్డాడు !

తనిప్పుడు జైల్లో నుంచి బాహ్య ప్రపంచంలోకి వచ్చాడు. ప్రస్తుతం తన జీవితం తాడులేని బొంగరం లాంటిది ! పరాన్న జీవిగా జీవించే మనస్థత్వం కాదన్న విషయం తన మిత్రులకు తెలుసు ! అందుకే విజ్ఞాన చంద్రికా భారాన్ని అప్పగించి జీవనోపాధి కల్పించాలన్నది వారి ఉద్దేశ్యం ! వారి ఉద్దేశ్యానికి చలించిపోయిన హరిసర్వోత్తమరావు గాద్గదిక స్వరంతో చెప్పాడు !

"నా శ్రేయస్సు కోసం మీరు పడుతున్న తపన అర్థం చేసుకొన్నాను. మీరు కోరిన ప్రకారం 'విజ్ఞాన చంద్రిక' భారాన్ని స్వీకరిస్తాను !"

తమ మనోభావాలను పసిగట్టిన హరిసర్వోత్తమరావు వంక విస్మయానంద చకితులై చూశారు కొమర్రాజు లక్ష్మణరావు, మునగాల రాజా !

* * *

ఆ రోజు శ్రావణ శుక్రవారం !

రామాబాయి ఉదయమే లేచి తలంటుకుని స్నానం చేసింది. ఉతికి ఆరేసిన చీర కట్టుకొని పెరట్లో వున్న తులసి చెట్టుకు ప్రదక్షణలు చేసింది ! అలా ప్రతిరోజు చేయటం ఆమె నిత్యకృత్యాల్లో ఒక భాగం ! ఆ తర్వాత కాఫీ తీసుకొని 'విజ్ఞాన చంద్రికా మండలి' కోసం వ్రాస్తోన్న 'ఢిల్లీ దర్బారు' రచనలో నిమగ్నమయివున్న భర్త దగ్గరకు వెళ్ళి కాఫీ అందించింది !

భార్య అందించిన కాఫీ తాగుతోన్న హరిసర్వోత్తమరావు దృష్టి భార్య చిరిగిన చీరపై పడగానే అతని హృదయం బరువెక్కింది !

"రాముడూ ! ఏమిటో ఈ జీవితం ! సంసార బాధ్యతలు పట్టించుకోకుండా నిన్ను నిరంతరం కష్టపెడుతున్నాను." అంటూ బాధగా నిట్టూర్చాడు

"అవేం మాటలండీ ! నేను ప్రతినిత్యం తులసీ మాతను పూజిస్తున్నాను. మీరు దేశ మాతను ఆరాధిస్తున్నారు. మనిద్దరి మధ్య వున్న తేడా అంతే !" అంటూ "నేను ప్రతి రోజు తులసీ మాతను ఎందుకు కొలుస్తున్నానో చెప్పండి, చూద్దాం !" అంటూ క్రీగంట భర్త వేపు చూసింది.

"ఏముంటుంది ? మా సంసారం బాగు చేయండి తల్లీ అని ప్రార్థించి వుంటావు" నవ్వుతూ "అంతేగా ..." భార్యవేపు చూస్తూ అన్నాడు.

"కాదు !"

"నా భర్తకు సంసార బాధ్యతలు పట్టవు. ఎలాగైనా ఆయన మనసు ఇంటి విషయాలపై మళ్ళేట్లు అనుగ్రహించు తల్లీ ! అని ప్రార్థించి వుంటావు.' ఇప్పుడు చెప్పు ! సరిగ్గా ఊహించానా !"

"కాదు ... కాదు ... కాదు ... కానేకాదు !"

"ఇక నా వల్ల కాదు. నువ్వే చెప్పు ?" అన్నట్టుగా భార్యవంక చూశాడు హరిసర్వోత్తమరావు.

"మీరు కళ్ళు మూసుకుంటే చెబుతాను."

భార్య అన్నమాట నవ్వు తెప్పించింది హరిసర్వోత్తమరావుకు.

"ఎందుకలా ముసిముసిగా నవ్వుతారు! అంత నవ్వొచ్చేమాట నేనేమి అన్నాను ?"

"కళ్ళు మూసుకొని వినమన్నందుకు, చెవులు మూసుకొని వినమనింటే నా పరిస్థితి ఎట్లా వుండేదో ? ఊహించుకుంటే నవ్వు వచ్చింది. నవ్వాను."

హరిసర్వోత్తమరావు మాటకు నవ్వటం ఈసారి రామాబాయి వంతు అయింది.

"పోండి. నా ప్రార్థన మీ కంత అవహేళనగా అగుపించిందా ? అవున్లేండి ! నా బ్రతుకే మీకు నవ్వులాట అయింది !" అంటూ మూతి ముడుచుకొని కూర్చుంది రామాబాయి అలిగి !

"రాముడూ ! నిన్నవహేళన చేస్తే నన్ను నేనే అవహేళన చేసుకున్నట్లే ! ఏదో తమాషాకి అన్నాను. క్షమించు రాముడూ !" అంటూ భార్య గడ్డాన్ని పట్టుకొని అడుక్కుని "చెప్పు రాముడూ ... చెప్పవా ?" దీనంగా వేడుకున్నాడు.

వెంటనే కరిగిపోయింది రామాబాయి !

"ఎంత మాట అన్నారండీ ! నన్ను క్షమించమని ఎప్పుడూ అనకండి ! భర్త అడుగుజాడలే భార్యకు శ్రీరామరక్ష. మీ శ్రేయస్సే నా శ్రేయస్సు ! నా ప్రార్థన, బానిసత్వంతో మ్రగ్గుతున్న దేశ ప్రజలకు స్వాతంత్ర్యం సిద్ధించాలనీ, అందుకోసం మీరు చేస్తున్న పోరాటానికి గాను, మీకు ఆయురారోగ్యాలు ప్రసాదించాలనీ నిత్యం తులసీ మాతను పూజిస్తున్నాను" భార్య పలుకులకు హరిసర్వోత్తమరావు కళ్ళు చెమర్చాయి. ఆమెలో పెరిగిన సంస్కరణాభిలాషకు అతని హృదయం ఉప్పొంగింది !

"రామూడూ ! జీవితం అన్నది అశాశ్వితం ! ఎప్పుడూ సుఖభోగాలలో తేలియాడటంలో అర్థంలేదు. అశాశ్వతమైన ఈ జీవితంలో శాశ్వతమైన పని ఒక్కటైనా చేయాలి ! అదే నా ధ్యేయం ! అందుకోసమే ఈ పోరాటం ! నా ఈ పోరాటానికి నీ చేయూత అందించావు. ఇంతకన్న నాకు ఆనందం ఇంకేమి కావాలి !" అంటూ ఆమెను తన చెంతకు చేర్చుకున్నాడు.

ఆనందంతో భర్త వడిలో ఒదిగి పోయింది రామాబాయి ! అదే సమయంలో వారింటికి వచ్చిన లక్ష్మణరావును గమనించిన రామాబాయి భర్త ఒడి నుండి విడివడి సిగ్గుతో, లక్ష్మణరావు వంక చూస్తూ అంది.

"రండన్నయ్య గారూ !"

"మీ ఏకాంతానికి భంగం కలిగించినందుకు క్షంతవ్యుణ్ని !"

"ఏకాంతం ఈ జీవితాని కెక్కడిది ? అసాంతం పోరాటమే ! కూర్చోండి !" నవ్వుతూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

లక్ష్మణరావు హరిసర్వోత్తమరావు పక్కన ఆశీనుడౌతూ అన్నాడు.

"ఎంత వరకు సాగింది మీ 'ఢిల్లీ దర్బారు' ?"

"నేనేం మహారాజును కానుగా !" చలోక్తిగా నవ్వుతూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

"మీకేం ? మకుటంలేని మహారాజులు !" తాను కూడా హాస్యాన్ని చిందిస్తూ అన్నాడు లక్ష్మణరావు.

లక్ష్మణరావు మాటకు నవ్వుతూ "నీ మాట ప్రకారమే ఆ దర్బారులోనే వున్నాను. నా 'దర్బారు' త్వరలోనే పూర్తవుతుంది !" అన్నాడు హరిసర్వోత్తమరావు.

"చాలా సంతోషం ! మునగాల రాజా వారింటికి వెళ్ళేముందు మిమ్మల్ని పలుకరించి వెళ్దామని ! మళ్ళీ కలుస్తాను !" అంటూ భార్యాభర్తలిద్దరి వద్ద శెలవు తీసుకొని వెళ్ళిపోయాడు లక్ష్మణరావు.

లక్ష్మణరావు వెళ్ళాక, హరిసర్వోత్తమరావు కలం ముందుకు సాగలేదు. కాసేపలా బయటికి వెళ్ళివద్దామనిపించిది. ఆ విషయమే భార్యకు చెప్పి బయటకి నడిచాడు !

బజారులోని రోడ్డుపై నాలుగడుగులు వేశాడో లేదో, అల్లంత దూరంలో పాత మిత్రుడు నారాయణరావు అగుపించాడు. హరిసర్వోత్తమరావుకు ప్రాణం లేచి వచ్చినట్లయింది ! అయితే నారాయణరావు తన్ను గమనించకుండా పరధ్యానంలో వెళ్తున్నాడని గమనించి గొంతు పెద్దది చేసి, "నారాయణరావు !" అంటూ గట్టిగా కేకవేశాడు ! ఆ కేకవిని ఆగిపోయాడు నారాయణరావు. ఆగి హరిసర్వోత్తమరావు వంక అదోలా చూశాడు ! ఆ చూపులో మునుపటి ఉత్సాహం లేదు. చాలా రోజులకు కలిశామే అన్న ఆనందం కూడా లేదు ! అతని చెంతకెళ్ళిన హరిసర్వోత్తమరావు అతని భుజం తడుతూ అడిగాడు "ఎలా వున్నావు ?"

"బాగానే వున్నాను ... కాస్త అర్జంట్ పని మీద వెళ్తున్నా – మీరేమనుకోకపోతే, రేపు మీ ఇంటికొచ్చి కలుస్తాను !" అంటూ చుట్టుపక్కల కలయ జూస్తూ, హడావుడి పడుతూ వెళ్తున్న నారాయణరావు వంక చూస్తూ అనుకున్నాడు !

"ఇతనిదెప్పుడూ కంగారు మనస్తత్వమే ! పాపం ! ఏం చిక్కులో పడ్డాడో ? ఆ చిక్కేమిటో చెబితే తను విప్పేవాడు కదా ! పూర్ ఫెలో !"

కొద్దిదూరం నడిచాక, స్ఫురణకి వచ్చింది 'ట్రిప్లికేన్ బీచ్ !' ఆ రోజుల్లో ఇంచుమించుగా ప్రతి రోజు ట్రిప్లికేన్ రేడియో బీచ్‌లో – కూర్చుని కొందరు మిత్రులతో యిష్టాగోష్ఠి జరుపటం అలవాటుగా వుండేది ! ఆ అలవాటు ప్రకారం అక్కడికి చేరాడు హరిసర్వోత్తమరావు. ఆశగా చూసిన హరిసర్వోత్తమరావుకు కొద్దిదూరంలో మిత్రబృందం అగుపించింది. వేయి ఏనుగులంత బలం ! కొండంత ఉత్సాహంతో దరిచేరిన హరిసర్వోత్తమరావుకు నిరుత్సాహమే ఎదురైంది !

తన్ను చూడగానే వారి ముఖాలన్నీ పాలిపోయాయి ! ఏ ఒక్కరూ ఆప్యాయంగా పలుకరించలేదు. గుసగుసలాడుకుంటూ ఒక్కరొక్కరూ అక్కడ్నించి జారుకున్నారు. వారెందుకలా జారుకున్నారో అర్థంకాక అచేతనంగా నిల్చిపోయాడు హరిసర్వోత్తమరావు ! కాస్సేపటికి తేరుకొని బరువెక్కిన హృదయంతో తిరుగు ముఖం పట్టాడు. కొద్దిదూరం నడిచాక మరో స్నేహితుడు ఎదురయ్యాడు ! హరిసర్వోత్తమరావు 'హలో' అంటూ పిలిచేలోగా, ఆ స్నేహితుడు హరిసర్వోత్తమరావు వంక ఒకింత భయంగా చూస్తూ నడుస్తున్న దారి మార్చేశాడు !

ఏమిటో ఈ రోజు తను లేచిన వేళా విశేషం ? తన్ను చూడగానే ఇలా తప్పుకుంటున్నారేంటి ? అని మనసులోనే చిన్నగా నవ్వుకొంటూ మరికొంతదూరం సాగి ఆలోచనలో పడ్డాడు.

మూడేళ్ళ క్రితం ఇదే రోడ్డులో తను నడుస్తుంటే మిత్రులంతా వెంటబడి తిరిగేవారు! మరి ఇప్పుడెందుకిలా ప్రవర్తిస్తున్నారు ? ఈ ఆలోచనలో బుర్రవేడెక్కింది హరిసర్వోత్తమరావుకు.

ఎదురుగా హోటల్ అగుపించింది ! మునుపు స్నేహితులతో కలిసి తరచూ వెళ్ళే హోటలే ! అందులో ప్రవేశించగానే హోటల్ యజమాని ఇది వరకులా "వణక్కం వణక్కం" అంటూ ఆహ్వానించలేదు. అలా ఆహ్వానించకపోగా తనవేపు ముఖం చిట్లించుకుంటూ చూడ్డం ఆశ్చర్యం కలిగించింది, హరిసర్వోత్తమరావుకు ! వెళ్ళి ఓ సీట్లో కూర్చొని సప్లయర్‌ను పిలిచి కాఫీ తెమ్మని ఆర్డరిచ్చాడు. కాఫీ ఆర్డరిచ్చాక, ఇంకెవరైనా పాతమిత్రులు అగుపిస్తారేమోనని హోటల్ అంతా కలియజూస్తుండగా, ఎంఏలో కాలేజీ మిత్రుడు అయిన సూర్యారావు కాఫీ తాగుతూ అగుపించాడు !

"సూర్యారావు..." అంటూ పిలిచాడు !

హరిసర్వోత్తమరావు వంక చూసిన సూర్యారావు, తాగుతున్న కాఫీ కూడా వదిలేసి, మారు మాటాడక, హోటల్‌నుంచి బయటకి పరుగుతీశాడు.

హరిసర్వోత్తమరావు ముఖం మళ్ళీ ప్రశ్నార్థకంగా మారింది ?

కాఫీ లేకుండా వట్టి చేతుల్తో సప్లయర్ తన దగ్గరకు రావటం గమనించిన హరిసర్వోత్తమరావు చిరాగ్గా అడిగాడు.

"కాఫీ తేలేదేం ?"

"మిమ్మల్ని మా ప్రొప్రయిటర్ గారు పిలుస్తున్నారు. రండి !"

అంటూ జవాబిచ్చాడు సర్వర్.

"దేనికి ?"

"ఏమో, నాకైతే చెప్పలేదు !"

'పద !' అంటూ లేచి అతని వెంట ప్రొప్రయిటర్ గదిలోనికి నడిచాడు హరిసర్వోత్తమరావు. హరిసర్వోత్తమరావు తన గదిలోకి రాగానే, ప్రొప్రయిటర్ షణ్ముగం.

"నమస్కారం కూర్చోండి !" అంటూ కుర్చీ చూపించి చెప్పాడు.

"మీరు గొప్పవారు. మా హోటల్‌కు తరచూ వస్తుండేవారు. మీ వెంట ఎందరో స్నేహితులుండేవారు. స్వాతంత్ర్యాభిలాష కల మీరంటే నాకెంతో గౌరవం కూడా ... కానీ ... కానీ ..." అంటూ ఆగిపోయాడు షణ్ముగం.

"ఆగిపోయావేం ? ఫరవాలేదు. చెప్పండి !" అంటూ అతని వంక చూశాడు హరిసర్వోత్తమరావు.

"కాఫీ సేవిస్తున్న మీ మిత్రుడు మిమ్మల్ని చూడగానే పారిపోయాడు గమనించారా ?"

"గమనించాను" అన్నట్టుగా తలూపాడు.

"అందుకు కారణం తెల్వదా ?"

"తెలియదు."

"జైలు నుంచి విడుదల అయి వచ్చిన మీ పైన ప్రభుత్వం సి.ఐ.డి. లను పురమాయించి నిఘా వేసి వుంచింది. మీతో మాట్లాడినా, సహకరించినా వాళ్ళను గురించి కూడా సి.ఐ.డి. లు దర్యాప్తు చేస్తున్నారు. అందుకనే మీ మిత్రులంతా మిమ్మల్ని చూస్తేనే చాలు హడలెత్తిపోతున్నారు! అంచేత ..." చేతులు నలుపుకుంటూ ... నీళ్ళు నమలుతూ. "మీరు ... మీరు ..."అంటూ తరువాత మాటలు ఎలా చెప్పాలో తికమక పడసాగాడు షణ్ముగం.

అది గమనించిన హరిసర్వోత్తమరావు "ఈ హోటల్‌కు రాకూడదని కదూ, నీవు చెప్పబోయేది ?" మందహాసం చేస్తూ అన్నాడు.

"పెద్దవారు, సూక్ష్మంగానే విషయం అర్థం చేసుకోగల సమర్థులు. ఏదో బీదవాణ్ణి. వ్యాపారమే నా జీవితం. అన్నీ తెలిసిన మీతో ఇంతకంటే చెప్పలేను."

అప్పుడే సప్లయర్ అందించిన కాఫీని అందుకుని సర్వోత్తమరావు ముందుంచి "కాఫీ తీసుకోండి !" అన్నాడు షణ్ముగం.

"అలాగే ! ఇక నేనెప్పుడూ ఈ హోటల్ ఛాయలకు కూడా రాను." అంటూ కాఫీని అక్కడే ఒదిలేసి షణ్ముగం గదిలోనుండి బయటికి నడిచాడు హరిసర్వోత్తమరావు.

* * *

ఇంటికి వచ్చి తలపట్టుకుని కూర్చున్న తన భర్త వంక చూసి కంగారు పడుతూ అడిగింది రామాబాయి.

"ఏం జరిగిందండీ ? ఎందుకిలా వున్నారు ?"

జరిగింది భార్యతో చెప్పి అన్నాడు హరిసర్వోత్తమరావు.

"సి.ఐ.డి. లు నిఘా వేసినంత మాత్రాన, నా మిత్రులయి వుండికూడా ఇలా పిరికి వాళ్ళలాగా పారిపోవటం నాకు నచ్చలేదు రాముడూ ! ఈ మనుషులెంత దిగజారిపోయారు? నేను చేసిన నేరం ! జైలు కెళ్ళటమేగా ! అక్కడ ఎంత కఠిన కారాగారవాస శిక్ష అనుభవించాను? ఆ మాత్రం సానుభూతి కూడా చూపని ఈ లోకం – నన్ను చూస్తూనే, తాకుతూనే పాపం వస్తుందన్నట్లు భీతిల్లిపోతున్నారు. ఇంతకూ నేను చేసిన నేరమేమిటి రాముడూ ?" ఆక్రోషంగా అంటూ భార్యవంక చూశాడు హరిసర్వోత్తమరావు.

"మిత్రులయినంత మాత్రాన కోరి కష్టాలను తెచ్చుకుంటారటండీ ! ప్రభుత్వం మీ మీద ద్వేషం పెంచుకొన్నట్లే, మీతో కలిస్తే తాముకూడా ఎక్కడ శిక్షకు గురికాబడతామోనన్న భయం వాళ్ళనలా మార్చివేసింది. ఈ విషయం గురించి దీర్ఘంగా ఆలోచించడం వల్ల పెద్దగా ప్రయోజనముండదనుకొంటాను."

ఆమె చెప్పింది నిజమే అనిపించి అన్నాడు హరిసర్వోత్తమరావు.

"అయితే ఎవ్వరూ నాతో కలవక, మాట్లాడకపోతే ... ఒంటరితనంతో ఎలా గడపనూ ..."

"మీరు ఒంటరి ఎలా అవుతారు ? జంటగా నేనుంటే .." కొంటెగా నవ్వుతూ అంది రామాబాయి.

భార్య నవ్వులో శృతి కలుపుతూ అనుకున్నాడు హరిసర్వోత్తమరావు.

"ఇందుకే కాబోలు పెద్దలు అన్నారు. ఒక వ్యక్తి జీవితంలో రాణించాడంటే అందులో సగభాగం ఇల్లాలు తోడ్పాటే అని ! అర్ధాంగి సహాయ సహకారాలు లేనిదే ఏ పురుషుడు జీవితపు అత్యున్నత శిఖరాన్ని అందుకోజాలడు. వంట ఇంటికే పరిమితమయినా, పురుషుని జీవితంలో స్త్రీ ప్రభావం నీడలా వెంటాడుతూనే వుంటుంది. అందుకే ప్రతి వ్యక్తి మొదట స్త్రీని గౌరవించటం నేర్చుకోవాలి."

రామాబాయి తన భార్యగా లభించటం నిజంగా తన అదృష్టం !

*    *    *

'విజ్ఞాన చంద్రికా మండలి' కొరకు వ్రాసిన 'ఢిల్లీ దర్బార్' పుస్తక ప్రచురణ విషయంలో ప్రచురణ మండలి సభ్యులకు సందేహాలు తలెత్తాయి ! వాటిని హరిసర్వోత్తమరావుకు ఏకరువు పెట్టారు. ఏకరువు పెట్టిన మొదటి వ్యక్తి మునగాల రాజా నాయని వెంకట రంగారావు.

"హరిసర్వోత్తమరావుగారూ ! ఈ పుస్తకం ప్రచురణకు వెళ్ళే ముందు మీతో ఓ విషయం గురించి చెప్పాలనుకొంటున్నాను." అంటూ తన మనసులో వున్నది చెప్పటం మొదలు పెట్టాడు.

"ప్రస్తుతం మీపై ఆంగ్లేయ ప్రభుత్వం కక్ష కట్టింది. మీరు వ్రాసిన పుస్తకం ప్రచురిస్తే ఇబ్బందులు ఎదురవుతాయేమోనని మా ఆలోచన !"

"అదీ చూద్దాం !" అన్నాడు రంగారావు.

లక్ష్మణరావుకెటూ పాలుపోలేదు !

మళ్ళీ మునగాల రాజే అన్నాడు, "ఏదైనా ఒక పని చేసేముందు కీడెంచి మేలెంచమన్నారు. అనవసరంగా ఆపదలను కొనితెచ్చుకోవటం కన్న ఉపాయంతో కార్యం సాధించటం మేలనుకొంటాను."

"ఆ వుపాయమేదో మీరే చెప్పండి !" రాజా వేపు చూస్తూ అన్నాడు రంగారావు.

"హరిసర్వోత్తమరావు గారూ ! అన్యధా భావించకుంటే తరుణోపాయం ఆలోచించాను !"హరిసర్వోత్తమరావు వంక చూస్తూ చెప్పాడు.

హరిసర్వోత్తమరావు మౌనంగా తల పంకించాడు.

"సంస్థ ఉజ్వల భవిష్యత్తు మన ప్రధాన ఆశయం ! అందుకుగాను ఈ గ్రంధం లక్ష్మణరావు సంపాదితమని ప్రకటిస్తే ..." అంటూ లక్ష్మణరావు వేపు చూశాడు.

లక్ష్మణరావు అందుకు సమ్మతించచక, "ఇది నేరం - ఇంతకన్నా ఘోరం మరొకటుండదు. హరిసర్వోత్తమరావు పట్ల మనం తీరని అపరాధం చేసిన వారమౌతాం ! ఇలాంటి వాటికి ససేమిరా నేను అంగీకరించను."

అందుకు రాజాగారు అన్నాడు.

"హరిసర్వోత్తమరావు పట్ల అపరాథం చేయాలన్న తలంపు మనలో ఎవ్వరికీ లేదు. పరిస్థితుల ప్రభావం అంతే ! ఒకవేళ వారి పేరు మీదే ప్రచురించామనుకుందాం ! ప్రభుత్వం ఆ పుస్తకాన్ని నిషేధిస్తే ... పెట్టిన పెట్టుబడి గురించి ఆలోచించండి."

ఈమారు హరిసర్వోత్తమరావు తలదూర్చక తప్పలేదు ! "రాజాగారు చెప్పింది నిజమే ! మనకు వ్యక్తులు కాదు ప్రధానం. సంస్థ ! సంస్థ పురోభివృద్ది కోసం ఎలాంటి త్యాగాలకైనా సభ్యులు సంసిద్ధం కావాలి. అప్పుడే మన ఆశయ సిద్ధి నెరవేరుతుంది !"

చివరకు 'ఢిల్లీ దర్బారు' గ్రంధకర్తగా లక్ష్మణరావు పేరు నిర్ణయమైంది. లక్ష్మణరావు నొచ్చుకుంటూనే విధిలేక ఒప్పుకొనవలసిన పరిస్థితి వచ్చింది !

* * *

హరిసర్వోత్తమరావు పట్ల జరిగిన అపరాధానికి లక్ష్మణరావు లో లోపల కృంగిపోసాగాడు. పత్రికలు ఆ గ్రంధాన్ని ఆకాశానికెత్తాయి. ఆనందం కన్న విచారమే మిగిలిపోయింది తనకు ! హరిసర్వోత్తమరావుకు లభించవలసిన కీర్తి తనకు లభించినందుకు. దీనికి ప్రత్యామ్నాయ మార్గం ఏమిటి ? హరిసర్వోత్తమరావుకు ఏం చేసి తన మనసును కుదుటపరచుకోవాలి ? ఈ లోటు ఈ జీవితంలో తీరుతుందా !

రకరకాల ఆలోచనలతో మనసులో అశాంతి !

ఏం చేస్తే ఆ అశాంతి తొలగుతుందో అర్థం కాలేదు లక్ష్మణరావుకు.

మరుసటి రోజే హరిసర్వోత్తమరావు ఇంటికి వెళ్ళి తన బాధను వ్యక్తపరచాడు.

లక్ష్మణరావు చెప్పింది విన్న హరిసర్వోత్తమరావు చిన్నగా నవ్వుతూ,

వార పత్రిక'ను దినపత్రికగా మార్చి, మద్రాసు నుంచి నడపాలని తీర్మానించుకున్నాను. ఇక్కడ నుండి పత్రిక వెలువరిస్తే మన ఆంధ్రప్రజలకు అందుబాటుగా వుంటుంది ! ఇక్కడి వార్తలను కూడా అందరికి తెలిసేలా ప్రముఖంగా ప్రచురించవచ్చు. ఇందుకుగాను మీ చేయూత అవసరం. మీరు తప్పక నా ప్రయత్నానికి సహకరిస్తారని ఆశిస్తున్నాను."

పంతులు గారి నిర్ణయాన్ని విన్న హరిసర్వోత్తమరావు మనస్ఫూర్తిగా సమర్థిస్తూ చెప్పాడు.

"పంతులు గారూ మీరీ నిర్ణయానికి రావడం చాలా సంతోషం ! నా వంతు బాధ్యతగా మీరు ఏ కార్యాన్ని అప్పగించినా నెరవేరుస్తాను."

"నాకా నమ్మకం వుండే మిమ్మల్ని పిలిపించాను. నేను ప్రారంభించబోయే దినపత్రికకు మీరే సంపాదకులుగా వుండాలి !"

"అలాగే !" అంటూ అంగీకరించి పంతులుగారి వంక కృతజ్ఞతా పూర్వకంగా చూశాడు హరిసర్వోత్తమరావు !

* * *

## 1914, ఏప్రిల్ !

ఉదయం 8 గంటలకు హరిసర్వోత్తమరావు తనకు కేటాయించిన గదిలో కూర్చుని సంపాదకీయాన్ని వ్రాయటంలో నిమగ్నుడయ్యాడు.

సంపాదకీయం వ్రాయటంలో అతను అనుసరించిన పద్ధతే వేరు ! ఆనాటి దేశకాల పరిస్థితులు ఏ విధంగా వున్నాయో అని ఒక్కసారి అవగాహన చేసుకోవటం – వాటిని బట్టి పాఠకుడు ఏ విషయానికి స్పందిస్తాడో నిర్ణయానికి రావటం – ఆ తర్వాత సంపాదకీయం రెండు కాలాలకు మించకుండా వ్రాయటం – ఆయన నిత్యకృత్యం !

ప్రతిరోజు 'ఆంధ్ర పత్రిక' కార్యాలయానికి పాఠకుల నుంచి ఉత్తరాల కట్టలు వేలకు వేలు వచ్చిపడుతుంటాయి ! అలా వచ్చిన వాటిని ఎంతో ఓపికతో చదివి జవాబివ్వాలి ! ఈ పనిని ఇతరులకు కేటాయించవచ్చు. కాని హరిసర్వోత్తమరావే అన్ని ఉత్తరాలు స్వయంగా చదివి, జవాబులివ్వటం తన బాధ్యతగా స్వీకరించాడు. ఆ తర్వాత కార్యక్రమం కార్యాలయానికి వచ్చిన వివిధ పత్రికలను చూడటం. ఆ వచ్చిన పత్రికలు ఇంగ్లీషు, కన్నడ, తమిళ, మరాఠి భాషలకు చెందినవి. వాటిలోని అవసరమైన వార్తలననువదించి ప్రెస్సుకు పంపడం. ఈ విధంగా రోజుకు దాదాపు 8 గంటలు పనిచేయటం హరిసర్వోత్తమరావుకు అలవాటైంది.

ఒకరోజు నాగేశ్వరరావు ఆయన గదికి వచ్చాడు. అప్పటికి హరిసర్వోత్తమరావు సంపాదకీయంలో తలమునకలవుతున్నాడు. నాగేశ్వరరావు రాక కూడా గమనించలేదు. అయినా ఆయన నిశ్చలత చెడగొట్టకూడదన్న ఉద్దేశ్యంతో నాగేశ్వరరావు వెనుదిరిగి వెళ్ళి తన గదిలో కూర్చున్నాడు.

అరగంట తర్వాత 'బాయ్'ని పిల్చి "హరిసర్వోత్తమరావును పిలువు" అన్నారు.

"పిలిచారట !" అంటూ హరిసర్వోత్తమరావు వచ్చాడు.

"కూర్చోండి !"

"అరగంట క్రితం మీ గదిలో కొచ్చాను !"

"తెలియదు !"

"నాకా విషయం తెల్సు ! కాని ఈ రోజు ప్రత్యక్షంగా చూశాను ! వృత్తికే అంకితమయ్యే మీలాంటి వ్యక్తి నా పత్రికకు సంపాదకుడుగా వుండటం నాకు గర్వకారణం !"

పంతులుగారి పొగడ్తకు మందహాసం చేస్తూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

"మీరు పిలిపించిన కారణం ?"

"నేను బొంబాయి వెళుతున్నాను ! మళ్ళీ వచ్చేవరకు మీ బాధ్యతతో పాటు, పత్రిక నిర్వహణ బాధ్యత కూడా నిర్వహించాలి !"

"అలాగే !" మరి నేను వెళ్ళి పని చూసుకుంటాను."

"వెళ్ళండి !" అంటూ తలూపాడు కాశీనాధుని నాగేశ్వరరావు – బాధ్యత పట్ల అతనికున్న తపనకు సంతోషిస్తూ !

ఇంత పని చేసినా హరిసర్వోత్తమరావుకు లభించింది స్వల్ప వేతనం ! అయినా తృప్తి చెందాడు !

సాయంకాలం కాగానే ఆఫీసు నుండి ఇంటికి బయల్దేరి వచ్చిన హరిసర్వోత్తమరావు, తన పిలుపునకు ఇంట్లోనుంచి సమాధానం రాకపోయేసరికి ఆందోళన చెందుతూ పడక గదిలోకి వెళ్ళి చూశాడు.

రామాబాయమ్మ నిండా దుప్పటి కప్పుకుని పడుకుంది. దగ్గరగా వెళ్ళి ఆమెను మెల్లిగా తడుతూ, "రాముడూ !" అంటూ పిలిచాడు.

ఆ పిలుపుకు రామాబాయమ్మ కళ్ళు తెరిచింది ! "ఏం రాముడూ సుస్తీ చేసిందా !" అంటూ ఒళ్ళుపట్టుకుని చూసాడు.

"ఏమండీ ! ఎంత సేపయింది వచ్చి ?" అంటూ లేవబోయింది.

"ఫరవాలేదు రాముడూ ! బాగా అలసినట్లున్నావు. నీకు విశ్రాంతి అవసరం. ఈ రాత్రికి నువ్వేం పని చేయాల్సిన అవసరం లేదు. వంట నేను చేస్తాను."

"అసలే ఆఫీసులో బోలెడు చాకిరి చేసి మళ్ళీ ఇంటి పని చేస్తే అలిసిపోరూ ...!"

"ఏం నాకు వంట చేయటం చేతకాదనుకున్నావా !" అంటూ ఆమెను కదలనీయకుండా పడుకోబెట్టి వంట ఇంట్లోకి వెళ్ళి వంట పని చేయటం ప్రారంభించాడు.

అరగంట గడిచింది ! వంట పూర్తయ్యాక పళ్ళెంలో చారన్నం కల్పుకొని భార్యదగ్గరకు వెళ్ళాడు. భర్తే స్వయంగా పళ్ళెంలో అన్నం తీసుకొచ్చేసరికి ఆశ్చర్యపోయింది !

"మీకెందుకండీ శ్రమ ! నేను వడ్డించే దాన్నిగా !"

"మరేం ఫరవాలేదు రాముడూ. ఆ మాత్రం సాయంలేకపోతే ఎలా ! భార్యా, భర్తలన్న తర్వాత ఒకరి సహాయం మరొకరు పొందుతూ వుంటేనే ఆ బంధానికి అర్థం పరమార్థం." అంటూ భార్య చేతికి పళ్ళెం అందించాడు.

"మీరు తినరా ?"

"ఎందుకు తినను ! అందులో నేనే స్వయంగా వండినవాణ్ణి !" అంటూ వంటగదిలోకి వెళ్ళి తాను కూడా పళ్ళెంలో అన్నం, చారు వడ్డించుకొని భార్య దగ్గరకు వచ్చాడు.

భోజనాలు పూర్తయ్యాక కాస్త చల్లటి గాలి కోసం వసారాలోకి వచ్చి కూర్చున్నారు. హరిసర్వోత్తమరావు ఏదో చెప్పబోతుండగా రామాబాయి దృష్టి తమ ఇంటి ముందే తచ్చాడుతున్న ఓ వ్యక్తిపై నిల్చింది.

భర్తకు ఆ వ్యక్తిని చూపిస్తూ అంది.

"ఎవరండీ అతను ? నేను తరచూ గమనిస్తూనే వున్నాను. రాత్రిళ్ళు మనింటి ముందు తచ్చాడుతూ వుంటాడు."

భార్య ప్రశ్నకు సమాధానంగా చిన్నగా నవ్వి బదులు చెప్పాడు. "శిక్షాకాలం పూర్తయినా ఈ ప్రభుత్వం నాపై నిఘా వేయటం మానలేదుగా. రాత్రిళ్ళే కాదు రాముడూ ! నీవు గమనించలేదేమో ! నేను ఆఫీసుకు వెళ్ళేప్పుడూ, వచ్చేప్పుడు కూడా ఓ గూఢాచారి నీడలా నన్ను వెంబడిస్తున్నాడు. అంతే కాదు మన ఇంటికి వచ్చిపోయే వాళ్ళ పేర్లు కూడా డైరీలో వ్రాసుకుంటున్నాడు. కారాగార వాసం ఒక ఎత్తయితే, ఈ గూఢాచారుల బెడద మరొక ఎత్తయింది ! నా పై నిఘా వేయడం ఈ ప్రభుత్వం ఎప్పటికి మానుతుందో ఏమో ?"

భర్త చెప్పింది విన్న రామాబాయి కళ్ళలో భయం సన్నగా కదలాడి అంది, "వీరి వల్ల మీకేమైనా ప్రమాదమా ?" ఆదుర్దాగా అడిగింది.

"ఇల్లాంటి వాటి కన్నింటికీ జంకితే మనం మనుగడ సాగించలేం ? వీరి గురించి నీవేం ఆందోళన చెందనవసరం లేదు. ఇక నువ్వు వెళ్ళి పడుకో !" అంటూ భార్యను లోపలికి పంపి తచ్చాడుతున్న వ్యక్తి ఆరా తీయటం కోసం బయల్దేరాడు.

* * *

ఉదయం !

హరిసర్వోత్తమరావు తన గదిలో కూర్చుని ఆ రోజు ఆంధ్రపత్రికలో వ్రాయవలసిన సంపాదకీయం గురించి ఆలోచిస్తుండగా, రామాబాయమ్మ వచ్చి, "మీ కోసం ఎవరో వచ్చారండి !" అంది.

"పది నిముషాల తర్వాత మాట్లాడుతాను. కూర్చోమని చెప్పు."

సంపాదకీయం ముగించిన తర్వాత భార్యను పిలిచి చెప్పాడు.

"వెంటనే పంపించు."

"నమస్కారం" అంటూ వచ్చిన వ్యక్తిని చూసి 'కూర్చో' అంటూ కుర్చీలో అతన్ని ఆశీనుణ్ణి చేశాక అడిగాడు 'ఎవరు బాబు ! ఏం కావాలి ?"

"నా పేరు వి.యస్. శర్మ. గుంటూరు సమీపంలోని మధ్యరకం బస్తీ మా వూరు" అంటూ ఓ ఉత్తరం హరిసర్వోత్తమరావు ముందున్న టేబుల్‌పై వుంచాడు.

ఉత్తరం విప్పి చూశాడు హరిసర్వోత్తమరావు. అది మైనంపాటి నరసింహం పంతులుగారు వ్రాసినది. టంగుటూరి ప్రకాశం పంతులు గారి మేనల్లుడు. తనకు మిత్రుడు. తను 'విజ్ఞాన చంద్రికా' గ్రంధమండలిలో వున్నప్పుడు నరసింహం పంతులు గారు మండలి కొక గ్రంధం రచించి ఇచ్చినట్లు గుర్తు !

ఉత్తరం చదివి, బాబుకేసి చూసి "నీకేం పనిచేయాలని వుంది ?" అని ప్రశ్నించాడు.

"మీ కార్యాలయంలో పత్రికా రచన నేర్చుకోవాలని వుంది !" వినయంగా సమాధానం చెప్పాడు శర్మ.

"అలాగా...... సరే....... !" అంటూ 'రాముడూ !" అని పిలిచాడు.

"ఏమండి !"

"వంటయిందా ?"

"ఆ........."

"మా ఇద్దరికీ త్వరగా వడ్డించు !"

"అలాగే !" అంటూ వెళ్ళిపోయింది రామాబాయి.

"సార్........ మీరు భోజనం చేయండి. నేనిక్కడే కూర్చునింటాను." మొహమాట పడుతూ అన్నాడు శర్మ.

"ఫరవాలేదులే. ఎక్కడ మొహమాటం పడ్డా – భోజనం దగ్గర మాత్రం కూడదు. తెలిసిందా ! హోటల్లో భోజనం ఖరీదవుతుంది. లే. కాళ్ళు కడుక్కొని వచ్చి కూర్చో !"

భోజనానంతరం రిక్షా తీసుకొని ఆంధ్రపత్రికా కార్యాలయానికి బయల్దేరారివురు !

రిక్షాలో చెప్పుకొచ్చాడు.

"చూడు బాబూ ! నేను నీకు చేయగలిగిన సహాయం చేస్తాను. అది ఎంతవరకు నెరవేరుతుందో చెప్పలేను !"

శర్మ మౌనంగా తలూపాడు.

రిక్షాపత్రికా కార్యాలయం ముందాగింది. ఇరువురు మేడ మెట్లెక్కి కాశీనాథుని నాగేశ్వరరావు ఆఫీసు గదికేసి నడిచారు.

అప్పటికింకా నాగేశ్వరరావు ఆఫీసుకు రాలేదు !

హరి సర్వోత్తమరావు శర్మవేపు తిరిగి చూసి, "ఇంకా వారు రాలేదు. కాస్సేపు ఈ వరండాలోని బెంచీపై కూర్చో !" అని చెప్పి హరిసర్వోత్తమరావు వరండాలోని తమ గదిలోకి వెళ్ళిపోయాడు.

గంట గడిచింది !

ఆఫీసు బాయ్‌వచ్చి, "శర్మ అంటే నువ్వేనా !" అని అడిగాడు.

"ఔను !"

"నిన్ను ఎడిటర్‌గారు పిలుస్తున్నారు. వెళ్ళి కలువు !"

హరిసర్వోత్తమరావు గదిలో అడుగుపెట్టాడు శర్మ.

పొప్రయిటర్‌గారితో మాట్లాడినాను. నీవు నిరభ్యంతరంగా ఇక్కడ పని నేర్చు కోవచ్చు !" అని చెప్పి అక్కడే కూర్చున్న మేనేజరుకు పరిచయం చేసి, "వారి వెంట వెళ్ళు ! నీకు పని చూపిస్తారు." అని చెప్పాడు శర్మకు !

మేనేజరు శర్మను కార్యాలయం దిగువ భాగంలో వున్న ఒక గదిలోకి తీసుకెళ్ళాడు.

అది కంపోజింగ్ సెక్షన్ : అక్కడ వున్న కంపోజింగ్ హెడ్‌కు శర్మను పరిచయం చేసి పని నేర్పించమని చెప్పి వెళ్ళిపోయాడు మేనేజరు.

సాయంకాలమైంది ! హరిసర్వోత్తమరావు వచ్చి, శర్మను తన ఇంటికి పిల్చుకువెళ్ళాడు.

ఇంట్లో తన గదిలోకి తీసుకెళ్ళిం తర్వాత హరిసర్వోత్తమరావు శర్మను చూస్తూ "పని ఎలా వుంది ?" అని ప్రశ్నించాడు.

శర్మకేం చెప్పాలో తోచలేదు. తను వచ్చింది పత్రికా రచన నేర్చుకోటానికి ! అనుకున్నదొకటైతే జరిగింది మరొకటి ! వాళ్ళప్పగించిన పని కంపోజింగ్. ఆ పని తనకు నచ్చలేదు. కాని ఆ విషయం చెబితే హరి సర్వోత్తమరావుగారేమంటారో అన్న భయంతో ఏమీ చెప్పలేక శర్మ మౌనంగా తలదించేసుకున్నాడు ఆయన ముందు !

అది గమనించిన హరిసర్వోత్తమరావు చిన్నగా నవ్వాడు. శర్మను దగ్గరగా చేర్చుకొని ఆప్యాయంగా వీపు నిమిరి చెప్పాడు.

"చూడు బాబూ ! నిరాశ చెందవద్దు ! మొదట చిన్న పనులు చేయడం నేర్చుకోవాలి. కంపోజింగ్ అన్నది టెక్నికల్ వర్క్. భవిష్యత్తులో దీని ఉపయోగం నీకు తెలుస్తుంది. నేను కూడా నీలాగే అనుకునేవాణ్ణి పిన్న వయసులో ! కాని అవకాశం దొరికినపుడల్లా కంపోజింగ్ కూడా నేర్చుకున్నాను. అన్ని రంగాలలో ఆరితేరాలి. అప్పుడే జీవితం రాణింపుకు వస్తుంది!" అంటూ ధైర్యాన్ని నూరిపోశాడు.

శర్మ "అలాగే !" **అంటూ త**లూపాడు. "బాబూ ! నీకిక్కడెవరైనా తెల్సిన వాళ్ళున్నారా ?" అని ప్రశ్నించాడు హరిసర్వోత్తమరావు.

"లేరు !" అని సమాధానమిచ్చాడు శర్మ.

"అయితే ఫరవాలేదు ! ఈ పట్టణంలో నీవు ఒంటరిగా వుండలేవు. నీవు పని నేర్చుకునేంతవరకు మా ఇంట్లోనే యథేచ్ఛగా వుండవచ్చు !" అంటూ భార్యను పిలిచాడు హరిసర్వోత్తమరావు.

భార్యను చూసి చెప్పాడు హరిసర్వోత్తమరావు.

"ఈ అబ్బాయి ఈ పట్టణానికి కొత్త ! నా ఆఫీసులో పని నేర్చుకున్నన్నాళ్ళు మనింట్లోనే వుంటాడు."

ఆమె మౌనంగా తలూపింది !

"ఇక మా యిద్దరికీ భోజనాలు వడ్డించు !" అన్నాడు హరిసర్వోత్తమరావు.

భోజనానంతరం శర్మ పడుకోటానికి ఏర్పాటు చేసి ఏకాంతంగా భర్త దగ్గరకు వచ్చి "ఏమండీ !" అంది రామాబాయమ్మ.

"ఏంటీ రాముడూ నీ సందేహం ?"

"మరేం లేదు.... మరే........" అంటూ ఎలా చెప్పాలో తెలియక తడబడసాగింది.

"సందేహించక చెప్పు రాముడు ? నా దగ్గర కూడా నా నీ దాపరికం !"

"అబ్బే ! ఏం లేదు. మన సంసారం అంతంత మాత్రంగానే జరుగుతోందన్న సంగతి మీకు తెల్సు. మీకొచ్చే జీతం కూడా ఆ మాత్రమే ! ఏదో వుంది తింటూ గుట్టుగా కాపురం జరుపుకుంటున్నాం. ఇన్నాళ్ళు ! ఇటువంటి పరిస్థితుల్లో ఆ అబ్బాయికి మనం కడుపునిండా అన్నం పెట్టగలమా !"

"ఓహ్ ! ఏమో అనుకున్నాను. అదా నీ బాధ రాముడూ ! ఆ అబ్బాయి ఒంటరిగా ఈ పట్నంలో వుండగలడంటవా ? మనకు ఒక పూట అన్నం తక్కువైనా సరే... భరించి ఆ

అబ్బాయిని సంతృప్తి పరచుదాం ! మనం తిన్నా, తినకున్నా మన దగ్గరకు వచ్చినవాళ్ళను ఆదరించడం మన విద్యుక్త ధర్మం !" అన్నాడు హరిసర్వోత్తమరావు.

రామాబాయి మారు మాట్లాడలేదు.

*　　*　　*

హరిసర్వోత్తమరావు, 'ఆంధ్రపత్రిక' కార్యాలయానికి పాఠకులు వ్రాసిన ఉత్తరాలను పరిశీలిస్తుండగా –

"సార్ ! మీకు ఉత్తరం !" అంటూ ఆఫీస్‌బాయి, టేబుల్‌పై వుంచాడు.

ఉత్తరం విప్పి చదవటం ప్రారంభించాడు హరిసర్వోత్తమరావు.

ప్రియమైన సర్వోత్తమరావుకు !

మీ పినతండ్రి శ్రీనివాసరావు ఆశీర్వదించి వ్రాయు ఉత్తరమేమనగా – క్షేమం. నీ క్షేమ సమాచారములు తెలుపేది.

ముఖ్యంగా ఉత్తరం వ్రాయటం ! నీలో మార్పు వస్తుందని ఇంతకాలంగా ఎదురుచూశాను. కాని నా ఎదురుచూపు అడియాసే అని తేలాక కూడా ఇంకా ఎదురుచూడటం అవివేకమే అవుతుంది. గతంలో మీ అత్తగారింట్లో నీతో చెప్పిన విషయాన్ని అమలుచేయదల్చుకున్నాను. నేను, మన బంధువర్గములోని ఓ అబ్బాయిని దత్తు తీసుకుంటున్నాను. నా ఆస్తిపాస్తులన్నీ ఇకపై అతనికి చెందగలవు. పినతండ్రీ అనే బంధాన్ని కూడా మరచి కోరి కష్టాలు తెచ్చుకొనే నీలాంటి ప్రజాసేవకుడికి ఏమని చెప్పగలను ?

ఉంటాను,

ఆశీర్వచనములతో

ఇట్లు

మీ పినతండ్రి శ్రీనివాసరావు.

పినతండ్రి వ్రాసిన ఉత్తరాన్ని చదువుతున్న హరిసర్వోత్తమరావు మనసులోనే చిన్నగా నవ్వుకుంటూ ప్రత్యుత్తరం వ్రాయడం ప్రారంభించాడు.

గౌరవనీయులైన చిన్నాన్నగారికి :

మీ కుమారుడు హరిసర్వోత్తమరావు నమస్కరించి వ్రాయు ఉత్తరం.

మీ ఉత్తరం అందినది ! ఈనాటికైనా, నా మనస్తత్వాన్ని గ్రహించి మీరీ నిర్ణయం తీసుకున్నందులకు చాలా సంతోషిస్తున్నాను.

నా ఖర్మకు నేనే బాధ్యుడ్ని ! ఇక కష్టాల విషయమంటారా ! పుట్టగానే తల్లిని పోగొట్టుకున్నవాణ్ణి ! ఆ రోజు మొదలు నేటివరకు కష్టాలే నాకు చుట్టాలయ్యాయి. కన్నీళ్లే నాకు వరాలయ్యాయి. కష్టజీవితాన్ని నమ్ముకున్న నేను సౌఖ్య జీవితాన్ని గురించి ఏనాడు ఆలోచించలేదు. అందుకే మీ ఆస్తిపాస్తుల పట్ల నాకు వ్యామోహము లేదు. అలాగని సౌఖ్యజీవితాన్ని గడిపేవారిని నేనెన్నడు కించపరచలేదు. అసూయపడలేదు. పినతండ్రిగా నాపట్ల మీ ధర్మాన్ని నిర్వర్తించాలని చూశారు. కాని నేనందుకు అర్హుని కాలేను !

సదా మీ ఆశీర్వాదాలు నా కెప్పుడూ లభిస్తాయని ఆశిస్తూ -

ఇట్లు

మీ కుమారుడు

హరిసర్వోత్తమరావు

వ్రాసింది, ఓ మారు చదువుకున్న హరిసర్వోత్తమరావు బాయ్‌ని పిల్చి, 'ఈ ఉత్తరం పోస్టు చెయ్యి' అంటూ అతని చేతికిచ్చి, తిరిగి పాఠకులు వ్రాసిన ఉత్తరాలను పరిశీలించడంలో నిమగ్నమయ్యాడు.

* * *

ఆంధ్రపత్రిక సంపాదకుడన్న పేరేగాని, వేతనం చాలా తక్కువ. అందుకని ఆఫీసు నుండి యింటికి వచ్చిన తర్వాత హెచ్.వి. కృష్ణ కంపెనీ కార్యక్రమాలలో నిమగ్నమై లోకాన్నే మరచిపోయేవారు హరిసర్వోత్తమరావు. ఆ విధంగా కొంత ఆదాయం సమకూరేది ! కాని ఆ అదృష్టం కూడా ఎంతో కాలం సాగలేదు.

హెచ్.వి. కంపెనీ ఆర్థికంగా దెబ్బతింది. అయినా నిరుత్సాహపడకుండానే 'ఆంధ్రపత్రిక' ఎడిటర్‌గా తన విధులను సక్రమంగా నిర్వహిస్తూ వున్నాడు హరిసర్వోత్తమరావు. అతని సంపాదకీయాలు, ఆంధ్ర ప్రజానీకాన్ని ఉద్రూతలూగించి స్వరాజ్య ఉద్యమం పట్ల ఆసక్తిని రేకెత్తిస్తున్న తరుణంలో.....

ఓరోజు.....

తాను వ్రాసిన సంపాదకీయం మార్పులు చెంది ప్రచురింపబడేసరికి, తనకంటూ సొంత అభిప్రాయాలు వున్న హరిసర్వోత్తమరావుకిది నచ్చలేదు. నేరుగా పంతులుగారి దగ్గరకు వెళ్లి అడిగారు.

"నేను వ్రాసిన సంపాదకీయం ఎవరు మార్చారు ?"

"సబ్ ఎడిటర్‌తో నేనే మార్చమన్నాను. మీరు వ్రాసిన సంపాదకీయంలో బ్రిటిష్ పాలకులపై చేసిన విమర్శ చాలా తీవ్రస్థాయిలో వున్నది. ఇందువల్ల మళ్లీ నీపై మళ్లీ రాజద్రోహ నేరం ఆరోపింపబడే అవకాశముంది. అందుకని ఈ మార్పుని సూచించాను."

పంతులుగారి మాట విన్న హరిసర్వోత్తమరావు "సంపాదకుడికంటూ, కొంత సొంత అభిప్రాయాలుంటాయి ! వాటికనుగుణంగానే సంపాదకీయం వ్రాస్తాడు. తాను వ్రాసిన సంపాదకీయం తన అనుమతి లేక మార్పు చేయటం జరిగినపుడు – ఇక ఆ పత్రికలో సంపాదకుడిగా వుండటం భావ్యంకాదు ! అందుకే నా సంపాదకత్వ బాధ్యత నుంచి విరమించుకొంటూన్నాను."

హరిసర్వోత్తమరావు నిర్ణయము విన్న పంతులుగారు అతనివంక విస్మయంగా చూస్తుండిపోయారు.

* * *

వంటపని పూర్తిగావించిన రామాబాయమ్మ ఆశ్చర్యంలో పడింది !

కారణం !

ప్రతిరోజు "వంట అయిందా ! త్వరగా వడ్డించు !" అని అడిగే భర్త ఈ రోజు వంట ఇంటిగడపయినా తొక్కలేదు.

కారణం ఏమై వుండవచ్చు ?

తెల్సుకుందామని భర్త గదిలోకి వచ్చి అడిగింది !

"ఏమండీ ! ఈవేళ ఆఫీసుకు వెళ్లరా ?"

శూన్యంలోకి చూస్తూ, "నాకు ఈ రోజుతో ఆఫీసు రుణం తీరిపోయింది. ఉద్యోగం మానేశాను.

భర్త నోటివెంట వచ్చిన మాటకు రామాబాయి అవాక్కయిపోయింది !

అవాక్కయి నిల్చొన్న భార్యను చిన్నగా తడుతూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

"ఏం రాముడూ అలా అయిపోయావ్ !"

"ఉద్యోగం మానేశారా. దేనికి ?"

"నీకు తెలుసుగా నా ప్రవృత్తి !"

తెలుసన్నట్లుగా తలూపి, అడిగింది.

"మరిప్పుడు మన జీవనాధారం !"

భార్య సూటిగా అడిగిన ప్రశ్నకు ఏమని జవాబివ్వాలో తోచక మౌనం వహించాడు హరిసర్వోత్తమరావు.

* * *

# 17

కాలచక్రంలో 20 సంవత్సరాలు గిర్రున తిరిగాయి ! దానితోపాటు హరిసర్వోత్తమరావు దృక్పథంలో కూడా మార్పు వచ్చింది. అట్టడుగున వున్న సామాన్య మానవుని విజ్ఞానవంతునిగా చేయటమే జీవితపరమావధిగా నిర్ణయించుకున్నాడు. అందుకు సరియైన శిక్షణ నిచ్చి మంచి పౌరులుగా తీర్చిదిద్దగలిగిననాడు కాని తన జీవితానికి సార్థకత చేకూరదు అని విశ్వసించాడు. సామాన్య మానవునికి చదువే లేకుంటే విజ్ఞానమెట్లు సిద్ధిస్తుంది ? కనుక వయోజనులను, చదువరులను చేయాలని తలంచాడు. శిక్షణ లేని మానవుడు, శిక్షణ లేని జాతి స్వాతంత్ర్యం పొందినా వర్థిల్లడం కష్టం. అందుకోసం పాటుపడాలని నిర్ణయించుకున్నాడు.

తత్ఫలితం ?

వయోజన విద్య ప్రచార నిమిత్తం మద్రాసు నుంచి నిడుదవోలు చేరుకొన్న హరిసర్వోత్తమరావు, తణుకు వెళ్లే నిమిత్తం రైల్వేస్టేషన్‌లో అటూ ఇటూ పచార్లు చేస్తుండగా, ఓ వ్యక్తి అతని చెంతకొచ్చి "నమస్కారమండీ ?" అంటూ గౌరవ పూర్వకంగా నమస్కరించాడు.

ప్రతి నమస్కారం చేస్తూ అడిగాడు హరిసర్వోత్తమరావు.

"గతంలో మనిద్దరి మధ్య పరిచయం లేదనుకొంటాను !"

"'లేదండీ ! మిమ్మల్ని ఓరెన్నేళ్లక్రితం బెజవాడలో జరిగిన గ్రంథాలయ సమావేశంలో చూశాను. ఆ సమయంలో అప్పుడు మీతో పరిచయం చేసుకోవాలనుకున్నాను. కాని అవకాశం లేకపోయింది. కాని, ఈవేళ...... ఇలా మీతో పరిచయం కలగడం నాకు చాలా ఆనందంగా వుంది !

అతని మాటలకు మందహాసం చేశాడు హరిసర్వోత్తమరావు. తన పరిచయం గురించి అతనే చెప్పుకొన్నాడు.

"నా పేరు గోపరాజు వెంకటానందమండీ ? పత్రికలకు వార్తలు వ్రాసి పంపుతుంటాను."

"ఫ్రీలాన్స్ జర్నలిస్ట్‌వన్నమాట !"

"అవునండీ !" మీరెందాక వెళ్తున్నారు ?"

"తణుకు దాక !" సమాధానమిచ్చాడు హరిసర్వోత్తమరావు.

"నేను మధ్యలో వచ్చే భీమడోలులో దిగి పోవాలి. అంతవరకూ మీతో ప్రయాణించేదా ?"

గోపరాజు అడిగిన విధానానికి చిరుధరహాసంతో అన్నాడు హరిసర్వోత్తమరావు.

"రైలు నా సొంతాందేం కాదు కదా ! నా అనుమతితో ప్రయాణించడానికి ! నిరభ్యంతరంగా నా పక్కనే కూర్చొని ప్రయాణం చేయవచ్చు !"

వీరిద్దరి మాటలు ఇలా సాగుతుండగా వారు ఎక్కవలసిన రైలు వచ్చి ఆగింది.

గోపరాజు, హరిసర్వోత్తమరావు బెడ్డింగ్‌ను తీసుకోబోతుండగా, వారించి చెప్పాడు.

"నా పనులు నేనే స్వయంగా చేసుకొంటాను. ఈ బెడ్డింగ్ మోయడంతో సహా ! అకారణంగా నాకు సంబంధించిన బరువును, ఇతరులపై మోపడం నా అభిమతానికి విరుద్ధం! పద...... బండెక్కుదాం !"

ఇద్దరూ ఒకే కంపార్ట్‌మెంట్‌లోకి వెళ్లి కూర్చున్నారు. రైలుబండి వూపందుకొని ముందుకు సాగింది ! హరిసర్వోత్తమరావు ముందు కూర్చున్న గోపరాజు వెంకటానందం మెల్లిగా తన కోరికను వెల్లడించాడు.

"గడిచిన ముప్పది అయిదేళ్ల, మీ ప్రజాసేవ గురించి ఇంటర్వ్యూ రూపంగా పాఠకులకు తెలియచేయాలని వుంది. మరి మీ కంగీకారమైతే......."

"ఇందులో అంగీకరించకపోవడమేముంది ? నేను కూడా పత్రికా రంగానికి సంబంధించినవాడినే కదా ! మీరెలాంటి ప్రశ్నలడిగినా జవాబు లివ్వడానికి సిద్ధమే !" అంటూ తన అంగీకారాన్ని తెలియచేశాడు హరిసర్వోత్తమరావు.

గోపరాజు, తన భుజానికి తగిలించుకొని వున్న సంచిలో నుంచి కలం, కాగితాలు తీసుకుని ఇంటర్వ్యూ ప్రారంభించాడు.

**★1. "మిమ్ములను, ఆంధ్ర తిలక్, ఆంధ్ర గాంధీ అంటారే. కారణమేమిటంటారు ?"**

"వందేమాతరం' ఉద్యమంలో పాల్గొనబడి, కాలేజీ నుండి డీబార్ కాబడ్డ నేను, బెజవాడలో కొందరి మిత్రుల తోడ్పాటుతో, 'స్వరాజ్య' వారపత్రికకు సంపాదకత్వం నిర్వహించాను. ఆ సందర్భంగా జరిగిన ఓ సంఘటన కారణంగా, ప్రభుత్వాన్ని విమర్శిస్తూ ఓ సంపాదకీయం వ్రాశాను. ఫలితంగా నాకు మూడేళ్ళు జైలుశిక్ష పడింది ! అదే సమయంలో మహారాష్ట్రలో నాలాగే ఓ ఉదంతంపై బ్రిటిష్‌వారిని విమర్శించి నందుకుగాను, తిలక్‌గారికి కూడా శిక్ష పడింది ! సంపాదకీయాలు వ్రాసి రాజద్రోహ నేరం క్రింద ఒకేరోజు అరెస్ట్ అయ్యాము ! ఈ విషయంలోనే కాక, ఇంకా అనేక విషయాల్లో మా మధ్య భావసామీప్యం వున్నందుకు ఇక్కడి ప్రజలు అలా పిలిచారు! ఇంతకుమించి చెప్పుకోదగ్గ కారణం లేదు. ఇక ఆంధ్ర గాంధీగా పేరొచ్చిన విషయమంటారా ? 1920 లో గాంధీగారు ప్రారంభించిన సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొని, వారు ఆంధ్రదేశ పర్యటనకు వచ్చినపుడు, వారివెంట వుండి

ఉద్యమ ప్రచారం చేసినవారిలో ప్రథముడ్ని కాబట్టి, ప్రజలు ఆ పేరును ఆపాదించారు! వాస్తవానికి గాంధీగారంతటి వ్యక్తిత్వం నాలో లేదు. ప్రజలలా పిలుస్తున్నారే కాని, ఆ పేరుకు నేను అనర్హుణ్ణనే చెప్పాలి !

**★2. 'దిబ్రేవ్ హరిసర్వోత్తమరావ్' అని గాంధీగారిచేత వ్యాఖ్యానం చేయించుకున్నారటా. విన్నాను !**

అయన అలా ఎందుకు వ్యాఖ్యానం చేశారో నాకు తెలియదు ! కాని జరిగిందేమిటంటే 1922 వ సంవత్సరంలో కోర్టుల బహిష్కారాన్ని గురించి ఎ.ఐ.సి.సి. సమావేశంలో చర్చ జరుగుతోంది. బహిష్కారం నుండి న్యాయవాదులను మినహాయించాలని గాంధీగారు ప్రతిపాదన చేశారు. అప్పుడు నేను అన్నాను "ఏమండీ గాంధీగారూ ! మీరు బాగా ఆలోచించే ఈ ప్రతిపాదన చేశారా ? వాది లేకపోతే కోర్టెక్కడ వుంటుంది? వకీళ్ళు జీవించేది వాదుల వల్లనే కదా ! తొలగించదలిస్తే బహిష్కారం నుండి కోర్టులను పూర్తిగా తొలగించండి లేదా తీర్మానాన్ని యథాతథంగా వుంచండి !" అప్పుడు గాంధీగారు పొరపడినామని ఒప్పుకొని బేషరతుగా తమ సవరణని ఉపసంహరించుకున్నారు.

**★ఈ విషయం 'యంగ్ ఇండియా'లో ప్రకటించారట !**

ప్రకటించారేమో ? నేను చూళ్లేదు.

**★3. 1916 లో ఆంధ్ర పత్రిక సంపాదకత్వం నుంచి వైదొలగిన మీరు అనిబిసెంట్‌గారు ప్రారంభించిన 'హోంరూల్ ఉద్యమంలో రాష్ట్ర కార్యదర్శిగా ఆంధ్ర దేశమంతటా పర్యటించారు కదా ! ఆ పర్యటన అనుభవాలేమిటి ?**

భారతదేశమును భారతీయులే పరిపాలింపవలెనననదే హోమ్‌రూల్ ఉద్యమ లక్ష్యము. అనిబిసెంట్ ఏమన్నారో తెలుసా ! To live without freedom is die daily . It is not life but living death.

మితవాదులను, అతివాదులను సమన్వయపరుస్తూ సాగిన ఉద్యమమది. నా పరిధి మేర మన ఆంధ్ర దేశంలోని అతివాదులను, మితవాదులను ఒకచోటికి చేర్చి వెంటనే స్వరాజ్యం కావాలి' అన్న నినాదంతో, పదివేల సంతకాలు చేయించి ఓ మహజర్ను ప్రభుత్వానికి నివేదించడం జరిగింది !

**★4. మీరు 'దినేషనలిస్ట్' అన్న ఆంగ్ల పత్రికను కూడా ప్రారంభించినట్టు విన్నాను.**

1919 మద్రాసులోనే ప్రారంభించాను ఆ పత్రికను ! అయితే అయిదారు సంచికలు వెలువడ్డాక 'Cult & Bullet' అన్న వార్త ప్రచురించినందుకు గాను, ప్రభుత్వం దాని ధరావత్తు సొమ్మును జప్తు చేసుకొంది. ఫలితంగా పత్రిక ఆపివేయక తప్పలేదు.

**★5. "సౌందర్యవల్లి' అను స్త్రీల మాసపత్రికను కూడా నడిపారని.......**

నో ....... నడిపింది...... నేనుకాదు. నా శ్రీమతి రామాబాయమ్మ. మహిళా సమస్యల ప్రకటించుటకు ప్రత్యేకముగా తెలుగు మాసపత్రికను తానే సంపాదకురాలుగా మదరాసు నుండి నడిపింది.

**★6. మీకు భార్యపట్ల అమిత ప్రేమానురాగము వుందని విన్నాము. ఆ ప్రేమకు మీరిచ్చిన కానుక ఏమిటో చెబుతారా ?**

ఆమెకు ప్రేమగా అందించిన ఒకే కానుక ! "వయోజన విద్య – బోధనా క్రమము" అను నేను వ్రాసిన పుస్తకము.

**★7. ఈ ప్రశ్న అడుగుతున్నందులకు క్షమించండి ! ప్రేమ కానుక అంటే ఏదైనా, నగా నట్రో ఇస్తారు కాని మీరు........?**

నేను సరస్వతి పుత్రుడనే కాని లక్ష్మీపుత్రుణ్ణి కాలేకపోయాను !

**★8. సాహిత్యపరంగా జీవితంలో యింతవరకు మీకు జరిగిన తీరని లోటు ఏదైనా వుందా?**

ఆ మహానుభావుడు కొమర్రాజు లక్ష్మణరావు 'ఇకలేరు' అని తెలుసుకున్నప్పుడు నా నవనాడులన్నీ కృంగిపోయాయి. నాతో 'అబ్రహాంలింకను జీవితచరిత్ర' వ్రాయింపజేసిన మహత్తర పురుషుడు. సాహిత్యపరంగా అతడు లేని లోటు నాకు తీరనిలోటు.

**★9. మీరు కొన్నాళ్లు మద్రాసువీడి, తాడిపత్రి, నంద్యాల్లో వున్నారు కదా ! కారణం ?**

1923 లో కొంతమంది మిత్రుల ఆహ్వానంతో తాడిపత్రికి వెళ్లి అక్కడి నుంచి 'మాతృభూమి' అన్న వారపత్రికను కొన్నాళ్ళు నడిపాను. అక్కడ నుంచి నంద్యాలకు మకాం మార్చి అక్కడ "కౌమోదకి' పత్రిక నిర్వహణ బాధ్యత కొన్నాళ్ళపాటు చూడవలసి వచ్చింది !

**★10. మీరు ఎం.ఎల్.ఏ. గా ఎక్కడనించి ఎన్నికయ్యారు. మీ నియోజక వర్గపు ప్రజలకు అందించిన సేవలు వివరించండి ?**

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం నిర్ణయానుసారం 1927 లో జరిగిన మద్రాసు కౌన్సిల్ ఎన్నికల్లో కర్నూలు జిల్లా నుంచి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసి గెలుపొందాను. (కర్నూలు జిల్లానుంచి ఎన్నికైన తొలి ఎం.ఎల్.ఏ వీరే).

**★11. అప్పట్లో మీకు గట్టి పోటీ ఎవరైనా వున్నారా ?**

నాకు ప్రత్యర్థిగా శరభారెడ్డి పోటీ చేయాలనుకున్నాడు. కాని నా మీది అభిమానం కొద్దీ నాతో పోటీ చేయనన్నాడు. రాయలసీమ అభివృద్ధికి ఎన్నో సూచనలను చేసి

ప్రజల కష్టములను ప్రభుత్వ దృష్టికి తెచ్చాను. మహానంది క్షేత్ర ప్రాంతాన్ని వన్యమృగ సంరక్షణ ప్రాంతంగా ప్రకటించేట్లు చేశాను. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రము కొరకు తీవ్రకృషి సల్పాను. ఆంధ్రా యూనివర్శిటీ సెనేట్ సభ్యులుగా ఎన్నికై మెడికల్, ఇంజనీరింగ్ కాలేజీలలో రాయలసీమ విద్యార్థులకు తగిన ప్రాతినిధ్యం వుండేలా చేశాను. అయితే 1930 లో గాంధీగారి శాసనోల్లంఘనం సందర్భంగా, ఆ పదవికి రాజీనామా చేశాను.

**★12. మదరాసు శాసనసభలో మన భారతీయుల పట్ల గౌరవాభిమానాలుండేవా ?**

ఉండేవి కావు. ఒకసారి శాసనసభలో జాతి అహంకారియగు జేమ్సు అనే యూరోపియన్ సభ్యుడు భారతీయులను గూర్చి చులకన చేసి ప్రసంగించాడు. నాకు బాగా కోపం వచ్చేసింది. వెంటనే లేచి ఆ అధిక ప్రసంగమును ఖండించాను.

**★13. మీరు మళ్లీ శాసనసభకు, కేంద్ర శాసనసభకు ఎన్నికగుటకు అవకాశమున్నా ఆంధ్ర రాజకీయ నాయకులలో పొడచూపిన ఈర్ష్య, అసూయలకు బలైపోయారని విన్నాను.**

నాకు పదవీకాంక్ష లేదు. పదవుల కోసం నేనెప్పుడూ ప్రాకులాడలేదు. పార్టీ నిర్ణయానుసారం త్రికరణశుద్ధితో రాయలసీమ నుండి కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ అనంతశయనం అయ్యంగారు, నంద్యాల నియోజకవర్గమునకు కాంగ్రెస్ అభ్యర్థి జి. వెంకటరెడ్డిగార్ల గెలుపునకు కృషి చేశాను.

**14. దత్తమండలాలైన కర్నూలు, కడప, అనంతపురం, చిత్తూరు జిల్లాలను కలిపి 'రాయలసీమ' గా నామకరణం చేశారు. కారణం ?**

ఆ ప్రాంతం రాయలు ఏలిన రాజ్యం కాబట్టి 1928 లో నంద్యాల్లో సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి అధ్యక్షతన జరిగిన ఆంధ్ర మహాసభలో దత్తమండలాలకు 'రాయలసీమ' అని నామకరణము చేసి అంగీకరింపచేశాను.

**15. రాయలసీమ వాసులు ముఖ్యంగా జస్టిస్ పార్టీకి సంబంధించిన నాయకులు 'ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం' పట్ల విముఖత చూపడానికి కారణమేమిటంటారు ?**

రాయలసీమవాసులు ఆర్థికంగా, సామాజికంగా, విద్యాపరంగా, వ్యాపారపరంగా చాలా వెనుకబడినవారు. 'ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పడితే తమకు తగిన ప్రాతినిధ్యం వుండదేమోనని భయపడ్డారు. ఆ భయాన్ని నివారించడానికిగానూ, 1937 లో మద్రాసులోని కాశీనాథుని నాగేశ్వరరావుగారింట్లో ఓ సమావేశం ఏర్పాటు చేసి, అక్కడి నాయకులను పిలిపించడం జరిగింది ! చర్చలు జరిగాక, అందరూ ఓ ఒప్పందానికి

వచ్చారు. ఆ ఒప్పందం ప్రకారం కరువుకాటకాలతో అల్లాడే రాయలసీమవాసులకు నీటిపారుదల విషయంలో తగిన ప్రాధాన్యత ఇవ్వాలని, ఈ ఒప్పందమే 'శ్రీ బాగ్' ఒప్పందంగా వ్యవహరింపబడుతూ వుంది. ఈ ఒప్పందం తర్వాత అక్కడి నాయకులందరూ, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్ణయానికి తమ మద్దతు తెలిపారు.

**16. రాయలసీమవాసిగా, మీరీ ఒప్పందంలో పక్షపాతం వహించారనే విమర్శ వుంది ! దీనికి మీ సమాధానం :**

నాకంటూ ఏ పక్షపాత ధోరణీ లేదు. నేను ప్రాంతీయవాదిని కాను ! దేశీయవాదిని ! నా దృష్టిలో రాయలసీమవారైనా, కోస్తా వాసులైనా అందరూ ఆంధ్రులే ! ఈ ప్రాంతీయ భేదాలు, ప్రత్యేక రాష్ట్రం ఏర్పడే వరకే !

**17. మీరు 1931 లో మడక సిరలో వెనుకబడిన ప్రాంతాల సహకార సంఘముల మహాసభ కధ్యక్షత వహించారని విన్నాం ! 'సహకార సిద్ధాంతం'పై మీ అభిప్రాయం ?**

చక్కని ప్రశ్న వేశావు గోపరాజు ! సహకార సిద్ధాంతము మన వేదాంత సిద్ధాంతముల ననుసరించియున్నది. మనమని అన్యులమని తలంపు మహా చెడ్డది. 'Each for all and all for each'. పదిమంది కోసం బ్రతికిన బ్రతుకే బ్రతుకు. ప్రాచీనకాలంలో మనవారు ధర్మమును గురించి చెప్పిరే గాని, హక్కులను గురించి చెప్పలేదు. "నేను అంటే అహంకారం. అహంకారము కలహమునకు కారణం ! ఇది నైతికోద్యమం - కూడా !' ఇకముందు సహకారమన్నది మతం కాగలదు. విద్యావంతులైనవారు తమ మంచి గుణములను అభివృద్ధి చేసికొని దేశసేవకై నడుముకట్టి సహకారోద్యమమును చక్కని పద్ధతిలో నడుపుకోవలెనన్నదే నా సందేశము !

**18. 1930 వరకూ ఆంధ్ర దేశ రాజకీయాల్లో తలమునకలైన మీరు గ్రంథాలయం, వయోజన విద్యవైపు మీ దృష్టి కేంద్రీకరించడానికి కారణమేమంటారు ?**

మన దేశంలో నూటికి తొంభైమందికి పైగా నిరక్షరాస్యులే ! వారిని అక్షరాభ్యాసుల్ని చేస్తే గాని ఏ ఉద్యమమైనా తొందరగా ఫలిస్తుంది ! అందుకే 1930 నుంచి ఆంధ్ర గ్రంథాలయ సంస్థ అధ్యక్షుని హోదాలోనూ, వయోజన విద్యా డైరెక్టర్ హోదాలోనూ ఆంధ్ర దేశమంతా పర్యటిస్తూ నా వంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నాను.

**19. మీ ఉల్లాసానికి ఏదో విషయముండాలి...... ?**

కరక్ట్ ! సరిగ్గా వూహించావు. నీవు ఈ ప్రశ్నవేసి నా పాత జ్ఞాపకాల్ని స్ఫురణకి తెచ్చావు. గోపరాజూ ఈ విషయం వింటే నీవు నమ్మలేవు ! గ్రంథాలయాలకి క్రొత్త పుస్తకాలు కొనడానికి డబ్బు కావాలి. ఎలా ? ఎలాగో తెలుసా ! ఇంటింటా బియ్యం భిక్షమెత్తేవారు! వింటే ఆశ్చర్యమేస్తుంది కదూ ! ఆ రోజుల్లో అంగలూరులోను, గురజలోను ఎంతో డబ్బు పెట్టి జూదాలాడేవారు. మోటూరి సత్యనారాయణ, ఎర్నెని (సాధు) సుబ్రహ్మణ్యం జూదం ఆడేవారికి త్రాగే మంచినీరిచ్చి, సాయంకాలానికి రెండు మూడు రూపాయలు సంపాదించి పుస్తక భాండాగారానికి ఇస్తుండేవాళ్లట ! అరెకపూడి రామశాస్త్రిగారు వారి గురువు. నిస్వార్థ ప్రజా సేవకుడు. ఆయనకు తెలియకుండానే వీరిద్దరు, భాండాగారానికి డబ్బుకోసం గురజవెళ్లి, సంపాదించిన డబ్బు 'అంగలూరు బాలసరస్వతీ పుస్తక భాండాగార కార్యదర్శి అయిన రామశాస్త్రిగారికి అందచేశారట ! నిజం తెలుసుకున్న శాస్త్రి వారలపై కోప్పడ్డారట ! నిజంగా వాళ్ల తపన ఎంత దూరం వెళ్లిందో చూశావా ?

ఇంతలో భీమడోలు వస్తున్నట్లుగా రైలు కూతేసింది. కలం, కాగితాలను తిరిగి సంచిలో వుంచుకొని చెప్పాడు.

"మీరు శ్రమనుకోక అడిగిన ప్రతి ప్రశ్నకు సూటిగా సమాధానమిచ్చినందుకు చాలా సంతోషం – ఈ ఇంటర్వ్యూ అచ్చయ్యాక ఓ కాఫీ మీకు పంపిస్తాను. కృతజ్ఞతలు !

భీమడోలు స్టేషన్‌లో రైలాగింది !

"వస్తానండీ !"

"మంచిది. వెళ్లిరా బాబు !"

రైలు దిగిన గోపరాజు, తిరిగి రైలు కదిలే వరకూ హరిసర్వోత్తమరావుతో మాట్లాడుతూనే వున్నాడు.

తిరిగి రైలు కదిలి వేగం పుంజుకుంది !

రైలు కనుమరుగు అయ్యేవరకూ, అలాగే నిలబడి చెయ్యి వూపుతూ వుండిపోయాడు గోపరాజు వెంకటానందం !

# 18

మద్రాసు మెరీనా బీచ్ !

బీచ్‌లో కూర్చొని పొంగే సంద్రం వైపు చూస్తూ వుంది ఓ ప్రేమ జంట !

ఇరువురి మధ్య మాటల్లేవు ! మౌనంగానే కళ్ళతో ఇరువురు ఊసులాడుకొంటున్నారు. కొద్దిసేపు గడిచింది ! ఇక మౌనం వీడి ఆ ప్రేమ జంట, మాటల్లోకి దిగింది !

'ద్వారకా !'

'ఊ !'

"నేచెప్పిన విషయం గురించి ఏమాలోచించావు ?"

"ఇంకా మా ఇంటి పెద్దలకు తెలియజేయలేదు. మరి నువ్వో !"

"నేను నీలా పిరికివాడ్ని కాదు ! మొన్నే రాజమండ్రికి వెళ్ళి మా నాన్నగారితో మన ప్రేమ విషయం మొత్తం చెప్పేశాను !"

ఏమన్నారు ?"

"ఏమంటారు ? పలానావారి కూతురు అనగానే సంతోషంతో అంగీకరించాడు !"

"నిజంగా !"

"నిజమే చెబుతున్నాను ! వచ్చే ఆదివారం మద్రాసుకు వచ్చి, మీ నాన్నగారితో మాట్లాడతామన్నారు !"

"మా కుటుంబ ఆర్థిక పరిస్థితి చెప్పావా ?"

"చెప్పాల్సిన అవసరం లేదు".

"తీరా కట్నకానుకల వద్ద పేచీ వస్తే !?"

"అలాంటివేం ఆశించదు మా నాన్న ! మీ నాన్నగారంత గొప్ప ప్రజాసేవకుడు కాకపోయినా, మా నాన్నగారు కూడా సంస్కారవంతుడే ! కాబట్టి కట్నకానుకల ప్రసక్తే వుండదు! అన్నట్లు మీ నాన్నగారు ఇంట్లోనే వుంటారా ఆ రోజు !"

"దేనికి ?"

"మా నాన్నగారు వచ్చినప్పుడు మీ ఇంటి పెద్దగా పెళ్ళి విషయాలు చర్చించడానికి !"

"చెప్పాలి ! చెబితే వుంటారు !"

"సరే !........ అయితే ఈ విషయం మీ నాన్నగారితో చెప్పగలవా ?"

"అబ్బో ! అంత సాహసమా ! అమ్మతో చెబుతాను. ఆమే చెబుతుంది మా నాన్నతో !"

"చీకటి పడుతోంది. ఇక వెళ్దామా !"

"....... ఏమండీ !"

"ఫర్వాలేదు. పార్థసారథి అని మునుపు పిలిచేదానివిగా ! అలాగే పిలు !"

"ఒకప్పుడు.... మనిద్దరం... స్నేహితులం. కాని ఇప్పుడూ......"

"కాబోయే భార్యాభర్తలమంటావా ! సరే ! నీకెలా తోస్తే అలాగే పిలు ! నువ్వెలా పిలిచినా, నాకభ్యంతరముండదు. ఇంతకూ నువ్వు చెప్పదలచుకున్నదేమిటి ?"

"అబ్బే ఏం లేదు !"

"నావద్ద కూడా దాపరికమా !"

"అలాంటిదేం లేదు !"

"మరి...... అరె ! ఏమిటిది. ఆ కన్నీరు ?"

"ఇవి కన్నీళ్లు కావు, ఆనందభాష్పాలు ! మనసుకు నచ్చినవారితో వివాహం నిశ్చయం కాబోతుంటే ఏ ఆడదానికైనా, ఇలాంటి కన్నీళ్ళే వస్తాయి !"

"దేవిగారికి సంగీతంతోపాటు కవిత్వం కూడా అబ్బినట్టుందే ! అవున్లే ఎంతైనా రచయిత కూతురు కదా !"

మళ్ళీ మనకలయిక.....

"వచ్చే ఆదివారం......... మీ ఇంట్లోనే......... ఇక వెళ్దామా !"

"పదండీ !"

*　　　　*　　　　*

"ఏమండీ !"

గ్రంథాలయోద్యమానికి సంబంధించి తిరగాల్సిన వూర్ల గురించి, తన డైరీలో వ్రాసుకొంటున్న హరిసర్వోత్తమరావు, 'భార్య పిలుపువిని తలెత్తి చూశాడు. భార్య తనతో ఏదో విషయాన్ని ప్రస్తావించబోతున్నట్టు గ్రహించి,

"ఏమిటి రాముడూ ?" అంటూ అడిగాడు.

"రేపు.. రాజమండ్రి నుంచి శ్రీనల్లాన్ చక్రవర్తుల రామాచార్యులగారు రొస్తున్నారు !"

"దేనికి ?

"మనమ్మాయిని వారబ్బాయికి అడగడానికి !"

"అబ్బాయి, అమ్మాయి ఒకర్నొకరు చూసుకోకుండా, వారి అభిప్రాయాలు తెల్సుకోకుండా పెళ్ళిచూపు లేమిటి ? ఇలాంటి పద్ధతి నాకు నచ్చదు"

భర్తకాస్త చిరాగ్గా అన్నమాటలకు సమాధాన మిచ్చింది రామాబాయి.

"మన అమ్మాయి, వారి అబ్బాయి ఒకే చోట సంగీతం కోర్సులో కలసి చదువుకున్నారటండీ !"

"అయితే ఇదివరకే పరిచయముందన్న మాట !"

ఏదో ఆలోచన స్ఫురించిన వాడై అన్నాడు హరిసర్వోత్తమరావు.

"అవునండీ ! అబ్బాయి, అమ్మాయి ఒకర్నొకరు ఇష్టపడ్డారట ! అబ్బాయి ఈ విషయం తన తండ్రితో చెప్పాడట ! వారు కూడా అంగీకరించి అమ్మాయిని ఓ మారుచూసి పెళ్ళికి ముహూర్తాలు పెట్టుకుందాం అన్నాడట !" అంది రామాబాయి.

"చాలా కథనడిచిందే ! ఏమో అనుకున్నాను. మన అమ్మాయి గడుసరిదే !" ముసిముసి నవ్వునవ్వుతూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

అతని నవ్వుకు తలుపు చాటునుంచి వింటున్న ద్వారకాబాయి తేలిగ్గా నిట్టూర్చింది ! ఎలాంటి అభ్యంతరం లేక, తండ్రి తన నిర్ణయం పట్ల అనుకూలంగా స్పందించినందుకు ! రామాబాయి కూడా భర్త అంగీకారానికి లోలోపలే ఆనందించింది !

"మరి మీరు రేపు ఏ వూరికి వెళ్ళరు కదూ !"

"వెళ్ళాలి ! అనంతపురానికి. అక్కడ గ్రంథాల యోద్యమానికి సంబంధించిన శిక్షణ తరగతులు ప్రారంభించాల్సి వుంది."

తండ్రి సమాధానం విన్న ద్వారకాబాయిలో ఆందోళన !

"మరి వారొస్తున్నారు కదండీ ఎలా ?" రామాబాయి భర్త వంక ప్రశ్నార్థకంగా చూసింది !

"వారు రేపు ఎన్నింటికి వస్తామన్నారు?" భార్యవంక చూస్తూ అడిగాడు హరిసర్వోత్తమరావు.

"ఉండండి ! అమ్మాయిని కనుక్కొని వస్తాను......" అంటూ కూతరు చెంత కొచ్చిన రామాబాయి అడిగింది.

"వారు ఎన్నింటికి వస్తామన్నారమ్మా !"

"తెలీదమ్మా ! " గాబరా పడుతున్నట్టుగా అంది ద్వారాకాబాయి.

"అబ్బాయిని అడగలేదా ?"

"లేదమ్మా ........... !"

చిన్నగా నిట్టూర్చి తిరిగి భర్త దగ్గరికెళ్ళి అంది రామాబాయి "తెలీదటండీ...... ఆ అబ్బాయి రేపు వస్తారని చెప్పారట ! ఏ వేళప్పుడు వచ్చేది చెప్పలేదట !"

"సరే ! సాయంకాలం వరకు చూస్తాను. ఆలోపు వస్తేసరి ! లేదంటే నువ్వే నిశ్చయతాంబూలాలు పుచ్చేసుకో !"

"అదేమిటండీ ? అలా అంటారు. ఇంటిపెద్ద మీరు లేకుండా ఆ పెద్ద మనిషితో నిశ్చయతాంబూలాలు ఎలా పుచ్చుకోనూ..."

భార్య మాటలకు నవ్వుతూ అన్నాడు హరిసర్వోత్తమరావు. "పిచ్చిదానా, ఇంటిపెద్ద అంటే మగాడనే అనుకొంటే ఎలా ? ఇంటిపెద్దగా భార్యకు కూడా గుర్తింపు వుంది ! కాబట్టీ ఈ విషయంలో సంకోచించకనే చెప్పినట్టు చెయ్ !"

"పోనీ రేపు మీ ప్రయాణం మానుకోరాదూ !"

"మానుకోవడం జరుగదు ! గ్రంథాలయ అధ్యక్షుడిగా వుండీ; నే వెళ్ళకపోతే బాగుండదు "

భర్తతో ఏమి చెప్పాలో దిక్కుతోచని రామాబాయి మౌనంగా భర్త దగ్గర్నుంచి నిష్క్రమించింది.

తండ్రి నిర్ణయాన్ని విన్న ద్వారకాబాయి కళ్ళలో నీళ్ళు తిరిగాయి !

"భగవాన్ ! మా నాన్న ప్రయాణమై పోయేలోపు వాళ్ళను వచ్చేలా చెయి స్వామీ !" మనసులోనే దేవుని ధ్యానించుకొంటూ తనగదిలోకి వెళ్ళిపోయింది ద్వారకాబాయి !

హరిసర్వోమరావు తిరిగి శిక్షణ తరగతుల్లో బోధించవలసిన అంశాన్ని గురించి డైరీలో వ్రాసుకోవడంలో నిమగ్నుడయ్యాడు.

*　　　　*　　　　*

మర్నాడు ఉదయం మొదలు సాయంకాలం ఐదింటి వరకు ఎదురు చూసినా, పార్థసారధికాని, అతని తండ్రిగాని రాకపోయే సరికి, ద్వారకాబాయి ముఖం కళా విహీనమయ్యింది. మనసులో రకరకాల ఆలోచనలు ! ఏమిటిది ? ఎందుకిలా జరుగుతోంది? ఆయనతో తనకు వివాహమయ్యే అవకాశం లేదా ?

రామాబాయిలో కూడా ఉద్వేగం !

తల్లీ, కూతురిద్దరు నిట్టూర్పులు వొదులుతూ కళ్ళతోనే ఒకరివంక వొకరు చూసుకుంటున్నారే కాని, పెదవి విప్పి మాట్లాడుకోవడం లేదు !

అప్పటిదాక తాను కూడా, ఎదురు చూసన్తూవాలు కుర్చీలో కూర్చున్న హరిసర్వోత్తమరావు, రైలుకు వెళ్ళే సమయం దగ్గరవు తుండడంతో ప్రయాణానికి కావలసిన సరంజామా సర్దుకొని, భార్యను పిలిచి చెప్పాడు.

"ఇంకో అరగంటలో రైలుంది ! నేను వెళ్ళాలి !"

ఏం చెప్పాలో సమాధానం తోచక మౌనంగా కళ్ళనిండా నీళ్ళు నింపుకొని 'అలాగే !' అన్నట్టుగా తలూపింది రామాబాయి. అదే సమయంలో........

"నమస్కారమండీ !" అన్న పిలుపు వినిపించడంతో, గుమ్మం వైపు దృష్టి మరల్చారు భార్యా భర్తలిద్దరూ !

గుమ్మం ఆవల పార్థసారథి, అతని తండ్రి రామాచార్యులు !

"రండి !" సాదరంగా లోపలికి ఆహ్వానించారు దంపతులిద్దరూ !

"ఆలస్యమైనందుకు క్షమించాలి !" హరిసర్వోత్తమరావు వంక చూస్తూ అన్నాడు రామాచార్యులు.

"మరేం ఫర్వాలేదు......."

"మీరెక్కడికో ప్రయాణమైనట్టున్నారు ?" అడిగాడు రామాచార్యులు.

"అవునండీ ! అనంతపురం వెళ్ళాలి..... ఆరింటికి బయల్దేరేట్రైన్‌లో వెళ్ళాలి ! కాబట్టీ మనం త్వరగా మాట్లాడుకుంటే బాగుంటుంది !"

అర్థమైందన్నట్లుగా తలూపి చిన్నగా నవ్వుతూ చెప్పాడు.

"మా ఆలస్యమేం లేదు. అమ్మాయిని చూసి నిశ్చయ తాంబూలాలు తీసుకోవడమే !"

"రాముడూ!" అంటూ భార్యవైపు చూశాడు హరిసర్వోత్తమరావు. రామాబాయి వడివడి అడుగులతో కూతురున్న గదిలోకి వెళ్ళి చెప్పింది.

"పెళ్ళి చూపులకు త్వరగా తయారవ్వూ !"

తల్లి సమాధానం విన్న ద్వారకాబాయి మనసులో ఆనందం పొంగి పొర్లింది. గబగబా అలంకరించుకొని గదిలోకి వచ్చింది.

తనకు కాబోయే కోడల్ని నింపాదిగా, నఖశిఖ పర్యంతం గమనించిన రామాచార్యులు సంతృప్తి చెంది, కొడుకు వంక అభినందన పూర్వకంగా ఓ చూపు విసిరి హరిసర్వోత్తమరావుతో చెప్పాడు.

"అమ్మాయి మాకు బాగా నచ్చింది"

"కట్న కానుకలు నేను ఇవ్వను !"

"వాటిపై మాకు ఆశలులేవు లెండీ. మీ అమ్మాయి మా ఇంటి కోడలైతే చాలు !... మరి నిశ్చయ తాంబూలాలు తీసుకుందామా"?

"అలాగే కానివ్వండి !" అంటూ అంగీకరించాడు హరిసర్వోత్తమరావు

నిశ్చయతాంబూల ప్రదానం జరిగాక, చెప్పాడు రామాచార్యులు "వచ్చే మాసం మే 22వ తారీకున మంచి ముహూర్తముంది. ఏ మంటారు ?"

"మీ ఇష్టం ! కానీ నాదొక షరతు !"

"షరతా ! ఏమిటది ?" తండ్రీ కొడుకు లిద్దరూ హరిసర్వోత్తమరావు వంక అనుమానంగా చూశారు.

"పెళ్ళి ఆడంబరంగా జరిపించడం నాకు నచ్చదు. నిరాడంబరంగా తిరుక్కలి కుండ పక్షి తీర్థం వద్ద సంస్కరణ వివాహం జరిపిద్దాం !"

ఏదో మాట్లాడబోయిన తండ్రిని కళ్ళతోనే ఒప్పుకోమనట్టుగా సంజ్ఞచేశాడు పార్థసారథి. కొడుకు సంజ్ఞను అర్థం చేసుకొన్న రామాచార్యులు.

"సరే ! మీ ఇష్టం ! మీరు కోరిన ప్రకారమే వివాహం జరిపిద్దాం ! మరి మాకు శలవా ?" అంటూ లేచినిల్చున్నాడు రామాచార్యులు !

తండ్రి, కొడుకులిద్దర్నీ, వీధి గుమ్మం దాకా సాగనంపి వచ్చాక, గోడ గడియారం వంక చూశాడు హరిసర్వోత్తమరావు సరిగ్గా 5.45 నిమిషాలైంది !

హరి సర్వోత్తమరావులో కంగారు ! "రాముడూ ! నే వెళ్ళొస్తాను. పావుగంటలో స్టేషన్ చేరుకోవాలి !"

అంటూ హడావిడిగా ప్రయాణమై వెళ్తున్న హరి సర్వోత్తమరావు వంక మౌనంగా చూస్తుండి పోయారు తల్లీ కూతుర్లిద్దరూ ! ప్రజాసేవ పట్ల అతనికున్న అంకిత భావానికి గర్వించాలో, సంసార పక్షంగా సరియైన న్యాయం చేయలేకపోతున్నందుకు గర్హించాలో అర్థంకాలేదు వారిరువురికి !

* * *

హరిసర్వోత్తమరావు నుంచి శెలవు తీసుకొని పార్థసారథి వెంట, అతను వుంటున్న అద్దెగది చేరుకున్నాడు రామాచార్యులు. గదిలోకి ప్రవేశించగనే కొడుకు వంక విద్దూరంగా చూస్తూ అన్నాడు.

"ఎంత ప్రజాసేవకుడైతే మాత్రం, ఏమిట్రా ఇదీ ! మరీ బొత్తిగా దండల పెళ్ళి చేయాలంటాడేమిటి ?"

"ఎలా చేసుకున్నా పెళ్ళే కదా నాన్న !"

"అయినా మరీ ఇంత నిరాడంబరంగా పెళ్ళంటే ఏం బాగుంటుందీ మన సంప్రదాయ ప్రకారం శాస్త్రోక్తంగా బంధువులందర్నీ పిలిచి ఘనంగా చేస్తేనే "పెళ్ళి" అనిపించుకుంటుంది. లేకుంటే నలుగురూ నవ్విపోరూ !"

"చూడునాన్నా ! రోజులు మారుతున్నాయి వాటితోపాటు మనం కూడా మారాల్సి వుంటుంది ! తాహతువున్నా, లేకున్నా తలకు మించి ఘనంగా పెళ్ళి చేయడం వల్ల ప్రయోజనమేమీ లేదని నా అభిప్రాయం ! దయచేసి ఇక ఎలాంటి అభ్యంతరాలు తెలియ జేయకండి !"

"చూడబ్బీ ! నా మాటవిను ! ఇలా దండల పెళ్ళి చేస్తే మన బందు వర్గంలో చులకన అవుతాం ! పెద్దవాడిగా చెబుతున్నాను."

వివాహం జరిగే పద్ధతిలో కొడుకు మనసు మార్చాలని, ప్రేమగా రామాచార్యులు చేసిన ప్రయత్నం ఫలించలేదు. చివరకి రామాచార్యులు కొడుకు నిర్ణయం పట్ల మెత్తబడక తప్పలేదు.

"నీవన్నీ మీ అమ్మ బుద్ధులేరా ! ఏది చెప్పినా వినవు ! సరే ! ఎవరి పెళ్ళి ఎలా జరగాలో ముందే ఆ విధాత వారి నుదుట వ్రాసివుంటాడట ! ఇక దాన్ని తప్పించడం ఎవరికీ సాధ్యంకాదు..... సర్లే వెళ్ళి వంట ప్రయత్నంచూడు ! నేనీలోపు స్నానం చేసి మడికట్టుకొని సందెవారుస్తాను." అంటూ బట్టలు మార్చుకోవడానికి వెళ్తున్న తండ్రి వంక ఓ మారు కృతజ్ఞతా పూర్వకంగా చూసి, ఎక్కడలేని హుషారుతో వంటగదిలోకి అడుగులు వేశాడు పార్థసారధి !

*　　　　*　　　　*

తాను అనుకున్న ప్రకారం, మహాబలిపురం దగ్గర్లోవున్న తిరుక్కళి కుండ పక్షి తీర్థం వద్ద, పెళ్ళి నిరాడంబరంగా జరిపిన హరిసర్వోత్తమరావు, కూతురు, అల్లుడు బలవంతం మేరకు, వారితోపాటు తాను, తన అర్ధాంగి కలిసి వుండటానికి అంగీకరించాడు.

# 19

కొన్నాళ్ళు గడిచాయి... ఓ రోజు........

"ఏమండీ ! టిఫిన్ తీసుకోండి !" అంటూ తనముందు టిఫిన్ పెట్టి వెళ్తున్న తన భార్య ద్వారకాబాయిని పిల్చి అడిగాడు పార్థసారథి

"ద్వారకా ! మీ అమ్మగారి అనారోగ్యం కాస్తయినా తగ్గుముఖం పట్టిందా ?"

"అలాగే వుంది ! అనారోగ్యంగా వున్నావు. ఏ పనిచేయకమ్మా ? అని అంటే వింటేగా ! అన్ని పనులు తానే చేయాలంటుంది. ఏంటో ఆమె పిచ్చి ! ఈ వయసులో కూడా కాస్త విశ్రాంతి తీసుకుందామనుకోదు. ఇక నాన్న సంగతి సరే సరి ! ఆయన కెప్పుడూ ప్రజాసేవే ! ఇంటి విషయాలు, ఇంట్లోని వ్యక్తుల విషయాలు అట్టే పట్టవు. ఏం మనుషులో ఏమో ! ఇద్దరూ ఇద్దరే ! చెప్పింది ఏదీ విన్పించుకోరు !" అంటూ చిన్నగా నిట్టూర్చింది ద్వారకాబాయి.

తన భార్య చెప్పింది కూడా నిజమే అనిపించడంతో, మౌనంగా టిఫిన్ తిని డ్రస్సు మార్చుకుని బయటికి వెళ్తూ భార్యతో చెప్పాడు పార్థసారథి.

"నేనలా సంగీత కళాశాలకు వెళ్ళొస్తాను !"

"అలాగే !" అన్నట్టుగా తలూపి తిరిగి వంట గదిలోకి వెళ్ళింది ద్వారకాబాయి.

పెరట్లో నిల్చొని ముఖం కడుక్కొంటున్న రామాబాయి నోట్లో నీళ్ళు పోసుకొని పుక్కిలించి వుమ్మివేస్తుండగా నోట్లో నుంచి రక్తం పడింది. ఆ రక్తాన్ని చూడగానే ఆమె గుండె ఝుళ్ళుమంది!

అదే క్షణాన కళ్ళు కూడా తిరిగి నట్టనిపించాయి. మెల్లిగా పక్కనే వున్న రాతిబండపై కూర్చోంది ! ఆమెకు కూతురుకు సంబంధించిన ఆలోచనలు చుట్టుముట్టగా ఇలా తలపోసింది.

"ఈ విషయం, అమ్మాయికి తెలిస్తే, ఇంకేమయినా వుందా ? ఆ చిన్నారి హృదయం విలవిలలాడిపోదూ ! తన జీవితానికి సంధ్యాసమయం ఆసన్నమయింది. ఇక తానేమై పోయినా ఫర్వాలేదు. కాని ఈ విషయం మాత్రం అమ్మాయికి తెలియ కూడదు."

పై ఆలోచనతో కొట్టు మిట్టాడిన రామాబాయి కూర్చొన్న స్థానం నుంచి లేచి, రక్తం పడ్డ చోటును నీటితోశుభ్రపరచదానికి ఉద్యుక్తురాలవుతుండగా, అదే సమయానికి తల్లికి ఇవ్వడం కోసం, కాఫీ కప్పుతో పెరట్లోకి వచ్చిన ద్వారకాబాయి తన తల్లి ప్రయత్నాన్ని చూసి హతాశురాలవుతూ అడిగింది.

"ఈ రక్తం ఏంటమ్మ ?"

"అబ్బే ! ఏం లేదు లేవే ! కాస్త ఒంట్లో ఉష్ణం ఎక్కువైందంతే...." అంటూ తడబడుతూ చెప్పింది రామాబాయి.

"ఇలా ఇంకెప్పుడైనా జరిగిందామ్మా !" తల్లి ముఖంకేసి చూస్తూ గాబరాగా అడిగింది ద్వారక.

"లేదే ఇవేళే...." అని అందేకాని రామాబాయమ్మ ముఖంలో ఆందోళన !

"కూతురి దగ్గర నా నీ దాపరికం ! రామ్మా !" అంటూ గదిలోకి తీసుకెళ్ళి కూర్చోబెట్టి, వేడివేడి ఇడ్లీ ముక్కలు చేసి చట్నీ అంటించి తల్లికి తినిపించాక పక్కపై పడుకోబెట్టి తిరిగి వంటగదిలోకి వచ్చి వంట చేస్తోందన్న మాటేగాని ద్వారకాబాయి మనసులో ఏవేవో అనుమానపు ఆలోచనలు ! భర్తకోసం ఆరాటంగా ఎదురు చూడసాగింది !

సాయంకాలం తన భర్త ఇంటికి రాగానే జరిగిన విషయం అంతా చెప్పి కళ్ళనీళ్ళు పెట్టుకుంది ద్వారకాబాయి.

భార్య చెప్పింది విన్న పార్థసారథి "నిజంగానా !" అంటూ అత్తగారున్న గదిలోకి వెళ్ళాడు.

"అత్తయ్యగారూ !"

పక్కపై మగతగా నిద్రపోతూన్న రామాబాయి మెల్లిగా కళ్ళు తెరచి పార్థసారథి వంక చూసింది.

"అత్తయ్యగారూ డాక్టర్‌గారి దగ్గర కెళ్ధాం పదండి !"

"డాక్టరు దగ్గర కెళ్ళ వలసినంత అవసరం ఏం లేదులే బాబూ ! కాస్త వేడి చేసిందంతే ! చిట్కా వైద్యంతో పోతుంది."

"చిట్కా వైద్యం మీ సంతృప్తి కొరకు, డాక్టర్‌గారి దగ్గర కెళ్ళటం మా సంతృప్తి కొరకు. రండి వెళదాం !" అంటూ బలవంతం చేసి అత్తగారిని తమ వెంట వచ్చేందుకు అంగీకరింపజేశాడు పార్థసారథి !

ఓ వారం రోజుల గడువులో రామాబాయిని అన్ని విధాల పరీక్షించిన డాక్టరు, పార్థసారథిని తన గదిలోకి వంటరిగా పిల్చి చెప్పాడు.

"మీ అత్తయ్యగారికి వచ్చింది మామూలు వ్యాధికాదు. క్యాన్సర్ !"

డాక్టరు చెప్పింది విన్న పార్థసారథి ఒక్కమారుగా శిలా ప్రతిమలా నిల్చుండి పోయాడు!

"మీ అత్తయ్యగారు ఆరోగ్య విషయంలో చాలా అశ్రద్ధ చేశారు. ఫలితంగా ఆమె వ్యాధి బాగా ముదిరిపోయింది. ఈలంగ్ క్యాన్సర్ వ్యాధికి ప్రస్తుత పరిస్థితిలో రేడియంట్రీట్‌మెంట్ మాత్రమే కాస్తా ఉపయోగకరంగా వుంటుంది. కాబట్టి మీరామెను తప్పని సరిగా హాస్పిటల్‌లో చేర్పించాలి."

"అలాగే !" అంటూ అడిగాడు పార్ధసారథి

"డాక్టర్ ఈ వ్యాధి తగ్గుముఖం పట్టే అవకాశం లేదంటారా ?"

"ఏ వ్యాధినయినా, ప్రారంభదశలో వున్నప్పుడయితే, చికిత్స చేసి నయం చేయవచ్చు! వ్యాధి ముదిరాక చికిత్స వల్ల కూడా అంత ప్రయోజనం వుండదు. నే ఇందాక చెప్పిన రేడియం ట్రిట్‌మెంట్ వల్ల రోగి ఆయుస్సును కొద్దికాలం పెంచడానికి అవకాశం వుంటుందే కాని పూర్తిగా కాదు. ఆమె ఇంకోరెండు, మూడు మాసాల కంటే ఎక్కువ రోజులు బ్రతకడం కష్టం !" అంటూ చెప్పాడు.

బరువెక్కిన మనసుతో భారంగా అడుగులు వేస్తూ బయటికి వస్తున్న పార్థసారధితో తన చివరి మాటగా ఇలా చెప్పాడు డాక్టర్ !

"రోగికి తాను త్వరలో చనిపోతున్న విషయం ఏ మాత్రం అవగాహన కానీయ కండి !"

"అలాగే" అంటూ మౌనంగా తలూపి గది నుంచి బయటికి వచ్చాడు పార్థసారథి.

డాక్టరు సలహా ప్రకారం రామాబాయిని హాస్పిటల్లో చేర్పించాడు పార్థసారది !

అక్కడి వాతావరణం నచ్చకపోవటంతో, "నేనిక్కడ వుండలేను. నన్నింటికి తీసికెళ్ళండి' అంటూ గొడవ ప్రారంభించింది రామాబాయి.

ఎవరెంత చెప్పినా వినక పోవడం వల్ల, సర్ది చెప్పేందుకు ఆ సమయానికి హరిసర్వోత్తమరావు లేక పోవడంవల్ల, విధిలేక తన అత్తగారిని ఇంటికి తీసుకురాక తప్పలేదు పార్థసారధికి !

తల్లిని ఇంటికి తెచ్చిన వెంటనే బెజవాడలో జరిగే ఆంధ్రరాష్ట్ర ఉద్యమానికి సంబంధించిన సమావేశానికి పాల్గొనడానికి వారం క్రితం వెళ్ళిన తన తండ్రికి "అమ్మ ఆరోగ్యం బాగలేదు. వెంటనే రండి !" అంటూ తంతి పంపింది ద్వారకాబాయి !

* * *

"ఒరే అబ్బీ ! ఇక్కడే ఆపు. ఇదే మా ఇల్లు !"

రిక్షా ఆగింది !

హరిసర్వోత్తమరావు రిక్షావాడి చేతిలో అర్ధరూపాయి వుంచి గబగబా ఇంట్లోకి నడిచాడు హాల్లో కూతురు కనిపించగానే ఆదుర్దాగా అడిగాడు.

"అమ్మ కెలాగుందమ్మా ?"

మౌనంగా తల్లిపడుకుని వున్న గదిలోకి తీసికెళ్ళింది, ద్వారకాబాయి.

కళావిహీనమై వున్న భార్య ముఖాన్ని చూడగానే హరిసర్వోత్తమరావుకు దుఃఖం ముంచుకువచ్చింది.

"అమ్మా ! నాన్న వచ్చాడే. చూడు !" తల్లిని మెల్లిగా తట్టిలేపింది. కూతురు పిలుపుకి, పక్కపై పడుకొని వున్న రామాబాయి భారంగా కళ్ళు తెరచి చూసి "మీ పర్యటన ఎలా సాగింది ?" అంటూ మాట పెగల్చుకొని అడిగేసరికి కళ్ళలో నీళ్ళు తిరిగాయి హరిసర్వోత్తమరావుకు. ఆమెకు తాను ఏం సమాధానమివ్వాలో తోచక, భార్యవంక కన్నార్పకుండా అలాగే చూస్తుండిపోయాడు ఏదో తప్పు చేసిన వాడిలా !

తనవంక చూస్తున్న భర్తను గమనించి హీనస్వరంతో అంది రామాబాయి.

"మీ మనసు నొప్పించే మాటన్నాను కదూ. నన్ను మన్నించండి !"

భార్య పలుకులకు నిలువెల్లా చలించిపోయిన హరిసర్వోత్తమరావు, ఆమె రెండు చేతులు పట్టుకొని,

"నువ్వే నన్ను మన్నించాలి రాముడూ !" అంటూ భార్య వంకదైన్యంగా చూశాడు.

సాయంకాలం సంగీత కళాశాల నుండి వచ్చిన పార్థసారధి భార్యను ఉద్దేశించి అడిగాడు.

"మామయ్యగారొచ్చారా ?"

"వచ్చారండీ !" అంది ద్వారకాబాయి

"అత్తయ్యగారిని చూశారా ?"

"ఆ..... చూశారు !"

"ఏమన్నారు ?"

"ఏమీ అనలేదు !"

"ఈ పరిస్థితుల్లోనైనా ఇంటి పట్టునే వుంటారా ? లేక మళ్ళీ వెళతారటనా ?' కాస్త గట్టిగా అడిగాడు పార్థసారథి.

"గట్టిగా అరవకండీ నాన్నగారు వింటే బాధపడుతారు"

అంది ద్వారకాబాయి !

"బాధపడి మాత్రం వారు చేసేదేముంది ? వారికి కావలసింది ప్రజాసేవే కాని, తనవారి సేవ మాత్రంకాదు !" కాస్త ఆవేశంగానే అన్నాడు పార్థసారథి.

"ఏమైందండీ ఈవేళ ! ఎందుకిలా మాట్లాడుతున్నారు ?" అంటూ భర్తవంక విస్మయంగా చూస్తూ అంది ద్వారాకాబాయి.

"చూడు ద్వారకా ! ప్రజాసేవ చేయడం మంచిదేకాని, అదే జీవిత ధ్యేయంగా వుంచుకుంటే ఎలా ? ఇన్నాళ్ళు ప్రజాసేవ చేశారు. మరి ఈ ప్రజలు వారికేం కట్టబెట్టారు ? నిత్యము ఆర్థిక సమస్యలతో తాను బాధపడ్డాడు. అందర్నీ బాధపెట్టాడు. ఇప్పటికైనా వాస్తవాన్ని గ్రహించి ఇంటి పట్టునే వుంటే అత్తగారికి కాస్త మనశ్శాంతి చేకూర్చిన వారవుతారు."

భర్త ఆవేశంతో చెప్పిన మాటలు విన్న ద్వారకాబాయి "మీరన్నది నిజమేనండి. కాని అన్నీ తెలిసిన వారికి చెప్పడమెలా !"

"నువ్వన్నది కూడా నిజమే !" అంటూ నిట్టూర్చి స్నానానికై పెరటివైపు దారి తీశాడు పార్థసారథి.

తన గదిలోంచే అల్లుడి మాటలన్నీ విన్న హరిసర్వోత్తమరావు విరక్తిగా నవ్వుకుంటూ అనుకున్నాడు. ఇవే మాటలు ఒకప్పుడు పినతండ్రి చెప్పాడు ! తరువాత తన అత్తగారు చెప్పారు! స్నేహితులు కూడా చెప్పారు ! చివరకి అల్లుడు కూడా చెప్పాడు ! తరాలు మారినా మనుషుల మనస్థత్వాలు మారవంటారు. బహుశా ఇదే కాబోలు !

వారం రోజులు గడిచాయి !

రామాబాయి ఆరోగ్యం రోజు రోజుకి క్షీణించసాగింది ! గడిచిన ఆవారం రోజుల్లో మరో రెండుసారులు ఆమె నోటి వెంట రక్తం పడింది.

స్వయంగా ఇంటికే వచ్చి పరీక్షించిన డాక్టరు హరిసర్వోత్తమ రావుతో చెప్పాడు.

"ఆమె ఆట్టే రోజులు జీవించదు. కాబట్టి మీరీ సమయంలో ఆమెను ఒదిలి ఎక్కడకు వెళ్ళకండి !"

డాక్టరు ఎప్పిన మాటలు మౌనంగా వింటూవుండిపోయాడు హరిసర్వోత్తమరావు.

ఆ రోజు.........

1942 ఆగష్టు 21

తెల్లవారు జామున 5 గంటలకే నిద్రలేవటం అలవాటున్న హరిసర్వోత్తమరావు, ఆరోజు కూడా నిర్ణీత వేళకే నిద్రలేచి స్నానం పూర్తి చేసి వసారాలో కూతురందించిన కాఫీని త్రాగి ఆవేళ దినపత్రిక  తిరగేస్తుండగా, "నమస్కారమండీ !" అంటూ అయిదారు మంది వ్యక్తులు వచ్చారు.

"నమస్కారం. కూర్చోండి !" అంటూ వారలను ఆశీనులను చేసి అడిగాడు.

"ఏమిటి విశేషం ?"

"మేము పెరంబూరు వాస్తవ్యులం, దక్షిణ భారత వయో జన విద్యా సహకార ప్రచురణ' నిర్వహణలో మీ కృషి ఎన్నదగినది. కొత్తగా అక్షరాస్యులైన వారికోసం ప్రత్యేకంగా పుస్తకములు ప్రచురింపచేసిన ఘనత మీకే దక్కింది. వయోజనులగు కార్మికుల కోసం రాత్రిబడుల ప్రారంభోత్సవం మీ చేతుల మీద జరుగాలని, ఆశతో వచ్చాం. మా నిర్ణయాన్ని, మీరు తప్పక ఆమోదించాలని కోరుకుంటున్నాం."

"ప్రారంభోత్సవం ఎన్నింటికి ?"

"ఈ రాత్రి 8 గంటలకు, మీకోసం కారు తెచ్చాం ! మీరు మా వెంటే రా కోరుతున్నాం."

"ఉండండి ! బయల్దేరుదాం." అంటూ లోపలికి వెళ్ళాడు హరిసర్వోత్తమరావు.

తండ్రి మధ్య – ఆ వ్యక్తుల మధ్య జరిగిన సంభాషణ విన్న ద్వారకాబాయి తండ్రి వంక అదోలా చూసి అంది.

"నాన్న అమ్మకిలా వుంటే మీటింగుకు ఎలా వెళ్తారు నాన్న !"

పక్కనే పక్కపై పడుకుని వున్న రామాబాయి కూతుర్ని వారిస్తూ అంది.

"వారిని వెళ్ళనీయమ్మా. వారి ధర్మాన్ని వారు నిర్వర్తించనీ !"

ఆసమయంలో తాను కన్నకూతురైనా – తన తల్లిదండ్రుల మనస్థత్వం అంతుబట్టకపోయే సరికి ఇరువురివంక విషాణ్ణ వదనంతో చూసింది ద్వారకాబాయి !

*   *   *

'ద్వారకా'.... 'ద్వారకా' అంటూ ఈ పాటికి పదిమార్లు కేకలేసే అమ్మ ఈ వేళ ఒక్కసారైనా పిలవలేదేమిటబ్బా !' ఆందోళన పడుతూ తల్లి పక్కదగ్గరకు వచ్చి చూసింది ద్వారకాబాయి.

రామాబాయి మూసిన కళ్ళు తెరవలేదు.

ద్వారకాబాయి గుండె వేగంగా కొట్టుకోసాగింది.

తల్లిని చూస్తూ నెమ్మదిగా పిల్చింది

"అమ్మా !"

"........"

"అమ్మా ! అమ్మా " అంటూ తట్టి పిల్చింది.

ఆ పిలుపుకి రామాబాయి బరువుగా కళ్ళు తెరిచి కూతురికేసి చూసింది !

ఆ చూపులో జీవకళలేదు. నీరసంగా, నిస్సత్తువుగా పాలిపోయినట్లుంది ఆమె ముఖం. జీవితంలో బాగా అలసిపోయిన దాన్లా అగుపిస్తోంది !

"లేమ్మా ! ముఖం కడుక్కుందువుగానీ......" అంటూ పక్కమీంచి అమ్మను లేపి అక్కడే ముఖం కడిగించింది ద్వారకాబాయి.

"అమ్మా కాఫీ తేనా !"

మెల్లిగా తల ఆడించింది రామాబాయి

కూతురిచ్చిన కాఫీ ఒక గుక్క తాగిందోలేదో ఇక వద్దని సంజ్ఞ చేసింది రామాబాయి.

"ఏమ్మా కాఫీ రుచిగా లేదా ?"

రుచించలేదన్నట్లు తల ఆడించింది.

"రోజూ చేసినట్టే చేశాకదామ్మా ! కాస్తయినా తాగాలి !" అంటూ బలవంతంగా కాఫీ తాగించి పడుకోబెట్టి అక్కడనించి కదలబోయింది ద్వారకాబాయి !

"అమ్మా ద్వారకా !"

ఆ పిలుపుకు వెనుదిరిగి "పిల్చావా అమ్మా !"

"అవునమ్మా ! మీ నాన్న వచ్చారా ?"

"లేదమ్మా ?"

"పోన్లేమ్మా ! నీవైనా ఈ రోజు నా దగ్గరే వుండమ్మా !"

"రోజూ ఇంట్లోనే అన్ని పనులు మానుకొని నీ దగ్గిరే వుంటున్నా కదమ్మా !"

రామాబాయి కళ్ళలో నీళ్ళు కదలాడాయి !

"ఏమ్మా. ఎందుకా కన్నీళ్ళు ? నిన్ను విడిచి నేనెక్కడకెళ్తానమ్మా ?"

కూతురు మాట తృప్తిగా విని కళ్ళు మూసుకుని పడుకుంది రామాబాయి.

మధ్యాహ్నమైనా – తల్లి కదలక, మెదలక పడుకుని ఉండటం ద్వారకా బాయిలో అనుమానం రేకెత్తించింది.

తల్లిని తిన్నగా కదిపింది. రామాబాయి కదలికతో ఆ అనుమానం కాస్తా తొలగి తృప్తిగా నిట్టూర్పు విడిచి పళ్ళెంలో మెత్తగా కలిపిన మజ్జిగ అన్నం తెచ్చి తన చేతితో తల్లికి తినిపించబోయింది.

ఒకే ఒక అన్నం ముద్ద తిందో, లేదో వద్దంటూ తల ఆడించింది రామాబాయి.

"పోనీలే ఈ జావ అయినా తాగు" అంటూ గ్లాసు నోటి దగ్గరకు చేర్చి తాప ప్రయత్నించింది. జావ తాగుతున్న రామాబాయికి పొరపోయి దగ్గువచ్చింది. దగ్గుతోపాటు మళ్ళీ నోట్లోంచి రక్తం వచ్చింది. రక్తం చూసిన ద్వారకా బాయికి గుండె ఆగినట్లే అయింది. క్షణంలో తిరిగి తేరుకొని తల్లి నోటినుండి కారిన రక్తాన్ని తుడిచి శుభ్రంచేసి పడుకోబెట్టిందే కాని, కళ్ళు మూస్తూ, తెరుస్తూఏదో తెలియని బాధతో కొట్టుమిట్టాడుతోన్న తల్లి పరిస్థితికి ఆమె శరీరంలో వణుకు ప్రారంభమైంది. కాళ్ళు, చేతులు ఆడక వెంటనే భర్తకు కబురంపింది !

కబురందగానే పరుగెత్తుకుంటూ వచ్చాడు పార్థసారథి !

"ఏం జరిగింది ద్వారకా ?" అంటూ.

మూగగా సంజ్ఞ చేసి చూపింది తల్లివేపు !

పరిస్థితి అర్థం చేసుకున్న పార్థసారథి ఆదుర్దాగా

"అత్తగారూ. అత్తగారూ !" అంటూ పిలిచాడు.

రామాబాయి పలుకలేదు. మూసినకళ్ళు తెరవలేదు.

పార్థసారథిలో ఉద్వేగం !

ఆయాసమెక్కువై మెలికలు తిరిగిపోతున్న తల్లి బాధకు తట్టుకోలేక కంట తడిపెట్టుకుంది ద్వారకాబాయి.

అర్ధరాత్రి వరకు అలా బాధపడిపోయిన రామాబాయి కాస్త తేరుకొని తన పక్కనే వున్న కూతుర్ని, అల్లుడ్ని చూసింది. కూతురువేపు మెల్లిగా చూసి అంది రామాబాయి.

"మీ నా.....న్న.....గా.......రొ.....చ్చా.......రా....అ.......మ్మా"

తడబడుతున్న మాటలు........ తగ్గుస్వరం పసికట్టిన పార్థసారథిలో విచారం !

నాన్నగారికోసం తల్లిపడే ఆరాటం చూసి భర్తవేపు తిరిగి అంది ద్వారకాబాయి.

"నాన్నగారెప్పుడు వస్తారు ?"

ఎప్పుడు వస్తారో తనకు మాత్రం ఏం తెలుసు గనుక సమాధానం ఇవ్వటానికి ! ఎటూ పాలుపోక మామయ్య మీద మళ్ళీ కోపం తెచ్చుకున్నాడు పార్థసారథి !

"అత్తయ్య పరిస్థితిని చూస్తూ కూడా మీటింగుకు వెళ్ళిన ఆ వ్యక్తిని ఏమనుకోవాలి. ఆవేశంగా భార్యవంక చూస్తూ అన్న పార్థసారథి దృష్టి అత్తగారివేపు మళ్ళింది. అత్తగారిని

చూడగానే హృదయం కరిగి అనుకున్నాడు. "అత్తగారు జీవితంలో ఎవరినీ, చివరకి మామయ్య గారిని కూడా ఏమీకోరలేదు ! చివరిదశలో కోరుకున్న ఒకే కోరిక - ఆ కోరిక తీరక పోతే ?

అత్తయ్యగారి ఆత్మకు శాంతి లభింపదు ! తన మనసుకు ప్రశాంతి వుండదు !

భారంగా నిట్టూర్చి చెప్పాడు భార్యతో "నేనిప్పుడే వెళ్ళి మామయ్యగారిని వెంటపెట్టుకొస్తాను. అందాక అత్తయ్యగారిని కనిపెట్టుకొని వుండు. నీకు తోడుగా పక్కింటి రామమ్మను పిలుచుకో !" అంటూ బయల్దేరుతుండగా, బయటకారు హారన్ శబ్దం విన్పించింది.

ఇద్దరూ ఆదుర్దాగా బయటికి వచ్చి చూశారు !

కారు దిగిన హరిసర్వోత్తమరావుకు వెంట వచ్చిన వ్యక్తులు అభివాదం చేసి వెళ్ళిపోయారు. ప్రతినమస్కారం చేస్తూ కూతురు, అల్లుడివంక దృష్టి మరల్చాడు.

"నాన్నా, అమ్మ నీ కోసం కలవరిస్తోంది !" ఏడ్పు కంఠంతో అంది ద్వారకాబాయి.

కూతురు మాటలకు మ్రాన్పడిపోతూ హరిసర్వోత్తమరావు పరుగున భార్య వున్న గదిలోకి వెళ్ళాడు. భార్యా, భర్తలిద్దరూ అతన్ని అనుసరించారు.

ఊపిరాడక ఎగ శ్వాసతో తల్లడిల్లిపోతోన్న భార్యను వొడిలోకి తీసుకొని వణుకుతోన్న కంఠంతో చెప్పాడు హరిసర్వోత్తమరావు.

"రాముడూ నేనొచ్చాను !"

భర్త పలుకులకు మెల్లిగా కళ్ళు తెరచి చూసిన రామాబాయికి అస్పష్టంగా అగుపించిన హరిసర్వోత్తమరావును చూసి, తాళిని కళ్ళకు తాకించుకొంది.

తనతో అష్టకష్టాలు అనుభవించి, తోడూ – నీడలా వుంటున్న భార్య తన్ను విడ్చి వెళ్ళిపోతోంది అన్న తలపు ఆ క్షణంలో మెదలగానే హరిసర్వోత్తమరావు నవనాడులు కృంగిపోయాయి.

"రాముడూ !" అంటూ బావురుమని ఏడ్చాడు.

"మీ ఒడిలో చనిపోతున్న భాగ్యం ప్రసాదించినందుకు ఆ భగవంతునికి కృతజ్ఞురాలిని." అని భర్తతో చెప్పాలని రామాబాయి చేసిన ప్రయత్నం ఫలించలేదు. ఎగశ్వాస పీలుస్తూనే భర్తవంక అలాగే కన్నార్పకుండా చూస్తుండిపోయింది.

అదే ... ఆమె చివరి చూపు !

ఎగశ్వాస ఆగిపోయింది !!

'తనకిక అమ్మలేదు' అన్న విషయం గ్రహింపుకు రాగానే, తల్లి శవంపై పడి 'నన్నొదిలిపోయావు కదే ! అమ్మా ...' అంటూ బోరున విలపించింది ద్వారకాబాయి.

పార్థసారధి కంట కన్నీరాగింది కాదు.

ఆ సమయంలో హరిసర్వోత్తమరావు, ఒడిలో ప్రాణాలొదిలిన భార్య తలను క్రింద ంచి, ఆమె మీద తెల్లని వస్త్రాన్ని కప్పుతూ అనుకున్నాడు మనస్సులో !

"నా జీవితంలో ఒక అధ్యాయం నేటితో ముగిసింది !"

# 20

రెండు మాసాలు గడిచాయి !

తన అర్ధాంగి దూరమైనా, హరిసర్వోత్తమరావు ప్రజాసేవలో, దిన చర్యలో ఎలాంటి మార్పు కలుగలేదు. రోజువారిలాగే ఆ రోజు కూడా ఉదయమే నిద్రలేచిన హరిసర్వోత్తమరావు తన దైనందిక దినచర్యలో భాగంగా చన్నీళ్ళతో స్నానం చేసి, తన మాసిన గుడ్డలను తానే స్వయంగా వుతికి ఆరవేశాడు. క్రితంరోజు శుభ్రపరచుకున్న బట్టలను తొడుక్కొని వసారాలోకి వెళ్ళి కూర్చున్నాడు దిన పత్రిక చదువుతూ !

కొద్దిసేపయ్యాక కాఫీ తాగి తానుంటున్న మేడపైని గదిలోకి వెళ్ళాడు. తనకు తానుగా కేటాయించుకున్న కుర్చీలో ఆశీనుడై ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రానికి సంబంధించిన పలు అంశాలను గురించి తన డైరీలో వ్రాసుకుంటూ వుండగా ...

"నమస్కారం మాష్టారుగారూ !" అన్న పలుకులు విని తలెత్తి చూసిన హరిసర్వోత్తమరావు, గ్రంథాలయ ఉద్యమంలో తనకు కుడిభుజంగా వుండటమేకాక, తన్ను తండ్రిలా భావించే నాగభూషణరావును చూచి "రా. నాగభూషణం ! ఇదేనారాక !" అంటూ ఎదురుగా వున్న కుర్చీ చూపించాడు.

"మాష్టారు గారికి శుభాకాంక్షలు."

అంటూ తన వెంట తెచ్చిన సంచిలోంచి ఓ పూలమాల తీసి హరిసర్వోత్తమరావు మెళ్ళో వేశాడు !

"ఏమిటిది ?"

అంటూ పూలమాలను పక్కకు తీశాడు హరిసర్వోత్తమరావు.

"గురువుగారు ! బహుశా మీకు గుర్తుండకపోవచ్చు. మీకిప్పుడు 60 ఏళ్ళు నిండాయి. అందుకే నా ఈ చిరుకానుక !" అన్నాడు నాగభూషణరావు.

"నాకప్పుడే అరవై ఏళ్ళు నిండాయా !" అంటూ చిన్నగా నవ్వి చెప్పుకొచ్చాడు హరిసర్వోత్తమరావు.

"ఈ అనంతకాలగమనంలో మనిషి జీవితం ఎంత త్వరగా పరుగులు తీస్తుంది కదూ !"

అవునన్నట్టుగా తిన్నగా తలపంకించి తానొచ్చిన విషయం గురించి తెలియజేశాడు నాగభూషణరావు.

" నా షష్టి పూర్తి మహోత్సవమా ! ఎందుకయ్యా నాగభూషణం అనవసరంగా శ్రమ తీసుకుంటావు. అయినా ఈ అరవై ఏళ్ళలో నేను ఏం గొప్ప ఘనకార్యాలు సాధించానని !" అన్నాడు హరిసర్వోత్తమరావు.

"మీ గొప్పతనం ఎలాంటిదో మాకు తెలుసు. ఆంధ్ర ప్రజానీకానికి కూడా తెల్సు ! చంద్రునికో నూలుపోగులా ఈ షష్టిపూర్తి సందర్భంగానైనా మిమ్ములను సన్మానించుకోవటం మా కనీస కర్తవ్యం. ఇది నా ఒక్కడి నిర్ణయం కాదు. ఆంధ్ర గ్రంథాలయ సంస్థ సభ్యులందరి అభిప్రాయం. వారే నన్ను మీ అంగీకారం కోసం ఇక్కడకు పంపారు. మీరు కాదనకండి !" ప్రాధేయ పూర్వకంగా అన్నాడు నాగభూషణరావు.

తనకు సన్మానాలపై వ్యామోహం లేకున్నా పుత్ర సమానుడైన నాగభూషణం అడిగిన తీరుకు 'సరే' అని అంగీకారించక తప్పలేదు హరిసర్వోత్తమరావుకు !

ఓ వారం రోజుల తర్వాత ...

విజయవాడలోని పడమట లంకలో హరిసర్వోత్తమరావు షష్టిపూర్తి మహోత్సవ సమావేశం ఏర్పాటు చేయబడింది.

సాయంకాలం వేళకు మదరాసు నుంచి విజయవాడ చేరుకున్న హరిసర్వోత్తమరావును సాదరంగా ఆహ్వానించి సమావేశం దగ్గరకు తీసుకెళ్ళాడు నాగభూషణరావు.

హరిసర్వోత్తమరావు సూచన మేరకు నిరాడంబరంగా సాగిన షష్టిపూర్తి మహోత్సవంలో పురప్రముఖులు, వివిధ ఉద్యమనాయకులు, గ్రంథాలయ సభ్యులు హాజరయ్యారు.

హరిసర్వోత్తమరావు ఆర్థిక పరిస్థితి దృష్టిలో వుంచుకొని విరాళరూపంలో పోగుచేసిన మూడువేల రూపాయలు ఉత్సవకమిటీ పాతూరి నాగభూషణం ద్వారా హరిసర్వోత్తమరావుకు అందజేసింది.

డబ్బందుకున్న హరిసర్వోత్తమరావు లేచి అందరి వంక కలియజూసి చెప్పాడు.

"నా ఆర్థిక పరిస్థితిని దృష్టిలో వుంచుకుని మీరు తీసుకున్న శ్రమకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు ! నా ఆర్థిక పరిస్థితి కంటే గ్రంథాలయ ఆర్థిక పరిస్థితి మెరుగుపడటం చాలాఅవసరం. అందుకుగాను, ఈ మూడువేల రూపాయలను గ్రంథాలయోద్యమానికి వినియోగించవలసిందిగా గ్రంథాలయ కార్యదర్శి నాగభూషణం గారిని కోరుతున్నాను."

హరిసర్వోత్తమరావు నిర్ణయం పట్ల అందరూ ఆశ్చర్యచకితులయ్యారు !

తాననుకున్నది నెరవేరనందుకు నాగభూషణం మనసులోనే బాధపడ్డాడు.

ఉత్సవ సమావేశం ముగిసింది !

ఆ రాత్రి భోజనానంతరం తన ఇంటి డాబాపైన వాలు కుర్చీలో కూర్చుని ఆకాశంకేసి చూస్తూ ఏదో ఆలోచిస్తున్న హరిసర్వోత్తమరావు దగ్గరకు వెళ్ళి "మాష్టరు గారు !" అంటూ వారి ఎదురుగానే ఆశీనుడయ్యాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు ?"

"ఆలోచనలే మనిషిని ముందుకు నడిపిస్తాయి నాగభూషణం." చిన్నగా నవ్వుతూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

"మాష్టారు గారూ !" నాగభూషణం పలుకులో తడబాటు !

"ఏమిటి నాగభూషణం ?" ప్రేమగా చూశాడు హరిసర్వోత్తమరావు.

"మీ జీవిత చరిత్ర రాయాలని వుంది. దయచేసి చెప్పరూ !"

"నా జీవిత చరిత్రను నేనే వ్రాసుకునే స్థితికి గాని, ఇతరులు వ్రాసే స్థాయికిగాని నేనింకా ఎదగలేదు."

"మీరలా అనుకోవటం మీ నిరాడంబరతకు నిదర్శనం ! దయచేసి నా కోరిక కాదనకండి !"

– అంటూ డాబాదిగి లాంతరు, కాగితాలు, కలం తీసుకుని వచ్చి తిరిగి హరిసర్వోత్తమరావు ముందు కూర్చుని

"ఇక చెప్పండి !" అన్నాడు.

అతని కోరికను తిరస్కరించలేని హరిసర్వోత్తమరావు తన పుట్టుకకు సంబంధించిన గతాన్ని సంక్షిప్తంగా చెప్పడం ప్రారంభించాడు.

నేను ఆరునెలల శిశువుగా వుండగానే నా తల్లి మరణించిందని తెలిసింది.

నేను 1883వ సంవత్సరం సెప్టెంబరు 14 వ తేదీన కర్నూల్లో పుట్టాను. నా చిన్నతనములో కూడా కర్నూలు ముఖ్యంగా వ్యవసాయక క్షేత్రం ! ఒక వైపున జొహరాపురం, మరొకవైపున బుధవారపేట ! ఈ రెండింటికి మధ్యన పచ్చని పైరులతో కర్నూలు కళకళలాడుచుండేది !

నేను గాడిపట్టున పుట్టానట ! నాలాగే పుట్టిన క్రీస్తును తలచుకొని ఆశ్చర్యపడేవాణ్ణి! అంతటి వ్యక్తిత్వము నాకు లభించునా అని అనుకొనే వాడిని - అయితే అంతటి మహర్దశ లభిస్తుందని ఆశపడలేదు !

నా తండ్రులు ఆరుగురన్నదమ్ములు. వారిలో చిన్నవాడు ముకుందరావు. ఆయన చిన్నతనాన్నే ఈ లోకమునుండి నిష్క్రమించాడు. నా పెద్ద తండ్రి దుర్వాసరావు. ఆయన మరణ నిద్ర చెందుచుండిన దృశ్యం ఇప్పటికీ నా కళ్ళకు కట్టినట్లు అగుపిస్తూనే వుంది ! మిగత నల్గురిలో నా పెద తండ్రి శేషగిరిరావు, నా తండ్రి వెంకట్రావు. వీరిద్దరు, రెవిన్యూ ఇన్‌స్పెక్టర్లు. మరి యిరువురు శ్రీనివాసరావు, వాసుదేవరావులు వకీళ్ళయి, కర్నూలులో న్యాయవాద వృత్తిని అవలంబించారు.

మా తండ్రులు, తాతలనాడు మా వంశీకులు కడప, అనంతపురం జిల్లాల కలయిక స్థానంలో 'చిత్రావతీ' నదీ తీరాన సంహాద్రిపురంలో నివసించెడివారు ! ఈ ప్రాంతంలోనే మా పూర్వీకులకు కొద్దిగ భూస్థితి కూడా వుండింది. అదంతా నేటికి క్రిష్ణార్పణం అంటూ చిన్నగా నవ్వుతూ "నీ కో విషయం తెలుసా నాగభూషణం ?"అన్నాడు హరిసర్వోత్తమరావు.

వ్రాసుకుంటున్న వాడల్లా ఆగి తల పైకెత్తి -

"ఏ విషయం మాష్టారు ?" అంటూ ఆదుర్దాగా అడిగాడు నాగభూషణం.

"మా నాయనమ్మ చేలకు పోయి, గడ్డి మోపులు నెత్తిన మోసుకొని ఇల్లు చేరెడిదట! ఈ విధంగా గ్రామ జీవితం తెలుసుకునే అవకాశం లభించింది నాగభూషణం ... ఆ ... మరో విషయం కూడా బాగా జ్ఞాపకం ! నేను కంభం తాలూకా రావిపాడు గ్రామం బడిలో చదువుతున్నప్పుడు, బడి పిల్లలకు టీచర్లు ఎలాంటి శిక్షలు విధిస్తుండేవారో తెలుసా ! కోదండం వేయించేవారు ! అంటే తప్పుచేసిన పిల్లవాడ్ని వ్రేలాడదీయించి, క్రింద ముళ్ళకంప పెట్టేవారు. ఎందుకంటే దుమికి తప్పించుకో కూడదని ! నేడు అలాంటి శిక్షలు లేవు గదా అని సంతోషిస్తున్నాను. ఇలా చెబుతుంటే ఇంకెన్నో విషయాలు గుర్తుకు వస్తున్నాయి."

"చెప్పండి మాష్టారు ! యువతరానికి స్ఫూర్తి నిచ్చే సంఘటనలు ఎన్నో మీలో దాగివున్నాయి." ప్రాధేయపడుతూ అడిగాడు నాగభూషణం.

"నేను గుత్తిలో లండన్ పాఠశాలలో చదువుతున్నప్పుడు మార్లర్ అను ఫాదర్ పెద్ద, మా పాఠశాలకు మేనేజరు. ప్రైమరీ తరగతిలో చదివి పబ్లిక్ పరీక్షలో జిల్లాలో ఫస్టు వచ్చింతర్వాత ఆయనను చూడటానికి వెళ్ళాను. ఆయన నన్ను అభినందించి నా యెదుట రెండు బహుమానాలు

వుంచి ఏది కావాలో కోరుకొమ్మన్నారు. 'ఒకటి క్రికెట్ బంతి, రెండోది రూపాయి !! నాకెట్టి బుద్ధి పుట్టిందోగాని క్రికెట్ బంతినే కోరుకున్నాను ! జీవితంలో దీని ప్రభావమే నాపై ఎక్కువగా పనిచేసినది. ఎన్ని ప్రయోజనాలు సమకూరినా, డబ్బు ప్రయోజనం మాత్రం సమకూరలేదు. కారణం ? నేను కోరుకున్నది బంతి కదా !" చిన్నగా నవ్వుతూ చలోక్తి విసిరాడు హరిసర్వోత్తమరావు.

"మీరు చలోక్తిగా అన్నా మీ జీవితంలో అది అక్షరాలా రుజువైంది మాష్టారు. మరో విషయం ఫాదర్ విదేశీయుడు కదా ! మన దేశీయుల పట్ల ఆయనకెలాంటి అభిప్రాయం వుండేది ?"

"సందర్భానికి తగినట్లు గుర్తుచేశావు నాగభూషణం. చెబుతా విను !" అంటూ కొద్దిసేపు ఆలోచనలో పడి తిరిగి చెప్పుకపోసాగాడు హరిసర్వోత్తమరావు.

"గాంధీ యుగమారంభమై అసహాయోద్యమము ప్రబలంగా జరుగుతూ వుండిన రోజులలో అనగా 1922 - '23 ప్రాంతంలో ఫాదర్ కదిరిలో వున్నాడు. అక్కడికి నేను కాంగ్రెస్ ప్రచార నిమిత్తము పోయాను. తన్ను కలవమని కోరినప్పటికినీ, నేను కలువనేమో అన్న సంశయము ఆయనకు కలిగినది. ఈ విషయము నాకు తెలిసి, వెంటనే వచ్చి కలుసుకొందునని వార్త పంపితిని.

నేను వెళ్ళగానే అతడు ఎదురొచ్చి స్వాగతం చెప్పి, "ఏం ! సర్వోత్తమరావ్ మమ్ములను దేశంనుండి వెళ్ళగొట్ట జూస్తున్నావా ?" అని ప్రశ్నించెను. చిన్నతనంలో నాకు గురువుగా వుండిన ఒక వ్యక్తి ఈ ప్రశ్నవేస్తే జవాబెట్లు చెప్పుదునా అని తడుము కొనుటకు అవకాశమే లేకుండా నాకు స్ఫురించిన జవాబును వెంటనే చెప్పితిని.

"మాష్టారు మీ పట్ల మాకెలాంటి ద్వేషం లేదు ! మిమ్ములను తరుమగొట్టవలయునను ఆకాంక్ష కూడా లేదు. మేము తరుమగొట్టదలచినది మీ అధికారమును మాత్రమే !"

నా సమాధానానికి ఆయన వుప్పొంగిపోయి కౌగలించుకొన్నాడు. ఈ సంఘటన నా జీవితంలో మరపురానిది.

నేను చదువుకొంటున్నప్పుడు తెలివిగలవాడినని పేరు ! ఆనాడు మా ప్రాంతాలలో చదువు చాలా తక్కువ. చదువుకు అనుకూలాలు తక్కువే !

కర్నూలు జిల్లా అంతటికిని రెండు హైస్కూళ్ళుండేవి ! ఒకటి కర్నూలులోని మునిసిపల్ హైస్కూలు, రెండవది నంద్యాలలోని యస్.పి.జి. మిషన్ హైస్కూలు. నేను ఫోర్తు ఫారములో చదువుతున్నప్పుడు మా తరగతిలో వున్న వారము తొమ్మండుగురము ! మొత్తము విద్యార్థుల

సంఖ్య హైస్కూల్లో 120 ! 'చెట్టులేని చోట ఆముదపు చెట్టే మహా వృక్ష' మన్నట్టు, యిట్టి విచిత్ర పరిస్థితులలో నేను తెలివిగల వాడనిపించుకొనడం ఒక గొప్పా !

అల్లరి పిల్లవాడుగా కూడా నాకు పేరు వచ్చింది ! క్లాసులో మా తెలుగు పండితులు గని శేషావధానులు గారు ఏదో కోపము వచ్చి 'గడ్డి తింటావా ?' అని గద్దిస్తే 'తిని చూపిస్తే తింటాను' అని సమాధానం చెప్పినవాణ్ణి ! అయినా నాపై ఆయనకు అవ్యాజానురాగము. కారణం స్కూల్లో నేను చదువులో ఫస్టు వచ్చేవాడిని !" అంటూ కాస్సేపు మౌనం వహించాడు హరిసర్వోత్తమరావు.

కలం ఆగిపోయింది !

"మాష్టారూ ! ఎందుకలా మౌనంగా వున్నారు ?"

హరిసర్వోత్తమరావు వేపు చూస్తూ అడిగాడు నాగభూషణం.

"శేషావధానులను తలచుకున్నప్పుడల్లా నా మనసులో ఒకింత బాధ, దుఃఖం. ఈ జన్మలో ఆయన రుణం తీర్చుకోలేకపోయానన్న వెలితి నన్నెప్పుడు వెంటాడేది నాగభూషణం. ఆయన చాలా గొప్పవాడు. "అబ్బీ ! అన్నము పెట్టువాడు లేడురా ! లేకపోతే దినానికో శతకం వ్రాసేవాడనురా !" అనేవాడు. నాకీనాడు తెలుగు భాషయందు ఏదో కొంత ప్రవేశం వుందంటే ఆయన చలువే ! నేను జైలునందు వుండగా ఆయన మరణించెను. ఆ సమయంలో ఆయనను చూడలేకపోయానన్న బాధ నన్ను ఎల్లప్పుడు వేదిస్తుండేది ! దానికి ప్రతిఫలంగా, నేను జైలు నుంచి విడుదల అయి వచ్చిన తర్వాత 'ది నెగ్లెక్టెడ్ యంఫరర్ పొయట్' అను చిన్న రచనను వారికి అంకితంగావించి కొంత మనశ్శాంతి పొందాను.

మరో సంఘటన కూడా ఇప్పటికీ నా స్మృతి పథంలో మెదులుతూనేవుంది. నేను హైస్కూలులో చదువుతున్నప్పుడు కె.ఆర్.రఘునాథాచారి ప్రధానోపాధ్యాయుడుగా వుండేవారు.! ప్రత్యేక తరహాలో ఆయన బోధించేవారు. స్కూలు లైబ్రరీనుండి యిష్టము వచ్చిన పుస్తకాన్ని తెప్పించి, క్లాసులో చదివి వినిపించటము ఆయనకు అలవాటు. ఆ అలవాటు ప్రకారం ఒక దినము 'టిట్ - బిట్స్' తెప్పించి, అందులోని ఒక వ్యాసాన్ని చదవటం ప్రారంభించాడు. మధ్యలో చివాలున ఆపి, నేను చదివిన కడపటి వాక్యము వ్రాయండన్నాడు. అందరి ముఖాలు వెలవెలపోయినాయి. నేను ఒక్కడినే ఆ వాక్యమును వ్రాయగలిగితిని !

ఆ వాక్యమేమంటే, Try the experiment of eating a favourite dish in absolute darkness and you will find it does not taste half well as when you are able to please both the palate and the eye !

ఈ విషయము జ్ఞప్తికి తెచ్చుకుంటే ఈ దినము నాకును గ్రంధాలయ పఠనాలయములకు వుండే బాంధవ్యమునకు రఘునాథాచార్యుల వారే మూల కారకులన్నది స్పష్టము !

నాకు చదువుపై ఎంతటి వ్యామోహమో, ఆటపాటలందు కూడా అంతే మక్కువ ! నేను మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణుడయింతర్వాత ముందు చదువు సంగతి ఆలోచించవలసివచ్చింది. ఎందుచేతనంటే నా తండ్రి సాదా రెవిన్యూ ఇన్‌స్పెక్టరు. మరో కారణం ఆయనకు ద్వితీయ వివాహం జరిగియుండటం ! అందుచేత నా కాలేజీ చదువుకు నా పిన తండ్రి శ్రీనివాసరావుగారే బాధ్యత వహించిరి.

అప్పట్లో వెనుకబడిన జిల్లాలని కర్నూలు వగైరా జిల్లాలకు మదరాసు క్రిస్టియన్ కాలేజీ వారు ప్రత్యేకముగా స్కాలరుషిప్పుల నిచ్చుచుండిరి. దానికి ఇంగ్లీషులో పరీక్ష నిర్వహించారు. ఆ పోటీలో నేను ఒక్కడినే నెగ్గి స్కాలరుషిప్పు సంపాదించాను. అలా ఉపకారవేతనముతో 6 సంవత్సరములు చదివి ఎం.ఏ. డిగ్రి సంపాదించాను.

ఆ రోజులకు, ఈ రోజులకు ఎంత తేడా ?

నేను మదరాసులో క్రిస్టియన్ కాలేజీలో చదివిన రోజులలోని మదరాసుకు, ఆ తర్వాత మదరాసు నివాసిగ నేను వున్నప్పటి మదరాసుకు ఎంత వ్యత్యాసము ?

ఆ రోజులలో కాలేజీ ఫీజులు, ఇంటి అద్దె, హాస్టల్‌లో భోజన వసతితో కలిపితే నెలకు 13.8 అణాలు. వింటే ఆశ్చర్యం కల్గుతుంది కదూ ! నేను పుస్తకములు కొనుటకు మాత్రం కొంచెము ఎక్కువగా ఖర్చు పెట్టేవాణ్ణి. నా పినతండ్రిగారు ఎప్పుడు కూడ నెలకు 17 లకు మించి సహాయము పంపవలసిన అవసరముండలేదు. కాఫీ హోటళ్ళు అసలు యెరుగము! మోటారు కార్లు ఎప్పుడో ఒకప్పుడు వీధులలో కనిపించేవి ! ఇంకా కొన్ని విచిత్రాలు !

'టరమ్ క్యాప్'.. ఆరు మాసములు ధరించడానికి పనికివచ్చే టోపీ వెల అయిదు అణాలు !

'టరమ్ మ్యాట్' చాపవెల అయిదు అణాలు !!

'టరమ్ లైట్ ? ... ఆరు మాసములకు పనికి వచ్చే దీపము వెల కూడా అయిదు అణాలే !!!

ఇంతటి నిరాడంబరమైన విద్యార్థి జీవనము అర్థ శతాబ్దం దాటకముందే మాయమైపోయి, నూర్లకొలది డబ్బు ప్రతి నెల ఖర్చు పెట్టిననే కాని గడవని రోజులు నేటి విద్యార్థులకు దాపురించినవే అని అప్పుడప్పుడు మనసు కలవరపడుచుండేది !

ఎంతలో ఎంత మార్పు !

ముందు కాలము ఇంకా ఎలా వుండగలదో... ఊహిస్తే భవిష్యత్తు భయంకరమే ...

... అలా చెప్పుకుంటూ పోతుండగా పెద్దపెట్టున గాలి వీచింది. గాలి తాకిడికి లాంతరు చల్లారిపోయింది !

చీకట్లో నాగభూషణం కలం ఆగిపోయింది !

అది గమనించిన హరిసర్వోత్తమరావు ఇలా చెప్పాడు.

ప్రకృతికి కూడా నా మీద కనికరము లేనట్లున్నది. నే మొదటే చెప్పానుగా ? ఏం విశేషముంది నా జీవితంలో ?"

నాగభూషణం మారు మాట్లాడక కలం, కాగితం సర్ది సంచిలో పెట్టుకున్నాడు.

మర్నాడు ఉదయం హరిసర్వోత్తమరావు గారి వెంట రైల్వే స్టేషన్‌కు వెళ్ళిన నాగభూషణం రైలు కదులుతూ వుండగా చొక్కా జేబులోంచి తీసిన కొద్దిపాటి పైకాన్ని హరిసర్వోత్తమరావు చేతిలో వుంచి "మీ వ్యక్తిత్వానికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నందుకు దయచేసి మన్నించండి. ఈ డబ్బును తిరస్కరించకండి. ఓ తండ్రికి ఓ శ త్రుడిగా యిస్తున్న స్వంత పైకం !" అంటూ రెండు చేతులు జోడించాడు. పైకాన్ని నిరాకరిస్తూ ఏదో చెప్పాలనుకునే లోపు రైలు కదిలింది. తన మాష్టారు కనుమరుగయ్యేంతవరకు చూస్తూ చేతులు వూపుతూ వుండిపోయాడు నాగభూషణం !

# 21

1947, ఆగష్టు 15.

ఎంతో మంది త్యాగపురుషుల బలిదానం వల్ల, నూరేళ్ళ సుదీర్ఘ పోరాటం వల్ల ఎట్టకేలకు తప్పని సరి పరిస్థితుల్లో మనదేశానికి 'స్వరాజ్యం' వచ్చింది ! గాంధీ గారి ఆశయం నెరవేరింది. ప్రజలందరూ వేడుకలు చేసుకున్నారు. ఆంధ్రులకు 'స్వరాష్ట్రం' పట్ల మళ్ళీ ఆశలు చిగురించాయి !

స్వరాష్ట్రం కోసం కృషి సాగిస్తోన్న ఆంధ్రమహాసభ కార్యవర్గ సభ్యుల్లో మళ్ళీ 'కదలిక' మొదలైంది ! ప్రయత్నాలు ముమ్మరమయ్యాయి. ఢిల్లీ దర్బారులోని పాలకులు 'స్వరాష్ట్రం' పట్ల ఎలాంటి 'చలనం' చూపకపోయేసరికి, ఆంధ్ర దేశమంతటా, ఆంధ్రమహాసభ అలజడిరేపింది!

పర్యవసానం ?

'జె.వి.పి. కమిటీ' (జవహర్‌లాల్ నెహ్రూ, వల్లభాయి పటేలు, పట్టాభి సీతారామయ్య) ఓ నివేదికను తయారు చేసి 1949 ఏప్రిల్ 9 న ప్రభుత్వానికి సమర్పించింది !

ఆ నివేదికలో ...

దేశానికి కొత్తగా స్వాతంత్ర్యం వచ్చింది కాబట్టి, అందువల్ల ఉత్పన్నమైన సమస్యలు కొన్ని వున్నవి కాబట్టి ఆంధ్ర ప్రజలు 'స్వరాష్ట్రం' పట్ల మరికొంతకాలం వేచి వుండటం మంచిదని, ఆంధ్రులు మద్రాసును వదులుకుంటే ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సులువవుతుందని, నిర్వివాదమైన పదకొండు జిల్లాలతో 'ఆంధ్ర రాష్ట్రం' ఏర్పాటు చేసుకోవచ్చని కమిటీ సారంశం !

'కమిటీ రిపోర్టు'ను, ఆంధ్ర దేశానికి సంబంధించిన అగ్రనాయకులందరూ విమర్శించారు. 'మద్రాసు నగరం' ఆంధ్రుల సొత్తు ! మదరాసును తమిళులకు ఇవ్వడం తగదు' అంటూ ప్రకాశం పంతులు ఆంధ్ర దేశమంతటా 'జె.వి.పి.' కమిటి రిపోర్టుకు వ్యతిరేకంగా ప్రచారం చేశాడు. హరిసర్వోత్తమరావు కూడా కమిటీ రిపోర్టు పట్ల తీవ్ర నిరసనను తెలియజేస్తూ, మద్రాసు ఆంధ్ర రాష్ట్రానికే చెందాలని వాదించాడు. ఈ నేపథ్యంలో అందరు కలిసికట్టుగా ఓ వేదికగా ఏర్పడి పరస్పర అభిప్రాయాలను తెలుసుకునేందుకు, చర్చించేందుకు రాష్ట్రకమిటి కాంగ్రెస్ అధ్యక్షుడు ఎన్.జి. రంగా బెజవాడలో అఖిల పక్ష సమావేశం ఏర్పాటు చేశాడు.

ఆ సమావేశంలో ...

ప్రారంభోపన్యాసం చేస్తూ ఎన్.జి. రంగా,

"మిత్రులారా ! ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర అవతరణపై మనలో భిన్నాభిప్రాయాలు వ్యక్తమవుతున్నాయి ! ఆ అభిప్రాయాలను చర్చించి, అందరం కలసి, ఓ అవగాహనకు రావాడానికే ఈ సమావేశం ఏర్పాటు చేయడం జరిగింది ! వేదికనలంకరించిన మిత్రులు తమ అభిప్రాయాలను వ్యక్తపరచవలసిందిగా కోరుతున్నాను. మొదట ప్రకాశం పంతులు గారిని ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణ విషయంలో తమ అభిప్రాయం తెలియజేయవలసిందిగా కోరుతున్నాను !"

ప్రకాశం పంతులు అందరి వంక కలయజూస్తూ తన ఉపన్యాసాన్ని ప్రారంభించాడు.

"సమావేశానికి హాజరయిన నేతలకు, ఆంధ్రమహాసభ కార్యకర్తలకు నా నమస్సులు!

జె.వి.పి. రిపోర్టు మద్రాసును ఒదులుకోమనే చెబుతుంది ... అన్ని విధాలుగా అభివృద్ధి చెందిన మద్రాసు నగరాన్ని ఒదులుకోరాదు. తరతరాలుగా మద్రాసు నగరంలో ఆంధ్రులే ఎక్కువ సంఖ్యలో వుండి జీవనం సాగిస్తూ వున్నారు. వారిని తమిళ రాష్ట్రంలో కలపడం పట్ల మనం అన్యాయం చేసిన వారమే అవుతాము ! అరవవారు కూడా మద్రాసు కావాలని కోరుకోవడంలో అర్థంలేదు ! నిర్వివాద జిల్లాలతో ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేస్తామని చెప్పిన జె.వి.పి. రిపోర్టులో కూడా అనేక లోపాలున్నాయి. కాబట్టి ఈ రిపోర్టును మనం వ్యతిరేకించవలసిన అవసరం ఎంతైనా వుంది !" అని చెబుతూ తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు.

కాళేశ్వరరావు లేచి తన అభిప్రాయాన్ని ఇలా ప్రకటించాడు.

"మద్రాసు నగరం కావాలని పట్టుబడుతూ కూర్చుంటే స్వరాష్ట్ర నిర్మాణం మరింతగా జాప్యమౌతుంది ! కాబట్టి జె.వి.పి. నివేదించిన నిర్వివాద జిల్లాలతోనే వెంటనే రాష్ట్రం ఏర్పాటు కావటం మంచిది ...కాకపోతే రాష్ట్ర సరిహద్దుల విషయంలో నిర్దిష్టమైన అవగాహనకు రావడం ఎంతైనా అవసరం !"

వావిలాల గోపాల కృష్ణయ్య తన ఉద్దేశ్యాన్ని ప్రకటించాడు. "మనకు స్వరాష్ట్రం విషయంలో ఇప్పటికే చాలా ఆలస్యం జరిగింది ! ఇంకా వివాదాలకు తావిస్తూ పోవటం మంచిది కాదని నా ఉద్వేశ్యం. వెంటనే నిర్వివాద జిల్లాలతో ఎంత త్వరగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడితే అంత మంచిది !"

స్వరాష్ట్ర విషయంలో హరిసర్వోత్తమరావు గారిని తమ అభిప్రాయాన్ని తెలుపవలసిందిగా సమావేశం కోరింది !

హరిసర్వోత్తమరావు లేచి తన ఆలోచనలు చెప్పడం ప్రారంభించాడు.

"ఆంధ్ర, తమిళ ప్రజలు కూడా మన సోదరులే ! ఈ వివాదాన్ని పెంచుతూ పోవడం కంటే, మద్రాసు నగరాన్ని ఉమ్మడి రాష్ట్ర రాజధానిగా వుంచితేనే మంచిదనిపిస్తుంది. లేకుంటే ఢిల్లీ, బొంబాయి నగరాలకు మల్లే స్వయం ప్రతిపత్తి కలిగిస్తే బాగుంటుంది. ఇది నా వ్యక్తిగత అభిప్రాయం !" అంటూ క్లుప్తంగా చెప్పుకొచ్చాడు హరిసర్వోత్తమరావు.

అందరి అభిప్రాయాలపై చర్చలు జరిగాయి ! ఆ చర్చల ఫలితంగా అందరూ ఓ నిర్ణయానికొచ్చారు.

"కూకు నది సరిహద్దుగా ఆంధ్ర, తమిళ రాష్ట్రాల రాజధానులు రెండూ మద్రాసు లోనే ఉండాలి అని !"

నిర్ణయం తీర్మానం జరిగాక, సమావేశం ముగింపు వాక్యాలు పలుకుతూ చెప్పుకొచ్చాడు ఎన్.జి. రంగా ! "

"మనమిప్పుడు ప్రతిపాదించిన తీర్మానాన్ని తీసుకెళ్ళి నెహ్రూగారికి నచ్చచెప్పేందుకు శొంటి రామమూర్తిగారు నాయకత్వం వహిస్తే బాగుంటుందని అనుకొంటున్నాను ! దీనిపై మీ అభిప్రాయం తెలుపగోరుచున్నాను."

అతని నాయకత్వాన్ని అందరూ అంగీకరించేసరికి ఎలాంటి బేధాభిప్రాయం లేకుండా ఆ సమావేశం ముగిసింది !

* * *

ప్రియమైన బాబుగారికి :

పాతూరి నాగభూషణం నమస్కరించి వ్రాయు ఉత్తరం !

ఆంధ్ర గ్రంధాలయ ఉద్యమానికి, ఒక శాశ్విత భవన నిర్మాణమునకు గతంలో మీరిచ్చిన ప్రోత్సాహ సహకారాల వల్ల, మరికొంతమంది తోడ్పాటు వల్ల భవన నిర్మాణం పూర్తయినది. ఈ భవన నిర్మాణానికి 'సర్వోత్తమ భవన్' గా పేరు పెట్టాలని, 'నిర్మాణ కమిటి' ఏకగ్రీవంగా తీర్మానించింది !

భవన ప్రారంభోత్సవం గురించి చర్చించుటకుగాను మీరు వెంటనే బయలుదేరి రావలసిందిగా కోరుచున్నాను.

ఇట్లు

పాతూరి నాగభూషణం

ఆంధ్రరాష్ట్ర ఉద్యమానికి సంబంధించి తలమునకలవుతూ పర్యటనలు గావిస్తున్న హరిసర్వోత్తమరావు తిరిగి మద్రాసు చేరి పై ఉత్తరం అందుకునేసరికి, 'బడలిక' అన్నమాట కూడా మరచి వెంటనే బెజవాడకు ప్రయాణమయ్యాడు.

బెజవాడకు చేరుకున్న హరిసర్వోత్తమరావుతో నాగభూషణం 'భవన ప్రారంభోత్సవానికి దేశనాయకులెవరినైనా ఆహ్వానించవలెనన్న' తన కోరికను వెల్లడిచేశాడు.

ఆ మాటకు స్పందించిన హరిసర్వోత్తమరావు నాగభూషణంతో ఇలా చెప్పుకొచ్చాడు.

"పాములపాటి వెంకట కృష్ణయ్య చౌదరి మనవాడు ! గ్రామాలలో విద్యావ్యాప్తి నిమిత్తం విరివిగా హైస్కూళ్ళను స్థాపిస్తున్నాడు. ఆయనను ఆహ్వానిస్తే బాగుంటుందని నా ఉద్దేశ్యం !"

హరిసర్వోత్తమరావు మాట శిరసావహించి భవన ప్రారంభోత్సవపు ఏర్పాట్లలో లీనమయ్యాడు నాగభూషణం.

ఆ మరురోజే శ్రీ పాములపాటి వెంకట కృష్ణయ్య చౌదరిగారి చేత భవన ప్రారంభోత్సవం నిరాడంబరంగా జరిగింది !

ప్రారంభోత్సవ కార్యక్రమం విజయవంతంగా ముగిశాక, హరిసర్వోత్తమరావు తన మనసులోని ఉద్దేశ్యాన్ని నిర్మొహమాటంగా బయటపెట్టాడు.

"ఈ గ్రంధాలయ భవనానికి నా పేరు పెట్టడంలో ఎలాంటి ఔచిత్యం లేదని నేను భావిస్తున్నాను. నా పేరు కంటే మనదేశ స్వాతంత్ర్యం కోసం అహర్నిశలు శ్రమించిన, పూజ్య బాపూజీ పేరు పెట్టుంటే ఎంతో సముచితంగా వుండేది ! పై అంతస్తు భవన నిర్మాణం జరిగే ప్రయత్నం జరుగుతున్నది కాబట్టి ఏమరుపాటున కూడా విస్మరించక, 'పూజ్య బాపూజీ మందిరం' గా ఈ మారయినా పేరు పెట్టాలని ఆశిస్తున్నాను ! ఈ సందర్భంగా ఓ ముఖ్య విషయం చెప్పదలచుకున్నాను. దయచేసి భవిష్యత్తులో జరిగే ఎలాంటి నిర్మాణాలకు నా పేరు పెట్టరాదని కోరుకొంటున్నాను! నాకు కావలసిందల్లా నా పట్ల మీ మనసుల్లో కాసింత ప్రేమ, అభిమానం !"

ఆర్థిక సహాయం అందుకోడూ !

కృతజ్ఞతగా ఇలాంటి కార్యమేదైనా తలపెడితే వూరుకోడు ! ఏమిటీతని మనస్థత్వం అన్నట్టుగా విస్తుపాటుతో చూస్తుండిపోయారు కమిటీ సభ్యులు !!! ఆ సమయంలో వారికి హరిసర్వోత్తమరావు అర్థంకాని ఓ శేష ప్రశ్నలా అగుపించాడు !

* * *

ఆంధ్ర రాష్ట్ర నిర్మాణంలో ఇంకా ప్రతిష్ఠంభన తొలగలేదు ! ఆ సందర్భంగా ఆంధ్రమహాసభ అధ్యక్షులుగా హరిసర్వోత్తమరావు నాయకత్వంలో, మొసలికంటి తిరుమలరావు, కల్లూరు సుబ్బారావు, వావిలాల గోపాల కృష్ణయ్య గార్లతో కూడిన రాయబార బృందం ఢిల్లీకి వెళ్ళి రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌ను, ప్రధానమంత్రి నెహ్రూను, అబ్దుల్ కలాం అజాద్‌ను, కాంగ్రెస్ అధ్యక్షుడు డాక్టర్ పట్టాభిని కలిసింది !

ఆంధ్రరాష్ట్రం కొరకు ప్రజలెంతగా ఆరాటపడుతున్నారో తెలియజేసి నచ్చచెప్పాడు హరిసర్వోత్తమరావు వారితో ! చర్చలు సుహృద్భావ పూర్వకంగానే జరిగాయి కాని ఫలితం ఆశించినంతగా జరుగకపోయేసరికి, బొంబాయిలో వున్న సర్దార్ వల్లభాయ్ పటేల్‌ను కలిసి 'ఆంధ్రరాష్ట్రా'న్ని వెంటనే ఏర్పాటు చేయవలెనని పూర్వాపరాలన్నీ విశదీకరించి చెప్పాడు హరిసర్వోత్తమరావు.

అందుకు స్పందించిన పటేల్, ఆంధ్రరాష్ట్రం యిస్తే కమ్యూనిష్టుల బెడద పెరుగుతుంది కదా ?' అంటూ హరిసర్వోత్తమరావు వేపు చూశాడు.

"ఆంధ్ర రాష్ట్రం ఇవ్వనందువల్లనే కమ్యూనిష్టులు బలపడ్డారు ! ఆంధ్రరాష్ట్రం ఏర్పరిస్తే వారి బలం సన్నగిల్లుతుంది !" వెంటనే సమాధానమిచ్చాడు హరిసర్వోత్తమరావు !

హరిసర్వోత్తమరావు సమాధానానికి చకితుడై అడిగాడు పటేల్ !

"రాయలసీమ వారిలో ప్రత్యేక రాష్ట్రమును గూర్చి తీవ్ర భేదాభిప్రాయాలున్నాయి కదా !"

"నేను రాయలసీమ వాసినన్న విషయం మీకు తెలియదా !"

హరిసర్వోత్తమరావు వాక్చాతుర్యానికి విస్తుపోయి చూశాడు పటేల్ !

హరిసర్వోత్తమరావు మళ్ళీ చెప్పుకొచ్చాడు.

"ప్రధాన విషయాల్లో బేధాభిప్రాయలేమీ లేవు. స్వల్ప విభేదాలున్నా వాటిని సమన్వయ పరచుకోగలం !"

హరిసర్వోత్తమరావు చెప్పింది విన్న పటేల్ ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి వెంటనే తగిన చర్యలు తీసుకుంటాను అంటూ హామీ ఇచ్చాడు.

హరిసర్వోత్తమరావు బృందం పటేల్‌కు కృతజ్ఞతలు తెల్పుకుని తిరిగి వచ్చేశారు.

ఈలోపు మద్రాసు శాసన సభలోని ఆంధ్ర కాంగ్రెస్ నాయకులు ముఠాలుగా చీలారు. పట్టాభి, ప్రకాశం, యన్.జి. రంగా, నీలం సంజీవరెడ్డి మొదలగు వారు ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాన్ని కొంతమేర నీరు గార్చారు !

స్వరాష్ట్ర విషయంలో ఢిల్లీ నేతల అలస్య వైఖరి, అందుకు తోడు ఆంధ్ర కాంగ్రెస్ నాయకుల అనుచిత వైఖరి హరిసర్వోత్తమరావుకు విచారం కల్గించింది !

*    *    *

హరిసర్వోత్తమరావు ప్రజల్లో మళ్ళీ స్వరాష్ట్ర కాంక్షను రేపేందుకు ఆంధ్ర దేశమంతటా పర్యటన మొదలు పెట్టారు.

ఈ సందర్భంలోనే 'విశాలాంధ్ర' ఏర్పాటువాదం కూడా బలం పుంజుకుంది !

తత్ఫలితం !!

విశాలాంధ్ర మహాసభ బెజవాడలో ఏర్పాటైంది !

అయ్యదేవర కాళేశ్వరరావు అధ్యక్షులుగా, డా. ప్రకాశ చంద్ర శతపథి ప్రధాన కార్యదర్శి, యం.యస్. రాజలింగం. కోదాటి నారాయణరావు, ఆచార్య రంగా, మాడపాటి హనుమంతరావు, కాళోజీ నారాయణరావు సభ్యులు. వీరిలో హరిసర్వోత్తమరావు కూడా వున్నారు.

* * *

ఆంధ్ర రాష్ట్ర వ్యతిరేకోద్యమము కూడా ముమ్మరంగా సాగుతున్న రోజులలో ...

ఒకరోజు ...

'ఆంధ్ర రాష్ట్ర అనుకూలోద్యమ' ప్రచార నిమిత్తం హరిసర్వోత్తమరావు, ప్రకాశ చంద్ర శతపథితో కలిసి గుంటూరుకు రైలు ప్రయాణం సాగించారు.

ఉద్యమ ప్రచార నిర్వహణ గురించి ఇద్దరి మధ్య చాలాసేపు మాటలు సాగాక, ఆంధ్రరాష్ట్ర వ్యతిరేకోద్యమ వాదుల ప్రస్థావన చర్చకు వచ్చింది !

అందుకు స్పందించిన ప్రకాశ చంద్ర శతపథి హరిసర్వోత్తమరావుతో ఇలా చెప్పుకొచ్చాడు!

"మేము ఆంధ్రులం కాము ! మాకు అరవలతోనే సన్నిహితత్వమెక్కువ. కనుక మద్రాసులోనే వుంటాం ! కోస్తా జిల్లాలవారు కావలిస్తే ఆంధ్రరాష్ట్రమేర్పరచు కోవచ్చుని' అంటూ నీలం సంజీవరెడ్డిగారు 'రాయలసీమ పరిషత్' పేరిట పెద్ద సభలు జరిపి ప్రసంగిస్తున్నారు. ఆయనకు అండగా కల్లూరు సుబ్బారావు వున్నారు. ఇలా మనలో మనకే భేదాభిప్రాయాలు వుంటే స్వరాష్ట్రం ఎలా సిద్ధిస్తుంది ?"

ప్రకాశ చంద్ర శతపథి ప్రశ్నకు కొద్దిసేపు మౌనం వహించాడు హరిసర్వోత్తమరావు. ఆ తర్వాత చిన్నగా నవ్వుతూ సమాధానమిచ్చాడు.

"వారిది అధికార తాపత్రయోద్యమం ! పదవులు లభిస్తే సమగ్రాంధ్రను గూర్చి ప్రసంగించే వారిలో ప్రధములు వారే అవుతారు !"

"మరి మీరెందుకు ఆ ఉద్యమంలో పాల్గొనరు ?" అంటూ తిరిగి ప్రశ్నించాడు శతపథి.

"నాకు వారి ఆశయాలు నచ్చలేదు గనుక ! బెజవాడ గోపాలరెడ్డి గారు కూడా మదరాసు రాష్ట్రంలోనే ఉండాలని యిష్టమున్నట్లు ప్రకటించడం నాకెంతో మనస్తాపం కలిగించింది. ఏది ఏమైనా ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం తప్పక సిద్ధిస్తుంది. అలాగే విశాలంధ్ర కూడా ! ఇది తథ్యం !"

– అని ఆవేశంగా చెప్పుకుపోతున్న హరిసర్వోత్తమరావు "నమస్కారమండి !" అన్న గొంతు విన్పించేసరికి అటుకేసి తిరిగి చూశాడు.

లాల్చి, పైజామా, చేతిలో కాగితాల కట్టతో వున్న ఓ వ్యక్తి అగుపించాడు.

"నేను పత్రికా విలేకరినండి ! ఉద్యమ ప్రచారానికి మీరు గుంటూరు వెళ్తున్నారని తెలిసింది."

"అవును !" అంటూ తాను కూర్చున్న చోటునుంచి కొంచెము జరిగి కూర్చోమన్నట్టుగా సంజ్ఞ చేశాడు.

"మీ ప్రక్కన కూర్చునేంతటి అర్హత నాకులేదు !" అంటూ ఎదురుగా కూర్చున్న ఓ వ్యక్తి పక్కన సర్దుకొని కూర్చుని వినయంగా అర్థించాడు.

"సార్ ! మీతో కాస్సేపు ఇంటర్వ్యూ చేయొచ్చా !"

"ఓ.యస్. దానికేముంది !"

"ప్రజల్లో స్వరాష్ట్ర ఉద్యమం పట్ల ఆసక్తిని రేపేందుకు మీరు రాష్ట్రమం‥ ‥ పర్యటన చేస్తున్న మీ కృషి ఎంతవరకు ఫలించిందో చెబుతారా ?"

"శక్తివంచన లేకుండా మా శాయశక్తులా ప్రయత్నిస్తున్నాం ! అప్పటికీ మా ప్రయత్నము నెరవేరకపోతే మదరాసు ప్రభుత్వంలోని ఆంధ్ర శాసనసభ్యులందరిచేత రాజీనామాలు చేయించి ఉద్యమం తీవ్రతరం చేయించే ప్రతిపాదన చేపడతాం !"

"రాష్ట్రావతరణే ఇంకా జరుగలేదు కదా ! అప్పుడే విశాలాంధ్ర వస్తుందని ఎలా ఆశిస్తున్నారు ?"

"ఆశించడంలో తప్పేముంది ?" అంటూ ఎదురుప్రశ్న వేశాడు.

"పురమే లేదు. అంతఃపురానికిది పయనం' అని నీలంవారు 'ఆలులేదు, చూలులేదు. బిడ్డకు నామకరణం' అని బెజవాడవారు వ్యాఖ్యానించారు. దీనిపై మీ అభిప్రాయం ?"

పై ప్రశ్న విన్న హరిసర్వోత్తమరావు ముఖం అదోలా మారిపోయింది. కాసేపు, వేగంగా పరువెత్తుతున్న రైలు కిటికీల్లోంచి బయటికి చూశారు.

"అదుగో ఆ వచ్చేదే గుంటూరు స్టేషన్ !" అంటూ మూటాముల్లె సర్దుకుంటున్నారు ప్రయాణీకులు.

హరిసర్వోత్తమరావు భారంగా నిట్టూరుస్తూ, అలా చూస్తూనే జవాబిచ్చాడు.

"ఒకవైపు కాంగ్రెసు వాదులుగా వుంటూ, మరొకవైపు జస్టిస్ పార్టీ ఉద్యమకారులతో వీరు చేతులు కలపడం మంచి పద్ధతికాదు. వీరు ప్రజాసేవకులైనా వీరికి ప్రజాశ్రేయస్సు కాదు ప్రధానం..... స్వశ్రేయస్సు !

ఇంతలో గుంటూరు రావటంతో పెద్ద కూత పెడుతూ రైలుస్టేషన్‌లో ఆగిపోయింది!

"చాలా కృతజ్ఞతలు" అని చెప్పి విలేకరి హరిసర్వోత్తమరావ వద్ద శలవు తీసుకొని వెళ్లిపోయాడు.

హరిసర్వోత్తమరావు, ప్రకాశచంద్ర శతపథి రైల్లోంచి దిగి స్టేషన్‌లో వేచివున్న ఉద్యమకారులతో, కలసి, ఉద్యమవేదిక వైపుకు కదిలారు !

* * *

ఆంధ్రదేశంలో ఏ ఇద్దరు వ్యక్తులు కలిసి మాట్లాడుకొన్నా మొదట చర్చించేది స్వరాష్ట్ర విషయం గురించే ! గడిచే ప్రతిదినం, ఉద్రిక్తతను రేపుతూ ఆంధ్రరాష్ట్రం కోసం సాగుతున్న ఆందోళనకు, ఆంధ్ర దేశానికి నీటిపారుదల ప్రాజెక్టుల విషయంలో మద్రాసు ప్రభుత్వం లోపభూయిష్టమైన 'కృష్ణా, పెన్నార్ పథకం' తలపెట్టేసరికి ఆజ్యం పోసినట్లయింది !

ఆంధ్ర ప్రాంతానికి సంబంధించిన శాసనసభ్యులు కూడా ఈ విషయంలో తీవ్రమయిన నిరసన తెలియచేసేసరికి, మద్రాసు ప్రభుత్వం వెనక్కు తగ్గి 'ఖోస్లా కమీషన్' వేయడం, తత్ఫలితంగా ఆంధ్రులకు సంబంధించి నందికొండ ప్రాజెక్టు (నాగార్జునసాగర్ ప్రాజెక్టు) నిర్మాణ విషయంలో అంగీకారానికి వచ్చింది !

అయినా స్వరాష్ట్ర ఉద్యమం తగ్గుముఖం పట్టలేదు. స్వరాష్ట్రం లేనందువల్ల ప్రాజెక్టుల విషయంలో ఆంధ్ర దేశానికి సంబంధించి అనేక అన్యాయాలు జరుగుతున్నాయి, కాబట్టి వెంటనే రాష్ట్రనిర్మాణం జరగాలి అన్న కోరిక అందరిలోనూ ఉధృతమయింది !

# 22

1952 సెప్టెంబరు 19వ తారీకు !

'స్వరాష్ట్ర నిర్మాణం ఆవశ్యకత' గురించి ఆంధ్రదేశం నలుమూలల పర్యటించి వచ్చిన హరిసర్వోత్తమరావు బడలిక కూడా మరచి, మిత్రులు వివిధ అంశాలమీద తనకు వ్రాసిన ఉత్తరాలను చదివి వాటికి బదులు వ్రాసి, తానే స్వయంగా పోస్టుచేసి వచ్చి 'రివ్యూ' కోసం 'హిందు' దినపత్రికవారు తనకు పంపిన పుస్తకాలను చదవడానికి ఉపక్రమించాడు !

అదే సమయంలో........

స్వరాష్ట్ర నిర్మాణ ఉద్యమానికి సంబంధించిన ఎమ్.ఆర్. అప్పారావు, పసల సూర్యచంద్రరావు నేరుగా హరిసర్వోత్తమరావు గదిలోకి వచ్చారు ! వారి రాకను గమనించిన హరిసర్వోత్తమరావు చదువుతున్న పుస్తకాలను ప్రక్కకు పెట్టి, "రండి !" అంటూ తనకు ఎదురుగా వున్న కుర్చీలను చూపించాడు. వారందులో ఆశీనులయ్యాక, ఆందోళన పూరిత స్వరంతో చెప్పారు !

స్వరాష్ట్ర నిర్మాణ ఉద్యమంలో ముఖ్యులైన పొట్టి శ్రీరాములుగారు ఈవేళ ఉదయం బులుసు సాంబమూర్తి గారింట్లో నిరాహారదీక్షను చేపట్టారు !

'స్వరాష్ట్రం' సిద్ధించేవరకు తమ దీక్ష విరమించరట ! మీరు పెద్దవారు ! మీ మాటవారు తప్పక వింటారు. మీరు వచ్చి దీక్షను విరమింపచేయకపోతే అనర్థాలు జరిగే అవకాశాలున్నాయి. కాబట్టి మీరు మావెంట బయల్దేరి రావాలి !"

"పదండి !" అంటూ వారివెంట బయల్దేరిన హరిసర్వోత్తమరావు ఓ పావుగంట తర్వాత ఆంధ్ర మహాసభ ఉద్యమంలో భాగస్వామి అయిన బులుసు సాంబమూర్తి ఇల్లు చేరుకున్నాడు. అప్పటికే మద్రాసులోని స్వరాష్ట్ర నిర్మాణ ఉద్యమానికి సంబంధించి మద్రాసులో వున్న ప్రముఖులందరూ అక్కడికి చేరుకున్నారు. ఉద్యమ నిర్మాణంలో 'పెద్ద దిక్కు'గా వున్న హరిసర్వోత్తమరావును చూడగానే అందరూ తేలిగ్గా నిట్టూర్చారు !

బులుసు సాంబమూర్తి, "రండి !" అంటూ పొట్టి శ్రీరాములు దీక్షలో వుంటున్న గదిలోకి తీసుకెళ్లాడు.

దీక్షలో కూర్చొని వున్న పొట్టి శ్రీరాములు హరిసర్వోత్తమరావును చూడగానే రెండు చేతులు జోడించి నమస్కరించాడు. హరిసర్వోత్తమరావు అతని పక్కనే కూర్చొని ప్రేమగా అతని కళ్లలోకి చూస్తూ అన్నాడు.

"ఏమిటిది శ్రీరాములు ! నిరాహారదీక్ష బూని శరీరాన్ని శుష్కింపచేయడం వల్ల ఫలితముంటుందంటావా ? ఏ సమస్యనైనా ఎదుర్కోవడానికి మానసిక స్థైర్యంతో పాటు శారీరక బలం కూడా అవసరమన్న సంగతి మరిచావా ? ఆ బలాన్ని క్షీణింపచేసుకోవడంలో అర్థం లేదు. నా మాట విని దీక్ష విరమించు. స్వరాష్ట్ర నిర్మాణం జరిగే సమయం ఆసన్నమయింది! ఎవరెన్ని కుతంత్రాలు జరిపినా, అడ్డంకులు కల్పించినా తప్పకవచ్చి తీరుతుంది !"

"మీలాంటి పెద్దల మాటను కాదని ప్రవర్తిస్తున్నందుకు మన్నించకోరుతాను. స్వరాష్ట్ర నిర్మాణం జరగందే నేను దీక్ష విరమించను ! ప్రాణత్యాగానికైనా సరే వెనుకాడను ! దయచేసి నన్నర్థం చేసుకొని, ఈ దీక్ష విషయంలో సహకరిస్తారని ఆశిస్తున్నాను !" అంటూ తన నిర్ణయాన్ని తేటతెల్లం చేశాడు పొట్టిశ్రీరాములు.

శ్రీరాముల 'పట్టుదల' ఎలాంటిదో తెలుసుకున్న హరిసర్వోత్తమరావు మౌనంగా బయటికి వచ్చాడు. ఉద్యమమిత్రులంతా అతనిచుట్టూరా చేరి,

"ఇప్పుడేం చేయాలి ?" అన్నట్టుగా చూశారు !

"శ్రీరాములు ఆరోగ్య విషయంలో జాగ్రత్త వహించండి ! ఈ విషయం గురించి రేపు అసెంబ్లీకి వెళ్ళి, మన ప్రాంతపు శాసనసభ్యులతో చర్చిస్తాను." అంటూ వారందరి దగ్గర శలవు తీసుకొని భారమైన మనసుతో బయటికి అడుగులు వేశాడు హరిసర్వోత్తమరావు. అక్కడున్నవారి హృదయాలు కూడా బరువెక్కాయి !

తుఫాను ముందటి ప్రశాంతతలా వుంది అక్కడి వాతావరణం !

* * *

పొట్టి శ్రీరాములు దీక్ష గురించి, తనవంతు బాధ్యతగా శాసనసభ్యులతో కలిసి ఓ తీర్మానాన్ని ఆమోదింపచేసి నెహ్రూకు పంపినా ఎలాంటి సమాధానం రాలేదు !

హరిసర్వోత్తమరావులో నిరాశ !

రోజులు గడుస్తూ వున్నాయి !

నిరాహారదీక్ష కొనసాగుతూనే వుంది !

పొట్టి శ్రీరాములు ఆరోగ్యం క్షీణించిపోతూ వుంది !.... ఎవరెన్ని ప్రయత్నాలు చేసినా, తన దీక్షను వీడలేదు శ్రీరాములు. ఆయన ఆరోగ్య విషయం, ఆంధ్రదేశం ప్రజానీకంలో చర్చనీయాంశమైంది !

ఎవరు కలిసినా, మాట్లాడుకున్నా ఇదే విషయం !

అందరిలో ఆందోళన ! ఏం చెయ్యాలో ఎవరికి దిక్కుతోచని స్థితి !...... పరిస్థితి !!

నిరాహారదీక్ష నెలరోజులు దాటింది !

రోజుకు అయిదారుమార్లు స్పృహతప్పుతూ వున్నాడు పొట్టి శ్రీరాములు. ఆంధ్రదేశం నలుమూలల నుంచి ప్రజానీకం వచ్చి దర్శిస్తున్నారు.

శ్రీరాములు ఆరోగ్య పరిస్థితిని గమనించిన డాక్టర్లు 'వెంటనే వైద్యం చేయకపోతే శ్రీరాములు మనకు దక్కడు' అని అక్కడున్నవారితో చెప్పారు.

ఎవరెన్ని చెప్పినా శ్రీరాముల నిర్ణయంలో మాత్రం మార్పు రాలేదు. "ఆయన అకుంఠిత దీక్ష ఆంధ్ర రాష్ట్రావతరణమే ! అది సాధించేవరకు దీక్ష విరమణ జరుగదు."

రోజు రోజుకు పరిస్థితి ఉద్రిక్తంగా తయారయ్యింది ! శ్రీరాముల నిరాహారదీక్షకు ప్రభుత్వం బెంబేలెత్తిపోయినా, చర్చలు మాత్రం చేపట్టలేకపోయింది !

మరో పదిరోజులు గడిచాయి !

శ్రీరాముల ఆరోగ్యం పూర్తిగా క్షీణించిపోయింది ! చివరకి కోమాలోకి వెళ్ళిపోయాడు. కోమాలోకి వెళ్లేముందు శ్రీరాములు ఇలా అన్నాడు !

"నేను...... ఏమైపోయి........ నాసరే... వైద్యం...... చేసే....... ప్ర........ ప్రయ......త్నం..... చేయకం......డి.......నా....ధ్యేయం......... ఆంధ్ర........... రాష్ట్రా........వ.....త.....ర....ణ.....మే........ నా......పో.........రా......టా.......న్ని వి:...ఘ్నం....చే......యే.......కం.......డి."

శ్రీరాములు అలా చెప్పినందువల్ల ఎవరూ సాహసించి అలాంటి ప్రయత్నానికి పూనుకోవడం లేదు !

58 రోజుల అనంతరం !

1952 డిసెంబరు 15 వ తేదీ !

అర్ధరాత్రి సమయం......

కోమాలో వున్న శ్రీరాములు మౌనంగా బాహ్యప్రపంచం నుంచి నిష్క్రమణ చేశాడు.

తులసితీర్థం వేసే ప్రయత్నం చేసిన బులుసు సాంబమూర్తికి పరిస్థితి అవగతమయ్యేసరికి, గట్టిగా రోదిస్తూ బయటికొచ్చి చెప్పాడు.

"శ్రీరాములుగారు అమరజీవులైనారు !"

అంతే !.......

ఈ వార్త దావానలంలా ఆంధ్రదేశమంతటా వ్యాపించిపోయింది !

హరిసర్వోత్తమరావు, యం.ఆర్. అప్పారావుతో కలిసి శ్రీరాములు సిద్ధి పొందిన గృహానికి వెళ్లి, వారికి నివాళులర్పించి వారి అంత్యక్రియలలో పాల్గొన్నారు.
"శ్రీరాములు అమర్ రహే !" అన్న నినాదం !

"ప్రజల్లో ఆవేశం లావాలా ప్రవహించింది !

కసి ! ఉద్వేగం !!

పర్యవసానం ?

మద్రాసు, విజయవాడలో విధ్వంసకాండ !

బస్సులు... రైలుబోగీలు తగలబడ్డాయి !

కొందరి భవనాలు కూల్చబడ్డాయి !

యావత్ ఆంధ్ర దేశమంతా పౌరజీవితం స్థంభించిపోయింది !

ఈ వార్త కేంద్ర నాయకులకు కూడా ముచ్చెమటలు పట్టించాయి. ఆ ముచ్చెమటలతోనే "స్వరాష్ట్రం తప్పక ఇస్తాం !" అంటూ పార్లమెంట్‌లో ప్రకటనలు చేశారు.

ఓ త్యాగమూర్తి బలిదానం జరిగాక స్వరాష్ట్రం ఏర్పాటుకు సన్నాహాలు ప్రారంభమయ్యాయి.

* * *

కేంద్ర ప్రభుత్వం మళ్ళీ నివేదిక కోరింది ! నివేదికకు సంబంధించి రాజస్థాన్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి 'వాం ఛూను' నియమించింది.

ఆంధ్ర మహాసభ పక్షాన హరిసర్వోత్తమరావు, యం.ఆర్. అప్పారావు, జి.వి. పున్నయ్యశాస్త్రి, శ్రీరామమూర్తి ఆంధ్రరాష్ట్ర ఉద్యమాన్ని గురించిన వివరాలతో ఆంధ్రరాష్ట్ర సత్వర స్థాపన అవసరాన్ని తెలుపుతూ అభ్యర్థన అందచేశారు.

నివేదిక ఆధారంగా 1953 అక్టోబరు 1వ తేదీన కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం అవతరించింది. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు ముఖ్యమంత్రిగా ఎన్నికైయ్యాడు. శ్రీ సి.యం. త్రివేది గవర్నరుగా నియమించబడ్డాడు. ఈ సందర్భంగా ఆరువేల మంది ఖైదీలను ముఖ్యమంత్రి విడుదల చేయించాడు.

ఆంధ్ర నేతల దృష్టి మళ్ళీ 'విశాలాంధ్ర' పై మరలింది ! తెలంగాణా కూడా ఆంధ్రలో కలపాలి అన్న వాదనకు బలంచేకూరింది !

భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకు ఫజుల్ ఆలీ అధ్యక్షతన ఒక సంఘాన్ని ఏర్పాటు చేసింది భారత ప్రభుత్వం !

హరిసర్వోత్తమరావు, కాళేశ్వరరావు, అప్పారావు కలిసి విశాలాంధ్ర రాష్ట్రం ఏర్పాటు కావాలని, దానికి హైదరాబాద్ నగరం రాజధానిగా వుండాలని ఒక నివేదిక తయారు చేసి 1955 లో సమర్పించారు.

మొదట నిజాం నవాబు ఆంధ్రలో నైజాంను విలీనం చేయడానికి అంగీకరించలేదు. పటేల్ పోలీసు చర్య ఫలితంగా నైజాం ఆంధ్రలో కలవక తప్పలేదు ! ఆనాటి హైదరాబాదు ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు పట్టుదల విశాలాంధ్ర అవతరణకు తోడైనది ! దీని ఫలితంగా ఆంధ్రప్రదేశ్ అవతరణ 1956 నవంబర్ 1 టిన హైదరాబాద్ రాజధానిగా అవతరించింది ! నీలం సంజీవరెడ్డి ముఖ్యమంత్రిగా ఎన్నిక అయ్యాడు.

ముక్కోటి ఆంధ్రులు ఒక్కటైనందుకు ఎంతగానో ఆనందించాడు చిట్టచివరి ఆంధ్రమహాసభ అధ్యక్షులైన హరిసర్వోత్తమరావు !

* * *

కాలమెప్పుడూ ఒకేలా వుండదు !

రోజులు మారాయి ! మనుషులు మారారు ! నేతలు కూడా మారారు !

నిస్వార్థం అంతరించింది !

స్వార్థం తలెత్తింది !!

ధనబలం, అంగబలం వున్నవాడే 'నాయకుడు' గా చెలామణి అయ్యేరోజులు అవతరించాయి !

ఆంధ్ర ప్రదేశ్‌కు నూతనంగా 'విధాన మండలి' ఏర్పడింది ! నాయకులలో విధాన మండలికి నామినేటు చేయవలసిన సభ్యుల ప్రస్తావనకు వచ్చింది !

ఎవరికివారు తమకు తోచిన పేర్లను సూచించారు. అందులో కొందరు తమ అభిప్రాయాల్ని యిలా చెప్పుకొచ్చారు.

"దేశానికి, జాతికి, భాషకు నిరంతరం సేవ చేసిన హరిసర్వోత్తమరావుగారిని నామినేట్ చేయడం ఎంతైనా సముచితంగా వుంటుంది. ఈ విధంగా ఆయన పట్ల మనం గౌరవం చూపించవలసిన సమయం యిప్పుడు వచ్చింది !"

మరికొందరు ఉన్నవ లక్ష్మీనారాయణ పేరును కూడా సూచించారు.

వీరిరువురి పేర్లయితే ప్రస్తావనకు వచ్చాయికాని, బలపరచిన వారు ఒక్కరు కూడా నాయకులలో కన్పించకపోయేసరికి, సూచించినవారు మౌనంగా వుండిపోయారు.

"లోకం వారిని మరచిపోయింది. మళ్ళీవారిని జ్ఞాపకం చేయకండి. వారి అవసరం యిప్పుడు ప్రజలకు లేదు !" అంటూ పై ఇద్దరి పేర్లను ప్రస్తావించిన సభ్యుల నోర్లు మూయించారు అధికార పక్షం నాయకులు.

"పాపం సర్వోత్తమరావు !" అంటూ కొందరు పెదవులు విరిచారు.

తత్ఫలితం !

హరిసర్వోత్తమరావు లాంటి వారు వెనుకకు తగ్గారు.

మారుతోన్న కాలం కొద్దీ వారిని ప్రభుత్వం పట్టించుకోలేదు. ... ప్రజలు పట్టించుకోలేదు.

పర్యవసానం ?

ప్రజాసేవే వూపిరిగా భావించిన హరిసర్వోత్తమరావు జీవితం .... ??? !!!

# 23

రోజులు గడుస్తున్నాయి !

హరిసర్వోత్తమరావు ఆర్థిక పరిస్థితి మరింతగా దిగజారింది ! కూతురు ఇంట్లో వున్నా, కూతురు, అల్లుడిపై తన ఆర్థిక భారం మోపడానికి స్వాభిమానం కల హరిసర్వోత్తమరావు మనసందుకు అంగీకరించలేదు ! ఏం చేసైనా సరే, తన ఖర్చుల నిమిత్తం కొద్దిపాటి సొమ్మయినా, తానే సంపాదించుకోవాలన్న నిర్ణయానికి వచ్చిన హరిసర్వోత్తమరావు,

"అమ్మాయ్ ద్వారకా ! నేనలా యూనివర్శిటీకెళ్ళొస్తాను !" అంటూ ఇంటినుంచి బయటపడ్డ హరిసర్వోత్తమరావు, ఏదో గుర్తొచ్చినట్లయి జేబును ఓ మారు తడిమి చూసుకొన్నాడు. ఖాళీ జేబులు వెక్కిరించేసరికి, చిన్నగా తనలో తానే నవ్వుకొని మూడు, నాలుగు కిలో మీటర్లకు

పైగా వున్న యూనివర్శిటీకి కాలి నడకన బయల్దేరాడు. నడుస్తున్నాడన్న మాటేగాని, మునుపటిలా అతని శరీరం నడకసాగించటానికి సహకరించడంలేదు. డెబ్బది అయిదేళ్ళ వయసు ! అదే విషయాన్ని మనసులో తలపోస్తూ, 'యవ్వనం మనిషికో వరమైతే, ముసలితనం శాపం లాంటిది' అనుకుంటూ భారంగా నిట్టూర్చి శరీరం సహకరించకున్నా నడక తప్పదు కాబట్టి శారీరక బాధను పళ్ళ బిగువున అణచిపెట్టి తిన్నగా అడుగులు వేస్తూ యూనివర్శిటి క్యాంపస్ చేరేసరికి రెండు గంటలు పైగానే పట్టింది హరిసర్వోత్తమరావుకు !

యూనివర్శిటి చేరుకున్న హరిసర్వోత్తమరావును 'పూర్వపు కళాశాల విద్యార్థిగా', అక్కడకు చేరిన విద్యార్థులకు పరిచయం గావించి గౌరవించారు యూనివర్శిటి అధికారులు. ఆ సందర్భంగా హరిసర్వోత్తమరావు 'నాకేదైనా పని చూపించండి' అని అడిగాడు.

అలా అడుగుతున్న హరిసర్వోత్తమరావుతో,

"సార్ మీరు మాకు ట్యూషన్ చెప్పగలరా ?" అంటూ చుట్టూ మూగారు విద్యార్థులు !

"మీ కోరిక కాదనగలనా ?" చిన్నగా నవ్వుతూ బదులు చెప్పాడు హరిసర్వోత్తమరావు.

"అయితే రేపటినుండే మేము ట్యూషన్‌కు వస్తాం !"

అంటున్నపుడు ఆయన కళ్ళు చెమ్మగిల్లినాయి ! తన పరిస్థితిని గమనించి విద్యార్థులు తీసుకున్న నిర్ణయానికి కృతజ్ఞతలు మనసులోనే అర్పించుకొంటూ వుండగా ...

"సార్ ! ట్యూషన్‌కు మా అడ్వాన్స్ డబ్బు తీసుకొండి !" అంటున్న విద్యార్థులతో చెప్పుకొచ్చాడు హరిసర్వోత్తమరావు "సారీ స్టూడెంట్స్ ! ఏదైనా పని చేసిం తర్వాతే డబ్బు ! మీ పని చేసి పెట్టకుండా ముందుగానే డబ్బు తీసుకోవటం వ్యాపార లక్షణం అవుతుంది !"

అలా చెప్పుకపోతున్న మాస్టారు వంక చూస్తూ, "మీ మనస్తత్వం తెలియక ప్రవర్తించినందుకు సిగ్గుపడుతున్నాం. మమ్ములను క్షమించరూ !" అంటూ వినయ పూర్వకంగా అర్థించిన విద్యార్థులకు, కర్తవ్యాన్ని అచంచల విశ్వాసంతో ఆచరించే కర్మయోగిలా సాక్షాత్కరించాడు హరిసర్వోత్తమరావు !

* * *

కొంతకాలం గడిచింది !

ట్యూషన్స్ వల్ల రాబడి అంతగా లేకపోయినా, క్రమం తప్పక యూనివర్శిటీకి వెళ్ళేవాడు హరిసర్వోత్తమరావు.

అదే సమయంలో తాను వ్రాసిన 'శ్రీరామ చరిత్ర', 'పౌరశిక్షణ' పుస్తకాలను పాఠశాలల్లో పెట్టుటకు విద్యాశాఖ వారు సిఫార్సు చేసిన ఆర్డరు చేతికందటంతో, ఆ పుస్తకాలను అమ్ముకునేందుకు ఆంధ్రరాష్ట్రంలో నలుదిశలా సంచరించక తప్పలేదు హరిసర్వోత్తమరావుకు!

* * *

పెనుగొండ (అనంతపురం జిల్లా)లోని ప్రభుత్వ ఉన్నత పాఠశాల !

"అయ్యా ! హెడ్ మాస్టర్ గారున్నారా ?"

ఆ పిలుపుకి తలెత్తి చూశాడు అటెండరు !

పాలిపోయిన ముఖం, పెరిగిన గడ్డం, మాసిన దుస్తులతో ఓ వ్యక్తి ! పక్కనే బరువైన పుస్తకాల సంచి !

"ఆయనతో నీకేం పని ?" అంటూ హరిసర్వోత్తమరావు వంక అదోలా చూశాడు !

"పుస్తకాల విషయం వారితో మాట్లాడాలి !" నెమ్మదిగా చెప్పాడు సర్వోత్తమరావు.

"బయటే వుండండి !" అంటూ లోపలి కెళ్ళి తిరిగొచ్చాక చెప్పాడు !

"వెళ్ళండి !"

పుస్తకాల సంచితో గదిలోకి వెళ్ళిన హరిసర్వోత్తమరావు హెడ్‌మాస్టరును చూస్తూ, "నమస్కారమండి !" అన్నాడు.

"నమస్కారం ! కూర్చోండి. ఏం పని మీద వచ్చారు ?" హెడ్‌మాస్టర్ ప్రశ్నకి సమాధానంగా సంచిలోంచి కొన్ని పుస్తకాలను బయటకు తీసి హెడ్మాష్టరు ముందుంచుతూ, "వీటిని గవర్నమెంటు పాఠ్యపుస్తకాలుగా సిఫార్సు చేసింది. మీ స్కూలుకు కొనవలసిందిగా కోరుతున్నాను !"

తన ముందుంచిన పుస్తకాలను ఓ మారు ఎగాదిగా చూసి చెప్పుకొచ్చాడు హెడ్మాష్టరు.

"గవర్నమెంట్ సిఫార్సు చేసిన పుస్తకాలను పాఠ్యాంశాలుగా వుంచే అధికారం మాకున్నా, ప్రతి పుస్తకాన్ని ఆమోదించలేంగా ? క్రితం మాసమే కొందరి పుస్తకాలను పాఠ్యాంశాలుగా నిర్ణయించాం కాబట్టి మీ పుస్తకాలు మేము కొనుగోలు చేయలేం ! మీరిం కెక్కడైనా ప్రయత్నిం చండి !"

హెడ్‌మాస్టర్ మాటలకు నిస్పృహ చెంది "వస్తానండి !" అంటూ హెడ్మాస్టర్ అందించిన పుస్తకాలను తిరిగి సంచిలో వుంచుకొని బయటికి నడిచాడు.

అదే సమయంలో అక్కడికి చేరుకొన్న ఓ వ్యక్తి, స్కూలు ఆవరణ దాటి వెళుతోన్న హరిసర్వోత్తమరావు వంక చూస్తూ అనుకొన్నాడు.

"వెళుతోన్న వ్యక్తిని ఎక్కడో చూసినట్టుంది ! ... ఎవరై వుంటారు ?" తన అనుమానాన్ని నివృత్తి చేసుకోవటం కోసం పక్కనే వున్న అటెండరును అడిగాడు.

"వెళుతోన్న ఆ వ్యక్తి ఎవరు ?"

"ఏమో సార్ పేరు తెలియదు ! పుస్తకాలు అమ్ముకోవడానికి వచ్చినట్టున్నాడు. హెడ్మాస్టరు గారు పుస్తకాలు కొన్నట్టుగా లేరు. పాపం నిరాశగా వెళ్ళిపోతున్నారు !" అంటూ సమాధానమిచ్చాడు అటెండరు.

దగ్గరికి వెళ్ళి అతనెవరైందీ తెలుసుకోవాలన్న ఆరాటం కొద్ది "ఏమండీ ... ఓ మాట ... ఆగండి !" అంటూ వెళుతోన్న హరిసర్వోత్తమరావును ఉద్దేశించి గట్టిగా కేకేశాడు ! ఆ కేక విన్న హరిసర్వోత్తమరావు వెనుతిరిగి చూశాడు. ఆ వ్యక్తి వడివడి అడుగులతో హరిసర్వోత్తమరావు చెంతకు వెళ్ళాడు. తన చెంతకు చేరుకున్న ఆ వ్యక్తిని సులభంగానే గుర్తు పట్టి చిర్నవ్వుతో పలుకరించాడు హరిసర్వోత్తమరావు.

"బాగున్నావా ! నారాయణాచార్యులు."

"మీరా ... హరిసర్వోత్తమరావుగారా !"

అవునన్నట్టుగా తలాడించాడు హరిసర్వోత్తమరావు.

"మారిన మీ వేషధారణ చూసి వెంటనే గుర్తు పట్టలేకపోయాను. మీలాంటి గొప్ప వారిలా ..." అంటూ అర్ధోక్తిగా ఆగిపోయి హరిసర్వోత్తమరావు వంక పరిశీలనగా చూశాడు !

"తప్పేముంది నారాయణాచార్యులు ! మనిషి జీవనోపాధి కోసం ఏదో ఒకటి చేయాలిగా !" బరువున్న పుస్తకాల సంచిని నేలపై పెడుతూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

"తప్పని నేననటంలేదు ! ఆంధ్రదేశ తొలి రాజకీయ ఖైదీగా, జైలు శిక్షను అనుభవించటమే కాక, స్వరాజ్య ఉద్యమం కోసం, ఆంధ్రరాష్ట్ర ఉద్యమం కోసం అహర్నిశలు పాటుపడిన మీరు, గ్రంథాలయ ఉద్యమ నిర్మాతగా నిరంతరం ప్రజాసేవలో నిమగ్నులైన మీరు, అత్యున్నత పదవిని పొంది రాచబాటలో నడవవలసిన మీరు .... ఇలా పుస్తకాలు అమ్ముకొంటూ జీవించడం చూస్తూంటే, ఆంధ్రదేశానికి ఎంతటి దుర్గతి పట్టిందా అనిపిస్తుంది ! మీలాంటి త్యాగమయులను కనుమరుగు చేసి స్వార్థం బాటలో నడుస్తున్న నాయకులకు పట్టం కట్టిన ఈ ప్రజానీకాన్ని ... ఏమని అనాలో తెలియడంలేదు !" అంటూ ఆవేశంగా చెప్పుకపోతోన్న అతని వంక కుతూహలంగా చూస్తూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

"నారాయణాచార్యులు ! నీవు నా మీద వున్న అభిమానం కొద్దీ ఇలా మాట్లాడుతున్నావే కాని, నిజానికి నీ వనుకుంటున్నంత గొప్ప వ్యక్తినేం కాను ! ఇక అధికార పదవుల విషయం అంటావా ? అవి ప్రజాసేవకు దూరం చేస్తాయి. పదవులు పొంది ప్రజల నుంచి వేరుపడటం కన్న, వారితోనే కలిసి మెలసి, వారి కష్టసుఖాల్లో పాలు పంచుకోవడంలోనే నిజమైన ఆనందం, తృప్తి వున్నాయి !"

హరిసర్వోత్తమరావు మాటలకు విస్మయపడ్డ నారాయణాచార్యులు "మీ మనస్తత్వం అంతు చిక్కనిది !" అంటూ ఆశ్చర్యంగా చూశాడు.

"నువ్వన్నదీ నిజమే ! నా మనస్తత్వమేమిటో, ఒక్కో మారు నాకే అంతు పట్టదు !" అంటూ చిన్నగా నవ్వి అడిగాడు. "ఎలా వుంది నీ సాహితీ వ్యవసాయం ?"

"ఈ సాహితీ వ్యవసాయంలోనే బురద చల్లుకుంటూ జీవిస్తున్నాను !" నవ్వుతూ చలోక్తి విసిరాడు నారాయణాచార్యులు.

"నీవు ఛలోక్తిగా అన్నా, ఆ మాటలో ఎంతో అర్థముంది. నీవు మాత్రం సామాన్యుడివా ! సరస్వతీ పుత్రుడివి !"

ఇలా కొద్దిసేపు మాట్లాడుకున్నాక అడిగాడు నారాయణాచార్యులు !

"మీ దగ్గర వున్న పుస్తకాలను నే కొనుగోలు చేయవచ్చా !"

"అమ్మకానికేగా, వూరు పట్టుక తిరుగుతున్నది !" అంటూ సంచిలో నుంచి 'శ్రీరామ చరిత్రము', 'పౌరశిక్షణ' పుస్తకాలు తీసి నారాయణాచార్యుల చేతికందించాడు హరిసర్వోత్తమరావు. పుస్తకాలను చేతికి తీసుకుంటుండగా స్ఫురణకి వచ్చింది !

'అనుదిన జీవిత మతి ప్రయత్నము మీద గడుపవలసిన స్థితి నాకు చాలాకాలంగా తప్పినది కాదు !' కట్టమంచి రామలింగారెడ్డి 'ముసలమ్మ మరణము'నకు వ్రాసిన పీఠికలో హరిసర్వోత్తమరావు వెలిబుచ్చిన అభిప్రాయము అక్షరాలా నిజమనుటకు నిదర్శనమిదే కాబోలు! అని మనసులో అనుకుంటూ ఆ పుస్తకాల వెలను చెల్లించాడు.

ఆ వెలను అందుకుంటూ హరిసర్వోత్తమరావు కూడా మనసులో ఇలా అనుకున్నాడు.

"నా ఆర్థిక పరిస్థితి గమనించే పుస్తకాలను కొనుగోలు చేస్తున్నాడు !"

ఇలా ఎవరికి వారు మనసులో అనుకొన్నాక హరిసర్వోత్తమరావు నారాయణాచార్యుల భుజం తడుతూ, "నేవెళ్ళొస్తాను నారాయణాచార్యులు ! ఇంకా తిరగవలసిన వూర్లు చాలా వున్నాయి !"

"స్టేషన్ దాకా మీకు తోడుగా వస్తాను !"

"అలాగే !"

"మీ పుస్తకాల సంచి ఒకటిలా ఇవ్వండి !" వాటిని తీసుకునే ప్రయత్నం చేస్తూ అన్నాడు నారాయణాచార్యులు.

"క్షమించు నారాయణచార్యులు ! నా భారం ఒకరిపై మోపేందుకు నా మనసంగీకరించదు. నా భారం నా తోటే ... పద వెళ్దాం !" అంటూ పుస్తకాల సంచిని అందుకొని వడివడిగా ముందుకు నడక సాగిస్తున్న హరిసర్వోత్తమరావును మౌనంగా అనుసరించాడు పుట్టపర్తి నారాయణాచార్యులు !

* * *

# 24

మదరాసు సెంట్రల్ !

పెద్దగా కూత పెట్టుకుంటూ సెంట్రల్ స్టేషన్‌లో రైలు ఆగింది !

పుస్తకాల సంచిని మోసుకొని కంపార్టుమెంటు లోంచి దిగి, ప్లాట్‌ఫారం మీద అడుగుపెట్టే సరికి ఒకింత నీరసం వచ్చింది హరిసర్వోత్తమరావుకు ! ఓ అయిదు నిమిషాలు విశ్రాంతి తీసుకొని, తిరిగి తన లగేజిని భుజానికి కెత్తుకొని సెంట్రల్ వెలుపలికి రాగానే,

'రండయ్య గారూ !' అన్న పిలుపు విన్పించే సరికి తలెత్తి చూశాడు హరిసర్వోత్తమరావు.

ఎదురుగా రిక్షావాలా ! షణ్ముగం !

చాలా ఏళ్ళుగా అతని రిక్షాలో వెళ్ళటం తన కలవాటైంది ! ఆ చనువుతోనే షణ్ముగం తన భుజం మీది లగేజీని అందుకుని రిక్షాలో పెట్టాడు !

హరిసర్వోత్తమరావు రిక్షా ఎక్కి కూర్చున్నాడు ! రిక్షా మెల్లిగా ముందుకు కదిలింది. షణ్ముగం శారీరక పరిస్థితిని గమనించిన హరిసర్వోత్తమరావులో ఆలోచనలు ! గత ఇరవై ఏళ్ళుగా షణ్ముగాన్ని చూస్తున్నాడు. అప్పుడు వయస్సులో వుండేవాడు కాబట్టి రిక్షా వేగంగా లాగేవాడు ! వయసొచ్చింది. ముసలివాడయ్యాడు. రిక్షా లాగలేక ఆయాసపడిపోతున్నాడు.

వృద్ధాప్యం మనిషిని  ఎంత కృంగదీస్తుంది ? అనుకున్నాడు మనస్సులో !

నిజంగా తన పరిస్థితి కూడా అంతే అయ్యింది !

స్టేషన్‌లోంచి లగేజీ బయటకు మోసుకొని వచ్చేటప్పటికి ఒళ్ళంతా అదోలా అయింది !

రిక్షా ఆగడంతో ఆలోచనలు పక్కకు నెట్టి షణ్ముగం వేపు చూశాడు ! ఆయాసంతో రొప్పుతూ అన్నాడు ! "అయ్యాగారూ ! ఒక్క నిముషం ఆగి మళ్ళీ రిక్షా లాగుతాను !"

ఆ మాటలంటున్నపుడు హరిసర్వోత్తమరావు హృదయం జాలితో తల్లడిల్లిపోయింది. సరిగ్గా తన పరిస్థితే షణ్ముగానికి కలిగింది. వయసు మీద బడుతోంది ! ఇక రిక్షా ఎలా లాగగలడు ? అనుకుంటూ రిక్షాలోంచి దిగాడు. "దరిద్ర్యం మనిషిని ఎంత కృంగదీస్తుంది ! ఎంతో మంది దేశంలో దారిద్ర్యరేఖకి దిగువన వున్నారు. దారిద్ర్యాన్ని రూపుమాపే కార్యక్రమాల్ని ప్రభుత్వం సత్వరం చేపట్టేలా చూడాలి. అందుకోసం పోరాటం జరగాలి !"

ఇలా ఆలోచిస్తున్న హరిసర్వోత్తమరావుకు "అయ్యగారు ఇక రిక్షా ఎక్కండి ! మళ్ళీ సత్తువ వచ్చేసింది." అన్న పిలుపుతో ఈ లోకంలోకి వచ్చాడు.

రిక్షాపై పయనించడం కూడా తప్పేనేమో ? ఒకరికి సుఖం – మరొకరి శ్రమ ! కొందరు భోగలాల సత్వంతో మునిగి తేలుతొంటే మరికొందరు కష్టాల కడలిలో కూరుకుపోతున్నారు. ఇక ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చేదెప్పుడు ?

"షణ్ముగం – నువ్వెళ్ళు – నేను నడుచుకుంటూ వెళ్తాను" అన్న హరిసర్వోత్తమరావు మాటకి షణ్ముగం దైన్యంగా అన్నాడు.

"అయ్యా ! మీదే బోణి నా జీవనానికి ఇదే ఆధారం !"

"ఫరవాలేదు. నీ శ్రమకు ప్రతిఫలం తీసుకో !" అంటూ రిక్షా కిరాయి యిచ్చి లగేజీని భుజాన వేసుకొని తిన్నగా అడుగులు వేస్తూ ఇంటి వేపు నడక సాగించిన హరిసర్వోత్తమరావుకు ఇల్లు చేరేసరికి కళ్ళు బైర్లుకమ్మినట్లయ్యాయి.

అడుగులు తడబడ్డాయి ! అయినా పంటి బిగువున గుమ్మం మెట్టెక్కబోయిన హరిసర్వోత్తమరావుకు పట్టు తప్పి మెట్లపైనే బోర్లా పడ్డాడు.

"అమ్మడూ !' అంటూ బాధగా కూతురు సాయం కోసం అరిచాడు.

తండ్రి పిలుపు విన్న ద్వారకాబాయి వంటగదిలోంచి పరుగెత్తుకొంటూ వచ్చి తండ్రి మెట్లపై పడుండటం చూసి గాబరాగా 'నాన్నా' అంటూ తన చేతిని ఆసరాగా ఇచ్చి, లోపలికి తీసుకెళ్ళి మంచంపై పడుకోబెట్టి, 'దెబ్బలేమైనా తగిలాయా' అంటూ శరీరమంతా తడిమింది ద్వారకాబాయి.

"లేదు !" మెల్లిగా జవాబిచ్చాడు హరిసర్వోత్తమరావు.

"నడుస్తూ వచ్చారా నాన్నగారూ !"

'ఔ' నన్నట్టుగా తల ఆడించాడు హరిసర్వోత్తమరావు.

"రిక్షా"లో రాకూడదా !"

"వద్దామనే అనుకున్నానమ్మా !" అంటూ జరిగింది చెప్పాడు హరిసర్వోత్తమరావు.

"ఏమిటో నాన్నా ! మీకు రాను రాను చాదస్త మెక్కువవుతోంది ! ఈ వయసులో ప్రయాణం చేస్తే మీ ఆరోగ్యం ఏమౌతుందో ఒక్కసారైనా ఆలోచించారా ! మేమేం చెప్పినా విన్పించుకోరు.! మీ ఆరోగ్యం దృష్ట్యా, ఇకనైనా ప్రయాణాలు మానండి నాన్నా !"

కూతురు వేడుకోలుకు హరిసర్వోత్తమరావు చిన్నగా నవ్వుతూ "మనిషి జీవితం ఓ పడవ ప్రయాణం లాంటిది ! కొన వూపిరి వున్నంత వరకు ప్రయాణించక తప్పదు. కాసిన్ని మంచినీళ్ళివ్వమ్మా !" అంటూ అడిగాడు. తనకు మంచినీళ్ళందించి వెళ్తున్న ద్వారకాబాయి వంక చూసి, "వేడిగా చారు తయారు చేయమ్మా ! నీవు చేసే చారు చాలా రుచిగా వుంటుంది !"

"ఆ ... వుంటుంది ... ఎందుకుండదు ?" అంటూ వుక్రోషంగా వెళ్ళిపోతున్న ద్వారకాబాయి వంక మందహాసంగా చూస్తుండిపోయిన హరిసర్వోత్తమరావు చుట్టూ చేరారు పిల్లలు.

"ఎప్పుడొచ్చావు తాతయ్యా ?" అంటూ !

"తాతయ్యా ... తాతయ్యా నాకేం తెచ్చావు ?" అంటూ అందరిలో చిన్నదైన చిట్టి మనుమరాలు వొళ్ళోకి ఎక్కి కూర్చుంది.

"నీకెందుకు తేనమ్మా. నా చిట్టి తల్లివి కదూ ! ఇదుగో చాక్లెట్లు బోలెడు. అన్నీ నీకే !" అంటూ పక్కన వుంచుకున్న సంచిలోంచి పార్సల్ పొట్లాన్ని బయటికి తీసి ఇచ్చాడు.

"అన్నీ చిట్టికే అయితే మరి మాకూ !" అంటూ చిట్టి చేతిలోని పొట్లాన్ని లాక్కోబోయారు శ్రీరాం, లక్ష్మణ్, మోహన్ !

"ఒరే ... ఆ చిట్టి పొట్లాన్నెందుకు లాక్కుంటార్రా ! ఇదుగో మీకు తెచ్చాను. ఇంద తీసుకోండి !"

అలా, తాతయ్య చుట్టూ చేరి అల్లరి చేస్తున్న పిల్లల్ని వారిస్తూ అంది ద్వారకాబాయి.

"లే నాన్నా భోజనం చేద్దువు గాని !"

కూతురు పిలుపుతో లేచి స్నానం చేసి వచ్చి భోజనానికి కూర్చుని తృప్తిగా తిని

"అమ్మదూ ! ఓ గ్లాసుతో చారు పట్రామ్మా !"

కూతురు అందించిన గ్లాసెడు చారు గటగట త్రాగి, కూతురు అమర్చిన పక్కపై మేను వాల్చాడు హరిసర్వోత్తమరావు.

ఓ అరగంట అలా పడుకున్నాడో లేదో, లేచి చూచేసరికి, తన ప్రయాణంలో మాసిన గుడ్డల్ని వుతుకుతున్న కూతురితో అన్నాడు హరిసర్వోత్తమరావు.

"ఏమిటమ్మా ఆ పని ?"

"వుతికితే తప్పా నాన్నా !"

"నీకు తెలుసుగా నా గుడ్డలు నేనే వుతుక్కుంటానని !"

"మీరు ప్రయాణపు బడలికలో వున్నారనీ ..."

"అది కాదమ్మా నా బాధ. నేను వృద్ధుడనై నీకు పని కల్పిస్తున్నానని ! అంతే ... ఏ పని లేకపోతే మనిషికి సోమరితనం వస్తుంది !"

"సుఖపెడదామన్నా సుఖపడవు ! నీ పనులు చేస్తే ఒప్పుకోవు. నీతో ఎలా నాన్నా ?" అంటున్న ద్వారకాబాయిని చూసి చిరుమందహాసంతో పలికాడు.

"ఇంకా ఈ జీవిని సుఖపెట్టాలని చూస్తున్నావా అమ్మా !"

* * *

ఆంధ్రప్రదేశ్ ఏర్పడటంతో మదరాసుతో సంబంధం లేకుండాపోయింది !

తనకి చేదోడు వాదోడుగా వున్న దక్షిణ భారత వయోజన విద్యా సంఘ కార్యదర్శి టి.జె.ఆర్. గోపాల్ అకాల మరణానికి గురికావడంతో ఆ సంఘ కార్యక్రమాలు ఆగిపోయాయి!

అందుచేత ఏ పనిలేకుండా మదరాసులో కాలక్షేపం చేయడం కష్టంగా అగుపించి స్వరాష్ట్రానికి చేరుకోవాలన్న కోరిక బలంగా నాటుకుంది హరిసర్వోత్తమరావులో !

ఆ విషయమే విజయవాడలో వున్న నాగభూషణానికి తెలియ జేసి ఉత్తరం కోసం నిరీక్షించసాగాడు !

*　　　　*　　　　*

విజయవాడ !

పటమటలంక !!

'శ్రీ సర్వోత్తమ భవన్' కార్యాలయంలో కూర్చుని సర్వోత్తమరావు గురించే ఆలోచిస్తున్న పాతూరి నాగభూషణం, "పిలిచారట !" అంటూ తన గదిలోకి వచ్చిన గ్రంథాలయ కార్య నిర్వాహక సభ్యుడైన పేరిచర్ల పున్నయ్యశాస్త్రిని చూసి "కూర్చోండి !" అంటూ తన కెదురుగా వున్న కుర్చీని చూపించాడు.

పున్నయ్యశాస్త్రి ఆశీనుడయ్యాక తను పిలిచిన కారణం గురించి చెప్పటం ప్రారంభించాడు నాగభూషణం !

"హరిసర్వోత్తమరావుగారికి మద్రాసు వీడి ఆంధ్రదేశంలో వుండాలన్నది కోరిక ! ఆ కోరికకు అనుగుణంగా క్రితం వారం మనం వారి నివాసం గురించి చర్చించుకొన్నాము. అప్పుడు మీరు చెప్పిన విధంగా పేరిచర్లలో కాక, ఇక్కడే 'సర్వోత్తమ భవన్'లోనే నివాసం ఏర్పాటు చేస్తే బాగుంటుంది అనిపిస్తుంది. ఎందుకంటే పేరిచర్ల నుంచి వారి విజయవాడ రాకపోకలకు ఇబ్బందిగా వుంటుంది. ఇక్కడే వసతి ఏర్పాటు చేస్తే బాగుంటుందని నా ఉద్దేశ్యం. మరి మీ అభిప్రాయం ?"

"మీరన్నది ఆలోచించాక నాకు నిజమే అనిపిస్తోంది. మీ నిర్ణయం ప్రకారం ఇక్కడే వారికి వసతి ఏర్పాట్లు చేయండి ! అందుకు నా వంతు బాధ్యతగా తగిన సహాయ సహకారాలు అందిస్తాను."

పున్నయ్యశాస్త్రి అలా అంటుండగానే, గ్రంథాలయ భవనానికి సంబంధించిన ఆఫీసు బాయ్ ఓ ఉత్తరం తెచ్చి నాగభూషణం చేతికందించి వెళ్ళిపోయాడు.

"చదవండి !" ఆసక్తిగా అడిగాడు పున్నయ్యశాస్త్రి. ఉత్తరం చదవడం ప్రారంభించాడు నాగభూషణం !

పుత్ర సమానుడైన నాగభూషణంకు

ఆశీస్సులు !

నేనొక కార్యక్రమాన్ని తలపెట్టాను. వయోజన విద్యావ్యాప్తిలో భాగంగా ఆంధ్రప్రదేశ్‌లోని 20 జిల్లాల్లోను, 40 వారాల పాటు తిరిగే ఏర్పాటు చేద్దాం ! హైదరాబాదు, సికిందరాబాద్

నగరాలను రెండు జిల్లాలుగా పరిగణించి ప్రత్యేక కార్యక్రమం ఏర్పాటు చేద్దాం ! రోజుకొక గ్రామం చొప్పున ఒక్కొక్క జిల్లాలో పదనాలుగు స్థలాలను సందర్శించుదాం ! ఈ కార్యక్రమంలో గ్రామ సీమలకు సంబంధించిన ప్రధాన విషయాలన్నింటి గురించి ప్రచారం చేద్దాం ! కొన వూపిరి వున్నంత వరకు వయోజనుల సేవ చేయాలని నిర్ణయించుకొన్నాను.

నాగభూషణం ! నాకు దేహ పటుత్వం తగ్గింది. రైళ్ళలో ప్రయాణం చేయడం కూడా కష్టమనిపిస్తోంది. ఏదైనా ఒక పాతకారుంటే చూడు ! ఈ కార్యక్రమాన్ని కొనసాగిద్దాం !

ఈ ఉత్తరం అందిన వెంటనే నీవు మద్రాసు వచ్చేది ! ఇద్దరం కలిసి ఈ కార్యక్రమానికి సంబంధించిన ప్రణాళికను చర్చించుకొందాం !

నీ రాక కోసం ఎదురు చూస్తూ వుంటాను !

ఇట్లు

హరిసర్వోత్తమరావు

ఉత్తరం చదవటం పూర్తవగానే పున్నయ్యశాస్త్రి వంక చూస్తూ చెప్పాడు నాగభూషణం.

"హరిసర్వోత్తమరావు తలపెట్టిన ఈ బృహత్ కార్యక్రమానికి నీ వంతు సహాయ సహకారాలు కూడా అందించాలి !"

"అంతకన్న మహద్భాగ్యమేముంది !"

# 25

ప్రియమైన బాబు గారికి !

నాగభూషణం నమస్కరించి వ్రాసుకున్న ఉత్తరం. క్షేమం ! మీరు క్షేమమని తలుస్తాను. మీ ఉత్తరం అంది అన్ని విషయములు తెలిసినవి. చాలా సంతోషం ! మీ కోరిక ప్రకారం తప్పకుండా మద్రాసు రాగలవాడను. ఈ కార్యక్రమంలో పున్నయ్యశాస్త్రి గారు కూడా తమ వంతు సహకారం అందిస్తామన్నారు.

ఇక ఒక ముఖ్య విషయం ! మీరు కోరిన ప్రకారంగానే ఇక్కడే 'సర్వోత్తమ భవన్'లోనే మీ నివాసానికి తగిన యేర్పాట్లు చేయడానికి నిశ్చయించుకున్నాను. పున్నయ్యశాస్త్రి గారు కూడా అంగీకరించారు. చెల్లెమ్మ ద్వారకాబాయి, బావగారైన పార్థసారథిని అడిగినట్లు తెల్పకోరుచున్నాను.

ఓ అయిదారు రోజుల్లో మద్రాసు రాగలను !

ఇట్లు

నాగభూషణం.

ఉత్తరం చదువుకున్న హరిసర్వోత్తమరావులో ఎక్కళ్ళేని ఆనందం పుట్టుకొచ్చింది ! ఆ ఆనందంలో ఉక్కిరిబిక్కిరి అవుతున్న తండ్రిని చూసి అడిగింది ద్వారకాబాయి !

"ఎక్కణ్ణుంచి నాన్నా ఆ ఉత్తరం ?"

"నాగభూషణం నుంచమ్మా ! ఓ అయిదారు రోజులలో యిక్కడకు వస్తున్నట్లు వ్రాశాడు !"

"అయితే కొన్నాళ్ళపాటు నీకు మంచి తోడు !"

"అవునమ్మా ! నాగభూషణం రాక కోసమే ఎదురు చూస్తున్నాను, అతను వచ్చే లోపుగా నేను కార్యక్రమాన్ని రెడీ చేసి పెట్టాలి !"

"అసలే నీ ఆరోగ్యం సరిగాలేదు ! మళ్ళీ ఈ పని ఎందుకు ? ఆయనతో నాలుగు రోజులు సరదాగా గడపరాదా నాన్నా !"

"సరదాగా గడుపవలసిన సమయం కాదమ్మా ఇది. నిరక్షరాస్యత నిండుకున్న మనదేశంలో అక్షరాస్యత కోసం ఎంత పాటుబడినా చాలదు ! అందరూ అక్షరాస్యులైన నాడే దేశం పురోగతి చెందుతుంది. అంతవరకు ఈ ఉద్యమం కొనసాగించవలసిందేనమ్మా !"

"ఇంతగా పాటుబడుతున్న నీకు ఈ దేశం, రాష్ట్రం ఏమిచ్చింది నాన్నా ?"

"ఈ దేశం, రాష్ట్రం ఏమిచ్చిందన్నది కాదమ్మా ప్రశ్న ! మన దేశానికి, మన రాష్ట్రానికి మనమేం సేవ చేశాం అని మాత్రమే ఆలోచించాలి !"

ఆ మాటలు వెలువడినప్పుడు ద్వారకాబాయికి హరిసర్వోత్తమరావు తండ్రి లాగా గోచరించలేదు. తనకు కర్తవ్యాన్ని బోధిస్తున్న గురువులా అగుపించాడు ! మౌనంగా తలవంచుకొని తండ్రి దగ్గర నుంచి నిష్క్రమించింది ద్వారకాబాయి !

* * *

అనారోగ్య దృష్ట్యా, కూతురు, అల్లుడు వారిస్తున్నా, ఏ మాత్రం లక్ష్యపెట్టక వయోజన విద్యకు సంబంధించి 40 వారాల పాటు తిరుగదల్చుకున్న బృహత్తర కార్యక్రమాన్ని తన డైరీలో తారీఖుల వారీగా వ్రాసుకోవటం ప్రారంభించిన సర్వోత్తమరావుకు, అది పూర్తి చేసే సరికి అర్ధరాత్రి దాటింది ! మస్తిష్కపు మదన ఎక్కువ అయ్యేసరికి ఒంట్లో నిస్సత్తువ ఆవహించింది! కాస్సేపు అలాగే కూర్చున్న కుర్చీలోనే వుండిపోయాడు హరిసర్వోత్తమరావు.

నిస్సత్తువ తగ్గినట్లనిపించాక మెల్లిగా కూర్చున్న కుర్చీలోంచి లేచి లఘు శంక తీర్చుకోడానికి, చేతి కర్ర సహాయంతో బాత్ రూపంలోకి వెళ్ళిన హరిసర్వోత్తమరావుకు మళ్ళీ కళ్ళు బైర్లు కమ్మినట్లయి ముందుకు తూలి పడ్డాడు. చేతి కర్ర జారి దూరంగా పడింది. తల విసురుగా వెళ్ళి గోడకు గుద్దుకోవటంతో బొప్పి కట్టింది !

"అమ్మా !" అంటూ బాధతో గట్టిగా అరిచాడు హరిసర్వోత్తమరావు. అతికష్టంతో గోడకు వీపును ఆనించి అలాగే కూర్చుండిపోయాడు.

చాలా పొద్దు పోయే వరకు తండ్రి అనారోగ్య విషయం గురించి భర్తతో మాట్లాడిన ద్వారకాబాయి మెల్లిగా నిదురలోకి జారుకుంది.

నిద్రపట్టని పార్థసారధికి బాత్‌రూంలోంచి అరుపు వినిపించేసరికి ఆదుర్దాగా బాత్‌రూం దగ్గరికి పరుగెత్తుకెళ్ళాడు. బాత్‌రూంలో తన మామయ్యకు ఏర్పడిన పరిస్థితిని చూసిన పార్థసారధి కళ్ళలో నీళ్ళు తిరిగాయి !

"మమ్మల్ని పిలవకపోయారా మామయ్యా ?" అంటూ హరిసర్వోత్తమరావును లేపి అతని గదిలోకి తీసుకెళ్ళి పడుకోబెట్టి,

"ఉదయాన్నే డాక్టరు గారి దగ్గరకెళ్దాం !" అన్నాడు.

"అలాగే !" అన్నట్టుగా తల ఆడించాడు హరిసర్వోత్తమరావు. తెల్లవారింది !

హరిసర్వోత్తమరావును డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళే ప్రయత్నాలు జరుగుతుండగా ప్రత్యక్షమయ్యాడు నాగభూషణం !

అతన్ని చూడగానే హరిసర్వోత్తమరావుకు ప్రాణం లేచి వచ్చినట్లయింది !

"ఇదే నా రాక !" డగ్గుత్తిక స్వరంతో అడిగాడు హరిసర్వోత్తమరావు.

'ఔ' నన్నట్టుగా తలాడించి జరుగుతున్న యేర్పాట్లను అనుమానంగా చూస్తూ అడిగాడు నాగభూషణం !

"ఏమైందమ్మా ! నాన్నగార్ని ఎక్కడికి తీసుకెళ్తున్నారు ?"

రాత్రి జరిగిన సంఘటన గురించి వివరంగా చెప్పింది ద్వారకాబాయి !

జరిగిన విషయాన్ని తెలుసుకొన్న నాగభూషణం ఏదో చెప్పబోతుండగా, అడ్డుకొని అన్నాడు హరిసర్వోత్తమరావు !

"వంట్లో కాస్త నీరసంగా వుంది. దీనికే బెంబేలెత్తిపోతున్నారు నాగభూషణం. ఇక నువ్వొచ్చావు ! ఆ నీరసం కూడా ఎగిరిపోయింది. ఇక అనవసరంగా డాక్టరు దగ్గరి కెందుకు? మనం గదిలోకి వెళ్ళి ప్రోగ్రాం విషయం మాట్లాడుకుందాం !"

హరిసర్వోత్తమరావు మాటలు విన్న నాగభూషాణానికి ఏం చెప్పాలో పాలుపోలేదు. శక్తి లేకున్నను పని పట్ల వారికి గల ఆసక్తి చూసి జాలివేసింది !

"అన్నయ్యా ! ఓ మారు ఇలా వస్తారా !"

ద్వారకాబాయి పిలుపు విని ఆమె వెంట పక్క గదిలోకి చేరి అన్నాడు నాగభూషణం.

"ఏం చెల్లెమ్మా ! పిలిచావు !"

"విన్నావుగా అన్నయ్యా నాన్నగారి మాటలు ! ఆరోగ్యం మెరుగైం తర్వాత ఎంత పనైనా చెయ్యొచ్చుగా ? ప్రస్తుతానికి ఆ ప్రోగ్రాం మానుకునేలా చేసే భారం నీపై వుంచుతున్నాను. ఎలా చేస్తావో నాకు తెలియదు. డాక్టర్ గారి దగ్గరకు తీసుకెళ్ళకపోతే నాన్నగారి ప్రాణాలు దక్కవు !" అంటూ కన్నీళ్ళ పర్యంతం అయింది ద్వారకాబాయి !

అలా కన్నీళ్ళ పర్యంతమైన ద్వారకాబాయిని ఓదారుస్తూ అన్నాడు నాగభూషణం !

"చెట్టంత అన్నయ్యను నేనుండగా భయమెందుకమ్మా ?"

"నాగభూషణం ఇలా రావయ్యా ! త్వరగా కార్యక్రమం రూపొందించుకుంటే గాని నాకు మనశ్శాంతి వుండదు ?"

హరిసర్వోత్తమరావు పిలుపుకు లోపలి గదిలోంచి వచ్చి మౌనంగా తలవొంచుకొని నిల్చున్నాడు నాగభూషణం !

"ఇంట్లో అందరూ ఏకమైనారన్న మాట !" నిష్ఠూరపు పలుకులు పలికాడు నాగభూషణాన్ని చూస్తూ హరిసర్వోత్తమరావు.

"అదికాదు బాబూ !"

"ఏది కాదు ?"

"ఆ పనికి ఇప్పుడేమంత తొందర వచ్చింది బాబూ !" గుండెలో గుబులుగానే వున్నా పైకి ధైర్యంగానే జవాబిచ్చాడు నాగభూషణం."

"అయితే నన్ను ఏ పని చేయవద్దంటారా ? ఇలాగే మంచంలో పడి చావమంటారా ? పనిలోనే నా ప్రాణం పోనీ !" అంటూ కటువుగానే పలికాడు హరిసర్వోత్తమరావు.

హరిసర్వోత్తమరావు ధోరణి, కూతుర్ని, అల్లుడ్ని దుఃఖంలో ముంచివేసింది !

నాగభూషణం మాత్రం నెమ్మదిగానే చెప్పాడు !

"ముందు డాక్టరు దగ్గరి కెళ్ళొచ్చాక, ఆ విషయాన్ని గూర్చి మాట్లాడుకుందాం. పదండి. నేను కూడా వస్తాను !"

నాగభూషణం చెప్పింది విన్న హరిసర్వోత్తమరావుకు, ఇక వెళ్ళక తప్పదని నిర్ణయించుకొని పక్కనే వున్న చేతి కర్ర అందుకొని,

"సరే ! అలాగే వెళ్దాం, పదండి ! మీ గాబరా అయినా కాస్త తగ్గినట్లుంటుంది !"

హరిసర్వోత్తమరావుకు అన్ని పరీక్షలు జరిగాక ఒక నిర్ధారణకు వచ్చి చెప్పాడు రాయపేట హాస్పిటల్ డాక్టర్ !

"రక్తపోటు, మధుమేహం చాలా తీవ్రస్థాయిలో వుంది. ఈ మందులు వాడండి. అప్పటికీ తగ్గకపోతే హాస్పిటల్‌లో చేర్పించవలసివుంటుంది."

"అలాగే !" అంటూ తల వూపాడు పార్థసారథి !

*　　　　*　　　　*

తమిళనాడులోని గాంధీ గ్రామ్ నందు జరుపబడిన ఎ.ఐ.సి.సి. కో ఆపరేటివ్ ఆర్గనైజర్స్ ట్రెయినింగ్ క్యాంపుకు వెళ్ళిన కోడి నరసింహం, క్యాంపు పూర్తి చేసుకొని తిరుగు ప్రయాణానికి సిద్ధమవుతుండగా స్ఫురణకి వచ్చింది !

'ఇంత దూరం వచ్చి మాస్టారును చూడకుండా వెళితే ఎలా ?' అనుకున్న వెంటనే వెళ్ళాలని తీర్మానించుకొని మద్రాసుకు వెళ్ళే బస్సులో ఎక్కి కూర్చున్నాడు.

కాస్సేపట్లో బస్సు బయల్దేరింది ముందుకు !

నరసింహం ఆలోచనలు మళ్ళాయి వెనుకకు !!

1929 !

నంద్యాల !

మహాత్మగాంధీ ఆంధ్ర జిల్లాల పర్యటన సందర్భంగా నంద్యాలకు వస్తున్నారన్న వార్త ఆబాలగోపాలంలో సంచలన సృష్టించింది !

గాంధీజీని చూడాలన్న తహతహ అందరిలోనూ ! ఆ తహతహ విద్యార్థిగా వున్న నరసింహంలో కూడా ఉధృతమయ్యింది !

ఆ సాయంత్రమే గాంధీజీ నంద్యాలకు వచ్చారు ! ఆయన వెంట ఆజానుబాహుడైన మరోవ్యక్తి వుండటం నరసింహం దృష్టిని ఆకర్షించింది !

'ఆ వ్యక్తి ఎవరై వుంటారు ? గాంధీజీకి అంత సన్నిహితంగా మెలిగే అదృష్టం ఎలా కలిగింది ?'

నరసింహం చిన్న బుర్రలో తట్టిన ఆలోచన అది ! ఆరా తీస్తే తెలిన విషయం గాడిచర్ల హరిసర్వోత్తమరావని ! ఆ రాత్రికి మహాత్ముడు విశ్రాంతి తీసుకున్నాడు నంద్యాలలో ! మరునాడు ఉదయం గొప్ప బహిరంగసభ !

వేలాది జనం !

అంతజనంలోను స్వరాజ్యకాంక్ష !!

గాంధీజీ ఖాదీ ఉద్యమం గురించి గొప్పగా ఉపన్యాసం చేయడం – ఆ ఉపన్యాసాన్ని హరిసర్వోత్తమరావు ఆంధ్రీకరించడం, వాలంటీరుగా పాల్గొన్న నరసింహంలో కొద్దిపాటు ఉత్తేజం! ... అలజడి !

సాంఘిక సేవా దృక్పథం మీదకి దృష్టి మరలిన నరసింహంలో ఆరాటం ! ఎలాగైనా హరిసర్వోత్తమరావును కలుసుకోవాలని ! ఆ ఆరాటం 1931 సంవత్సరంలో నెరవేరంది !

నంద్యాలలో రాయలసీమ హిందుస్థానీ సేవాదళ శిబిరమునకు గాడిచర్ల హరిసర్వోత్తమరావు ప్రిన్సిపాల్. సేవాదృక్పథం అలవడ్డ నరసింహం ఆ శిబిరంలో వాలంటీరుగా చేరాలని ఉవ్విళ్ళూరాడు ! వెంటనే ప్రిన్సిపాల్ హరిసర్వోత్తమరావును కలిసి తన ఆశయము వెల్లడించు కొన్నాడు.

నరసింహం ఆశయం విన్న హరిసర్వోత్తమరావు 'వెల్ ! మైడియర్ బాయ్ !" అంటూ శిక్షణ పొందుటకు అనుమతి ఇచ్చాడు.

ఆ తర్వాత కొంతకాలమునకు నరసింహం దృక్పథంలో మార్పు వచ్చింది. తీవ్రవాదులగు కొందరి మిత్రుల పరిచయం కలిగింది ! ఆ సమయంలోనే స్వామి నారాయణానంద సరస్వతి (పింగళి లక్ష్మీనారాయణ) కర్నూలు జిల్లాకు వచ్చి హరిసర్వోత్తమరావుకు వ్యతిరేకంగా విమర్శలు చేయటం ప్రారంభించాడు.

నరసింహం ఆయనతో చేరి హరిసర్వోత్తమరావుపై విమర్శ చేయటానికి కంకణం కట్టుకొన్నాడు, ఆయన భావములన్ని మితవాదమని !

ఈ మధ్యకాలంలోనే నరసింహానికి 'సోప్ టెక్నాలజీ' చదువుకోవాలన్న కోరిక కలిగి క్యాలికట్‌కు ప్రయాణ సన్నాహము చేసుకొని, బయలుదేరి, కొందరు మిత్రులను కలుసుకోవాలన్న వుబలాటం కొద్ది మద్రాసులో ఆగాడు !

సెంట్రల్ స్టేషన్‌లోంచి వెలుపలికి వస్తుండగా "హలో !" అన్న పలకరింపు విన్పించి వెను తిరిగి చూశాడు నరసింహం !

ఎదురుగా హరిసర్వోత్తమరావు !

సంభ్రమాశ్చర్యాలు ముడివడ "మీరా !" తడబడతూ అన్నాడు నరసింహం.

"అవున్నేనే !" ఎందుకలా ఆశ్చర్యపోతున్నావు ?"

నరసింహానికి నోట మాట పెగలిరాలేదు ! ఆశ్చర్యంలోంచి తేరుకుంటుండగా అన్నాడు హరిసర్వోత్తమరావు !

"మైడియర్ స్టూడెంట్ ! సోప్ టెక్నాలజీలో శిక్షణకు బయలుదేరుతున్న నీకు ఇవే నా అభినందనలు !"

అప్రయత్నంగా "మాస్టారూ !" అంటూ హరిసర్వోత్తమరావు పాదాలను తాకాడు నరసింహం!

"ఇదేం పని నరసింహం ! నీవు కూడా ... " అంటూ లేవనెత్తాడు హరిసర్వోత్తమరావు.

"మాస్టారూ ! మిడిమిడి జ్ఞానంతో మీ వంటి మేధావిని విమర్శించినందులకు నేను ఇప్పుడు సిగ్గుపడుతున్నాను ! అయినా మీరు ఆ విషయమే పట్టించుకోకుండా నా యందు మీరు కనబరుస్తున్న అభిమానం నా జీవితంలో మరువలేను. నా మీద కోపం లేదని ఒక్కమాట చెప్పండి మాష్టారు !' అంటూ ఆయన చేతులు పట్టుకున్నాడు.

"కోపం వుంటే కదా చెప్పడానికి ! నా కెవరి మీద కోపం వుండదు !" చిన్నగా నవ్వుతూ,

"ఎన్ని గంటలకు నీ ప్రయాణం ?" అడిగాడు హరిసర్వోత్తమరావు.

"రాత్రి 8 గంటలకు మాంగుళూరు మెయిలుకు బయలుదేరుతాను మాస్టారు."

"ఓ.కే !" అంటూ అక్కడ నుంచి కదిలివెళుతున్న హరిసర్వోత్తమరావును అలాగే చూస్తుండి పోయాడు స్టేషన్‌లో నరసింహం !

అలా చూస్తుండిపోయిన నరసింహనికి, మిత్రులను కూడా కల్సుకోవాలన్న ఉత్సాహం కూడా నశించింది ! అయినా తప్పదు కాబట్టి సాయంత్రం వరకు తోటి మిత్రులను కల్సుకొని, వారు తోడు రాగా రాత్రి 7.45 గంటలకు సెంట్రల్ స్టేషన్ చేరుకున్నాడు.

స్టేషన్‌లో మంగుళూరు మెయిల్ సిద్ధంగా వుంది ! ప్లాట్‌ఫారం మీద మిత్రులతో సరదాగా మాట్లాడుతున్న సమయంలో మెయిల్ బయలుదేరడానికి సిద్ధంగా వున్నట్లు కూతవేసింది !

కంపార్టుమెంటులోకి వెళ్ళి కిటికీ వారగా కూర్చున్న నరసింహం దృష్టి ప్లాట్‌ఫారం మీద గబగబా నడుచుకుంటూ వస్తున్న హరిసర్వోత్తమరావు పై బడింది !

వెంటనే 'మాస్టారూ !' అంటూ గట్టిగా కేకవేశాడు !'

హరిసర్వోత్తమరావు పరుగున అక్కడికి వచ్చి శిష్యుని సాదరంగా కౌగలించుకొని అన్నాడు.

"విష్ యూ ఆల్ ది బెస్ట్ !"

రైలు కదిలింది !

హరిసర్వోత్తమరావుతో పాటు, మిత్రులు చేతులు వూపుతుండగా రైలు వేగం పుంజుకుంది!

...... ఆలోచనలలోంచి తేరుకునే సరికి బస్సు మదరాసు చేరుకుంది ! బస్సులో నుండి దిగి నరసింహం సరాసరి హరిసర్వోత్తమరావు నివాసం చేరుకున్నాడు !

తలుపు వేసి వుంది !

'మాస్టారూ !' అంటూ చిన్నగా తలుపు తట్టాడు !

తలుపు తెరుచుకుంది !

"నరసింహంగారా రండి !" అంటూ ఆహ్వానించాడు నాగభూషణం !

"మాస్టారెక్కడ ?"

"రండి !" అంటూ హరిసర్వోత్తమరావు వున్న గదిలోకి తీసుకొని వెళ్ళాడు నాగభూషణం!

మంచం మీద పడుకుని వున్న హరిసర్వోత్తమరావును చూసేసరికి నరసింహం కళ్ళలో నీళ్ళు తిరిగాయి !

'ఎంత భారీ విగ్రహం నేడెంత బక్కచిక్కింది !' అనుకున్నాడు మనస్సులో.

ఆయన పక్కకు, పక్కనే వున్న కుర్చీలో నరసింహాన్ని ఆశీనుణ్ణి చేసి నాగభూషణం, కళ్ళు మూసుకొని పడుకొన్న వున్న హరిసర్వోత్తమరావును మెల్లిగా తడుతూ అన్నాడు !

"బాబూ ! మీ శిష్యరత్నం నరసింహం గారు వచ్చారు !"

మెల్లిగా కదిలి లేచి, "ఎవరూ ... ఎవరొచ్చారు ?" అంటూ లేవబోతున్న హరిసర్వోత్తమ రావును మెల్లిగా పట్టుకొని కూర్చోబెట్టి "నరసింహంగారు" అని మళ్ళీ చెప్పాడు నాగభూషణం!

"నేను మాస్టారు నంద్యాల నరసింహాన్ని !"

"నువ్వా నరసింహం ! త్వరగా గుర్తించలేకపోయాను. ఆరోగ్యం కూడా అంతంత మటుకే ! కనుచూపు కూడా కొంచెం మందగించింది. నన్ను చూడటానికొచ్చావా బాబూ !"

"అవును మాస్టారు ! గాంధీ గ్రాం నుండి ఎ.ఐ.సి.సి. కో ఆపరేటివ్ ఆర్గనైజర్స్ ట్రెనింగ్ క్యాంపు పూర్తి చేసుకొని, మిమ్ములను చూసి పోదామని !"

"చాలా సంతోషం నాయనా !"

"మాస్టారూ ! మీరేమనుకోకపోతే నాదొక చిన్న విన్నపం !"

"చెప్పు నరసింహం !"

"మీ ఆరోగ్యం ఎలా వుంది ?"

"చూస్తున్నావుగా ! బి.పి., షుగర్ వుందట ! డాక్టర్లు అంటున్నారు. నాకైతే అవేమి కన్పడ్డం లేదు. మా నాగభూషణం ఈ గదిలో నన్ను కట్టిపడేశాడు ఏ పని చేయవద్దంటూ ! నాకేమో ఇప్పటికీ బాధగా వుంది. ఏ పని లేకుండా మదరాసులో గడుపుతున్నందుకు ! నాకేమో మన ఆంధ్ర రాష్ట్రానికి రావాలని తహతహగా వుంది ! అయితే ఏం చేయను ?"

"మాస్టారూ మీరు తప్పక వద్దురు గానీ ... నా మాట ఒకటి వింటారా ?"

"వినక ఏం చేస్తాను ? ఈ పరిస్థితిలో !"

"ముందుగా మీ ఆరోగ్యం మెరుగుపడాలి ! మీకు తెలుసుగా చెరుకువాడ వెంకట నరసింహం పంతులు గారికి, వారి వైద్య సదుపాయము నిమిత్తము కేంద్ర ప్రభుత్వము కొంత మొత్తము మంజూరు చేసి ఆదుకొన్నది. మీరు స్వాతంత్ర్యపోరాటం జరిపిన సమరయోధులు! మీరు అనారోగ్యముతో బాధపడుతున్నారని తెలిస్తే ఆదుకోడానికి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు పిడతల రంగారెడ్డిగారు తప్పక సహకరిస్తారు. వారికి మీ మీద ఎంతో గౌరవం

వుంది. కాన దరఖాస్తు ఇస్తే నేను తప్పక ఈ ప్రయత్నం సాధించి తీరుతాను. మీ శిష్యునిగా నా బాధ్యత కూడా !" అంటూ వినయంగా నచ్చచెప్పాడు.

హరిసర్వోత్తమరావు అంగీకరించటంతోనరసింహంతోపాటు, నాగభూషణం ముఖంలో చిరునవ్వు తాండవించింది !

ధరఖాస్తు అందుకొని నరసింహం మాస్టారు దగ్గర శలవు తీసుకున్నాడు.

నరసింహం వెళ్ళిన ఏడవ రోజే హరిసర్వోత్తమరావు అనారోగ్యానికి గురి అయ్యాడు. ఆ రాత్రే రక్తపు పోటు ఎక్కువయింది !

హరిసర్వోత్తమరావు అంగీకరించకున్నా బలవంతంగా హాస్పిటల్‌లో చేర్పించాడు పార్థసారధి.

హాస్పిటల్లో స్పృహ తప్పాడు హరిసర్వోత్తమరావు !

అందరిలోనూ భయాందోళన !

సెలైన్ ఎక్కించారు ! తెల్లవారాక స్పృహ వచ్చిందే కాని మాట పెగలలేదు. అందరి వంక అదోలా చూస్తుండిపోయాడు.

హరిసర్వోత్తమరావు పరిస్థితికి నాగభూషణం కళ్ళలో కన్నీరుబికింది. ఆ కన్నీటి ప్రార్థన వల్లే కాబోలు రెండు రోజులు గడిచాక హరిసర్వోత్తమరావు నోట మాట పెగలింది !

అందరి ముఖాల్లో కొద్దిపాటి ఆనందం !

కూతురి వంక చూస్తూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

"నన్నింటికి తీసికెళ్ళండమ్మా ! నాకిక్కడ వుండాలన్పించడం లేదు !"

మామగారి అభ్యర్థనను డాక్టరుగారికి తెలియజేశాడు పార్థసారధి !

"వారున్న పరిస్థితుల్లో ఇంటికి తీసుకెళ్ళటం ఏ మాత్రం మంచిది కాదు. కనీసం ఇంకో వారమైనా ఇక్కడే వుండాలి !" అన్నాడు డాక్టర్.

'అలాగే !' అంటూ తలాడించక తప్పలేదు పార్థసారధికి !

వారం రోజులు గడిచాయి !

మరోవారం కూడా !!

హరిసర్వోత్తమరావు కొంత తెప్పరిల్లుకున్నాడు.

ఆ సమయంలో ...

చేతిలో కవరు పుచ్చుకొని తనకు దగ్గరగా వచ్చిన నాగభూషణాన్ని చూస్తూ అన్నాడు హరిసర్వోత్తమరావు.

'ఏమిటది ? నాగభూషణం !"

"రిజిష్టరు కవరు బాబూ ! ముందుగా ఇందులో సంతకం చేయండి !" అంటూ అక్నాలెడ్జ్‌మెంటు కార్డు మీద సంతకం చేయించుకున్న తర్వాత, కవరు విప్పి చదివి సంతోషం పట్టలేకపోయాడు నాగభూషణం !

సంతోషాన్ని గమనించిన హరిసర్వోత్తమరావు కారణం అడిగాడు.

నాగభూషణం చెప్పుకొచ్చాడు !

"బాబూ ! కేంద్రప్రభుత్వంలోని దేశీయాంగ శాఖామాత్యులు, మీ ఆదర్శ త్యాగము స్వయముగా తానెరుగుదుననియు, రాజకీయ పింఛను విధానము లేనందున పైకమును తన ప్రత్యేక నిధి నుండి వారి వైద్య సదుపాయమునకు వుపయోగించుకొనవచ్చునని తెలుపుతూ రూ. 2,000/- లకు డ్రాఫ్టును పంపినారు !"

తనను కేంద్ర ప్రభుత్వములోని గోవిందవల్లభ పంత్ స్వయంగా గుర్తించినారన్న వార్త విని ఆ రోజంతా హుషారుగా గడిపారు హరిసర్వోత్తమరావు ! కాని ఆ మరురోజే మళ్ళీ పరిస్థితి మొదటికి వచ్చింది !

రోజు రోజుకు ఆరోగ్య పరిస్థితి దిగజారడం తప్ప మెరుగుపడ్డంలేదు !

"మృత్యువు సమీపించింది." అన్న విషయాన్ని డాక్టర్ సూచన ప్రాయంగా తెలియజేయడంతో హరిసర్వోత్తమరావును ఇంటికి చేర్చారు.

పక్క దిగలేని అశక్తుడయ్యాడు హరిసర్వోత్తమరావు. పక్క పైనే అన్నీ ? ? ? ? ?

రేయింబవళ్ళు తన పక్కనే అంటిపెట్టుకుని తనకు అంత్య సేవలు చేస్తున్న నాగభూషణం, అతని భార్య రాజేశ్వరమ్మ వంక చూస్తూ గాద్గద స్వరంతో చెప్పాడు హరిసర్వోత్తమరావు.

"ఏనాటి రుణానుబంధమో ఈ జన్మలో ఇలా తీర్చుకొంటున్నాను. వచ్చే జన్మంటూ వుంటే తప్పక మీ కడుపున పుడతాను."

"పితృరుణం తీర్చుకోవడం మీ అభిమాన పుత్రునిగా నా బాధ్యత !" అంటూ హరిసర్వోత్తమరావు నోటికి జావ అందించాడు నాగభూషణం. జావ తాగాక ముఖాన్ని తుడిచింది రాజేశ్వరమ్మ !

అంపశయ్య మీద వున్నట్లుంది సర్వోత్తమరావుకు.

"నాగభూషణం నా ఆరోగ్యం కుదుటపడుతుందంటావా ?"

"తప్పకుండా !" అని జవాబిచ్చాడు నాగభూషణం.

"నీ నోటి వాక్కు ఫలిస్తే నాకో పని చెయ్యాలి ?"

"మీకన్న ఆప్తులు నాకు ఇంకెవరున్నారు బాబు ! తప్పకుండా చేస్తాను."

తడబడుతున్న మాటలతో చెప్పాడు హరిసర్వోత్తమరావు.

"ఇప్పట్నుంచే ఒక పాత కారు కోసం ప్రయత్నించెయ్ ! ఒకసారి తెలుగుదేశంలో ప్రతిగ్రామమూ సందర్శించాలి ! నా తమ్ముళ్ళతో, చెల్లెళ్ళతో చెప్పాలి. మీరు అక్షరాస్యులు అవండి ! తోటి నిరక్షరాస్యులకు అక్షరాస్యత ఇయ్యండి ! గ్రంథాలయం ఏర్పాటు చేసుకోండి! విజ్ఞానం ద్వారా స్వయం కృషితో ఆర్థికాభివృద్ధి సాధించండి ! ప్రపంచ రాజ్యాల సమాఖ్యలో మనం వున్నతస్థానం పొందాలి ! ఇదే నా చివరి ప్రయత్నం. కోరిక !"

"అలాగే" అంటూ తల ఆడించినా నాగభూషణం మనస్సులో తీరని ఆవేదన !

"ఈ కోరిక తీర్చగలనా !" అంటూ హృదయంలో మదనపడసాగాడు నాగభూషణం.

హరిసర్వోత్తమరావు శరీరం పూర్తిగా చిక్కిశల్యమై ఎముకల గూడుగా మారింది. పక్కే సర్వస్వం కావటం వల్ల ఆ ఎముకల గూడుకు పుండ్లు కూడా పడ్డాయి. నోటికి అందుతున్న జావ గొంతుదాటి లోపలికి వెళ్ళటం లేదు.

దినగండం నూరేళ్ళ ఆయుస్సు అయ్యింది !

వున్నట్లుండి ఒక రోజున కొడిగట్టబడిన దీపపులాంటి కళ్ళతో అందర్ని తన దగ్గరకు రమ్మని సైగ చేసి అతికష్టంగా ఒక్కోమాట పెగల్చుకొని చెప్పాడు హరిసర్వోత్తమరావు.

"న ... న్ను .. ఇ .. క్క .. డ .. చా .. వ .. ని .. వ్వ .. కం .. డి. ఆ .. ఆ .. ంధ్ర .. దే .. శా .. ని .. కి .. తీ .. సు .. కె .. ళ్ళం .. డి."

ఇవే హరిసర్వోత్తముని చివరి పలుకులు !

ఆ పలుకులను నిజం చేయ్యాలన్న తాపత్రయం ఆరంభమయ్యేలోపు "ఈ సర్వోత్తమరావు' ' 'హరిసర్వోత్తముని' పిలుపందుకొని పయనమయ్యాడు !

శ్వాస ఆగింది !

ఎముకల గూడే మిగిలింది !!

ఆ రోజు 29.2.1960.

"బాబుగారూ ! మీ కోరికలు కార్యరూపం ధరిస్తున్న సమయంలోనే హఠాత్తుగా మమ్ములను విడిచి వెళ్ళారా ? ఇక నాకు పెద్ద దిక్కెవ్వరు ! ఇక నేనెవ్వర్ని సంప్రదించాలి ? నాకు సలహాలు ఇచ్చువారెవ్వరు ? మీరు కొనసాగిస్తున్న గ్రంథాలయోద్యమం, మీరులేని లోటుతో ఎలా ముందుకు తీసుకెళ్ళగలను ? చివరికి నన్ను ఒంటరి చేసి వెళ్ళారా ? .. బాబూ .. మీ నివాస గృహ నిర్మాణం పూర్తి కాగానే అక్కడికి మిమ్మలని చేర్చాలన్న నా ఆశ అడియాసలు చేశారా బాబు ! మీ ఆరోగ్యం నెమ్మదయితే ఆంధ్రదేశ సంచారానికి ఒక కారు కూడా సిద్ధం చేయాలనుకున్నానే ! కన్న కలలన్నీ కరిగిపోయాయి బాబూ ! .. ఇక నేనెవరి కోసం జీవించాలి? మీ అభిమాన పుత్రునిగా, మీ పట్ల నా బాధ్యతలు సక్రమంగా నిర్వర్తించలేని నా బ్రతుకెందుకు?

నేను ఓడిపోయాను బాబూ ! అందుకు నాకు తగిన శిక్షే విధించారు. ఇక నాకు క్షమాబిక్ష ఎవరు ప్రసాదిస్తారు ? ఎవరు ప్రసాదిస్తారు ? ?" అంటూ హరిసర్వోత్తముని శరీరం పైబడి దుఃఖించసాగాడు నాగభూషణం.

అలా దుఃఖంలో తపిస్తున్న నాగభూషణాన్ని అతి కష్టం మీద వారించి చెప్పాడు పార్థసారధి !

"పెద్దవారు మీరే ఇలా బెంబేలు పడిపోతే ఎలా ! చిన్నది, ద్వారకను ఓదార్చువారెవ్వరు? లేవండి !" అంటూ నాగభూషణాన్ని అక్కడ నుండి లేపి, దుఃఖంతో తల్లడిల్లిపోతున్న ద్వారక దగ్గరకు పిలుచుక వచ్చి, తాను మామగారికి అంత్యక్రియల ఏర్పాట్లు గావించే పనిలో నిమగ్నమయిపోయాడు పార్థసారధి !

ద్వారకమ్మ చెంతకు చేరిన నాగభూషణం, ఆమెతో "బాధపడకమ్మా ! ఒక విధంగా నాన్నగారు అదృష్టవంతులనే చెప్పాలి ! స్వీయ జీవితంలో ఉపయోగం పొందలేదు – ఎందుకంటే అది వారు వాంఛించలేదు గనుక ! అయినా వారు చేపట్టిన ఉద్యమాలలో ఆయన ఘనవిజయం సాధించారు ! భారత దేశానికి స్వాతంత్ర్యం లభించింది ! ఆంధ్రరాష్ట్రం సిద్ధించింది. విశాలాంధ్రము అవతరించింది ! వారికత్యంత ప్రీతిపాత్రమైన వయోజన విద్య, గ్రంథాలయాల వ్యాప్తి కార్యక్రమం కూడా పురోగమనంలో వుంది. ఈ విజయాలు వారి జీవితకాలంలో సంభవించడం ఎంతో అదృష్టమని చెప్పాలి ! ఇక మరణమంటావా ? అది మన చేతిలో వుందా తల్లీ ! పెద్ద వయసు. మనసు దిటవు చేసుకో తల్లీ !" అంటూ ఓదార్చసాగాడు.

అలా ఓదారుస్తున్న నాగభూషణంతో అంది ద్వారకాబాయి. "జీవితంలో నాన్నగారు ఏం సుఖపడ్డారు ?"

"గొప్పవాళ్ళ జీవితాలు ఎప్పుడూ సుఖమయం కావు తల్లీ !"

అంత్యక్రియల ఏర్పాట్లు పూర్తి చేశాడు పార్థసారధి !

శోకతప్త హృదయుల మధ్య చితికి నిప్పంటించబడింది ! జ్వాలలు ఆకసానికెగశాయి !

బాధా తప్త హృదయుడైన నాగభూషణం వినమ్రుడై అంజలి ఘటించాడు హరిసర్వోత్తమరావుకు !

"మీ ఆశయ సాధనే నా జీవిత లక్ష్యం" అంటూ !

* * *

హరిసర్వోత్తమరావు స్మృతికి చిహ్నంగా మిగిలిపోయినది ఆంధ్రప్రదేశ్‌లో ఒక్క 'సర్వోత్తమ భవన్' మాత్రమే – అదీ విజయవాడలో !



*